క్రొత్త

# పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం



# అధిక రుచికరం అధిక సంపూర్ణం

ప్రేమతో మీరు పెట్టే ప్రతి
చెంచాడు పాపాయి
పెరుగుదలకు మంచిది.




పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం. కలపడం సులభం. పాపాయికి తినిపించడం సులభం.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

పాపాయి పెరుగుదలకు అత్యావశ్యకమైన ప్రోటీన్‌తో సమృద్ధం. ఆరోగ్యవంతమైన రక్తంకోసం అదనంగా ఐరన్ కలిగినది. గట్టి పళ్లు, ఎముకలకోసం సరియైన నిష్పత్తిలో కాల్షియం మరియు ఫాస్ఫరస్ కలిగినది. పాపాయి సున్నిత జీర్ణశక్తికి అనువుగా ముందుగానే పచనం చేయబడినది.

పాలతో కూడిన ఫారెక్స్ ఘన ఆహారం.

ప్రతి చెంచాలో అధిక సంపూర్ణ ఘన ఆహారం.

CLARION/B/GX/3/183 TEL

# చతుర

సంపుటి : 7 జూన్ 1984 సంచిక : 5


## ఈ నెల సమగ్ర నవల

అడవి ప్రాంతంలోని అతిచిన్న రైల్వేస్టేషన్ అది. అలాంటి చోటికి ఓ రాత్రివేళ వంటరిగా లక్షల విలువచేసే ఆభరణాలతోసహా హడావిడిగా వచ్చిందా అందాలరాశి. రైలు దాటిపోతే, ఆ ఆభరణాలన్నీ స్టేషన్ మాస్టరుకే దాచమని ఇచ్చింది. ఆ తర్వాత యువకుడైన అతని ఇంట్లోనే ఆ రాత్రికి ఉండిపోతానంది. ఇంట్లో ఎవరూ లేరన్నాసరే, నిర్భయంగా అతని వెంట ఇంటికి బయలు దేరింది

ఎవత్తామె? ఎక్కడివా నగలు? ఎందుకంత అర్ధరాత్రి ఒంటరి ప్రయాణం? ముక్కూమొగం తెలీని అపరిచితుని ఇంట ఒంటరిగా గడిపే తెగింపు ఆమెకెలా వచ్చింది? అనుకోని...



...గా అరుదెంచిన ఆ సౌందర్యరాశిపట్ల యువకుడైన ఆ స్టేషన్ మాస్టర్ ప్రవర్తన ఎలా నడిచింది? అతనా ఇంట్లో ఒంటరిగా ఉండటానికి గల కారణాలేమిటి? ఆ ఇల్లు సంసారం చేస్తున్న వ్యక్తి ఇల్లులాగానే ఉన్నా ఇంట్లో 'గృహిణి' కనిపించని కారణమేమిటి?

### గుల్షన్ నందా

చివరికంటా ఆసక్తికరంగా నడిపిన విభిన్న పాత్రల విరుద్ధ స్వభావాల సంఘర్షణా చిత్రణ 'అతిథి' ఈ నెల చతుర సమర్పిస్తున్న మరో ఆసక్తికరమైన నవల. అనువాదం అనే అనుమానం కూడా కలగనివ్వని కన్నెర రూబెన్ అనువాదం 'అతిథి'

---

*ముఖ చిత్రం : దిలీప్ బెనర్జీ*

ఉషాకిరణ్ మూవీస్













# సుందరి సుబ్బారావు

నిర్మాత
రామోజీరావు

దర్శకత్వం
నరసింహారావు రేలంగి

నిర్వహణ: మిక్కిలినేని జగదీష్‌బాబు

మాటలు: ఆదివిష్ణు సంగీతం: సత్యం ఫొటోగ్రఫీ: బి. కోటేశ్వరరావు కళ: భాస్కరరాజు

కూర్పు: డి. రాజగోపాలరావు

# సృష్టి విచిత్రం

లండన్‌లోని షెఫీల్డ్‌లో వుండే రోజలిన్‌వాకర్ అనే 33ఏళ్ళ మహిళకు పిల్లలు కలగరని తెలిసింది. దాంతో ఆమె, ఇంజనీరైన ఆమె భర్త పాల్ సంప్రదించుకొని 'టెస్ట్‌ట్యూబ్' పద్ధతిలో బిడ్డను పొందాలని నిర్ణయించుకున్నారు.

ఆ పద్ధతి కూడా మొదటిసారి విఫలమైంది. రెండవసారి ప్రయత్నించి రోజలిన్ 'లూసీ' అనే పాపకు జన్మనిచ్చింది. 'టెస్ట్ ట్యూబ్' పద్ధతిద్వారా పాప పుట్టేందుకు ఆ దంపతులకి 5 వేల డాలర్లు ఖర్చయింది. ఇంకా పిల్లలు కావాలని వున్నా, దానికయ్యే ఖర్చు భరించలేక వాళ్ళు పిల్లలపై ఆశ వదులుకున్నారు.

ఇంతలోనే రోజలిన్ గర్భవతి అని తేలింది. ఆమెను పరీక్షించిన డాక్టర్లు 'ఆమెకు ఒక్కరు కాదు,, కవలపిల్లలు పుట్టనున్నా'రని వెల్లడి చేశారు.

ఈ శుభవార్తకు కారణం లూసీయే అనుకుంటోంది రోజలిన్. లూసీ పుట్టుక వల్ల తనలోని లోపం సవరింపబడి, తను సహజంగా గర్భం ధరించేట్టు తనలో ఏదో జరిగి వుంటుందని రోజలిన్ వూహ.

"ఇక నాకసలు పిల్లలే కలగరనే భావాన్ని మనసు జీర్ణించుకుంటున్న సమయంలో, ఇలా కవలపిల్లలు పుడతారని డాక్టర్లు చెప్పగానే నేను చాలాసేపు నమ్మలేకపోయాను" అంటోందామె.

రోజలిన్ కూడా కవలపిల్లల్లో ఒక్కరైగానే జన్మించింది. "మా వంశంలో రెండు తరాలలో ఏడుసార్లు కవలపిల్లలు పుట్టారు. మావాళ్లలో కొందరికి ఒక్క



# ప్రపంచం

కాన్పులో ఇద్దరు పిల్లలు పుడుతుండగా నాకు ఒక్కబిడ్డకూడా కలగకపోవడం అన్యాయమనుకుంటూ బాధపడుతుండే దాన్ని. కాని, హఠాత్తుగా ఇప్పుడా పరిస్థితి మారిపోయింది" అని ఎంతో సంతోషంగా చెబుతోందామె.

రోజలిన్ ఏడేళ్ళ క్రితంనుంచి పిల్లల కోసం ప్రయత్నిస్తోంది. ఆమె ఒక మేజర్ ఆపరేషన్ చేయించుకున్నా ఫలితం లేకపోయింది. చివరికి డాక్టర్లు 'ఆమెకు పిల్లలు సహజంగా పుట్టరని' చెప్పడంతో 'టెస్ట్‌ట్యూబ్' పద్ధతిలో లూసీని కంది. ఇప్పుడామె సహజంగా గర్భందాల్చి కవలపిల్లలకి జన్మనివ్వ బోవడం సృష్టి విచిత్రమే అనుకోవాలి!

## గులాబీల వర్షం

క్రీ. శ. 220 నాటి రోమ్ చక్రవర్తి బాలస్‌కి విలాసవంతమైన జీవితంపై మోజెక్కువ! బాలస్‌కి గులాబీపూలంటే చాలా ఇష్టం. తూర్పు ఐరోపాలోని తోటల నుంచి వేర్వేరురకాల రంగురంగుల గులాబీలను వాహనాల నిండుగా తెప్పించేవాడు. 'పాటర్నిలియా' అనే రోమన్ ఉత్సవం మంచి రసపట్టులో వున్నప్పుడు ఆ గులాబీలను పైనుంచి అతిథులపై చల్లాలని బాలస్ కోరిక.

అతిథులు పెగ్గులకొద్దీ మద్యం తాగి, రుచికరమైన ఆహారాన్ని బాగా తిని కేరింతలు కొడుతున్న సమయంలో ఉత్సవం జరుగుతున్న మందిరం పైకప్పును తొలగించేవారు. పైనుంచి వేలకొద్దీ గులాబులు అతిథులపైన వర్షిస్తున్నట్టుగా పడేవి.



దాంతో మందిరంలో వున్నవారి మధ్య కలకలం ప్రారంభమై, ఆ గొడవలో చాలా మంది గాయపడేవారు. అనేకులు ఊపిరాడక చనిపోయేవారు. అలాంటి సంఘటన చరిత్రలో మరొకటి లేదు.

'జీవితం గులాబీపూల పాన్పు కాదు' అని ఓ ఆంగ్ల సూక్తి! పూర్వం రోమన్ సామ్రాజ్యంలోని సైబేరిస్ అనే పట్టణం గులాబీలకి ప్రసిద్ధి చెందింది. ఆ పట్టణంలోని ధనికులు గులాబీ మొగ్గలు నింపి తయారుచేసిన తలగడలపై నిద్రించేవారు.

గ్రీసులోని ప్రజల జీవితాల్లో కూడా గులాబీలు ఒక భాగంగా వుండేవి. హోమర్ రాసిన 'ఇల్లియాడ్' అనే గ్రంథంలో గులాబీలపై పలు అందమైన వర్ణనలున్నాయి. సెనెకా అనే రోమన్ రచయిత 'ఉన్నత వంశీకులకి భవనాల్లోనూ, ప్రాసాదాల్లోనూ పన్నీటిఫౌంటెన్లు లేక చిన్న రిజర్వాయర్లు తప్పక వుండే' వని రాశాడు. వారి వుత్సవాలలో గులాబీలు ప్రధానాంశంగా వుండేవి.

ఇంగ్లండ్‌లో చాలామంది చక్రవర్తులు గులాబీలను తమ రాచరికపు చిహ్నంగా వుపయోగించేవారు. ఈ సాంప్రదాయం మొదటి ఎడ్వర్డ్‌తో ప్రారంభమై, 4వ హెన్రీతోపాటు కొనసాగి, ఒకటవ ఎలిజబెత్ రాణి కాలం వరకూ నిలచివుంది. ప్రాచీన కాలంలో క్రైస్తవులు గులాబీలను అట్టే ఇష్టపడేవారు కాదు. వారి చర్చి కట్టడాలలో ఎక్కడా గులాబీపూలను చెక్కకుండా నిషేధించారు. కొంతకాలం పాటు గులాబీపూల గుత్తులను పట్టుకున్న వారిని చర్చిలోకి రానిచ్చేవారు కాదు కూడా. తర్వాత ఆ నిషేధం తొలగిపోయింది.

ఒకానొకప్పుడు తూర్పు ఐరోపా ప్రాంతంలో గులాబీలనే నాణాలుగా వుపయోగించేవాళ్లు. భారతదేశంలో హిమాలయాలలోని 'తరాయ్' ప్రాంతాలలో వేల సంవత్సరాల క్రితమే గులాబీపూలు వుండేవని కనుగొన్నారు. బల్గేరియాలో గులాబీ పూలు 'రోజ్ వేలీ' అనేచోట ఎక్కువగా లభిస్తాయి. అక్కడ సీజన్‌లో టన్నుల కొద్దీ గులాబులు పూస్తాయి.

చాలా పూర్వపు రోజుల్లోనే 250 రకాలగులాబీలు కనబడేవి. కొన్ని పద్ధతుల ద్వారా ఇప్పుడు బంగారం, కుంకుమ, వైలెట్, ఆకుపచ్చ రంగులలో కూడా గులాబీలు పూయిస్తున్నారు. కాని, నీలి రంగు గులాబీలను పూయించాలనే శాస్త్రజ్ఞుల ప్రయత్నం ఇంకా విజయవంతం కాలేదు!

## వారి దృష్టిలో మనం

మన యువతులు ఆధునిక దుస్తుల్లో పాశ్చాత్యులను అనుకరించేందుకు ప్రయత్నిస్తారు. కాని, విదేశీ మహిళలు భారతీయ స్త్రీలలో తమకు నచ్చే అంశాలను ఆసక్తికరంగా వెల్లడిస్తున్నారు.

"భారతీయ స్త్రీల సహజ సౌందర్యమంటే నాకిష్టం. మా టీచర్ ఒకసారి భారతదేశం వెళ్ళినప్పుడు చీర కట్టుకోవడం నేర్చుకుంది. అది చూసి నేనూ నేర్చుకున్నాను. చీర కట్టుకోవడం భలే బావుంటుంది. భారతీయ స్త్రీలు తలలో పూలు పెట్టుకునే పద్ధతి కూడా నాకిష్టం. కాని నేను తల కత్తిరించుకోవడం వల్ల నాకా అవకాశం లేదు" అంటోందొక అమెరికన్ యువతి.

"భారతీయ స్త్రీలలో వుండే ఆకర్షణ, బాగా శ్రమించే గుణం, కుటుంబం పట్ల అనురక్తి, పిల్లలు, పెద్దలపైన ఉండే





# మీ పళ్ల మీద చిగుళ్ల పట్టు సడలనివ్వకండి!



## కేవలం ఫోర్‌హెన్స్ మాత్రమే చిగుళ్లను గట్టి పర్చగల ప్రత్యేక అస్ట్రింజంట్ కల్గివున్నది. చిగళ్లు గట్టిగా వుంటే పళ్లు ఎక్కువ కాలం నిలుస్తాయి.

అమెరికాదేశపు ప్రఖ్యాత దంత వైద్యుడు డా. ఆర్.జె. ఫోర్‌హెన్ తాను తయారు చేసిన టూత్‌పేస్టులో ఒక ప్రత్యేక అస్ట్రింజంట్ చేర్చాడు. ఇది నేరుగా చిగుళ్ల మీద పని చేసి, వాటిని బిగుతు చేసే ఒక విశిష్ట పదార్థము. వాటిని బలపర్చి, పళ్ల మీద వాటికి మంచి పట్టునిస్తుంది.

ఇలా మీ పళ్లకు దృఢమైన ఆధారం మరియు దీర్ఘ ఆయుస్సు ఇస్తుంది.







**ఫోర్‌హెన్స్ – ఇది పళ్ల డాక్టరు సృష్టించిన టూత్ పేస్టు.**

339F 172 TEL

నిజమైన ప్రేమ నాకు బాగా నచ్చుతాయి. కాని అక్కడ పెద్దలే పెళ్లిళ్లు ఏర్పాటు చేయడం నాకు నచ్చదు. భారతదేశంలోని యువతులు తల్లిదండ్రులు సూచించిన ఏ యువకుడినైనా, అతని గురించి పూర్తిగా తెలుసుకోకుండానే ఎలాంటి వ్యతిరేకత చూపకుండా పెళ్లికి అంగీకరిస్తారు. ఇక్కడ మేమైతే పెళ్లి గురించి ఓ నిర్ణయానికి రాకముందే చాలాకాలం పాటు కలిసి తిరిగి ఒకరి గురించి ఒకరం ఎంతో తెలుసుకుంటాం. ఇన్ని జాగ్రత్తలు తీసుకున్నా ఇక్కడ అనేక పెళ్లిళ్లు విచ్ఛిన్నమవడం వేరే విషయం.

"భారతీయ యువతులు మరీ ఎక్కువగా సర్దుకుపోయే స్వభావం కలవారు. అందుచేతనే భర్తలువారిపై బాగా పెత్తనం చెలాయిస్తారు. పెళ్లి ఖర్చుల దృష్ట్యా చూస్తే భారతీయయువతులు చాలా అదృష్టవంతులనే అనుకోవాలి. ఆ ఖర్చుల బాధ్యత అంతా ఆమె తల్లిదండ్రులే చూసుకుంటారు. అదే మా దేశంలోనైతే, ఏ యువతి అయినా పెళ్లి చేసుకోదలుచుకుంటే మరింత శ్రమపడి బాగా డబ్బు సంపాదించాకే తన స్వంత ఖర్చుతో చేసుకుంటుంది" అంటోంది మరో యువతి.

సుసిపింటర్ అనే మహిళ "భారతీయ స్త్రీల ముక్కుపుడక చూస్తే నాకు వణుకొస్తుంది. సున్నితంగా వుండే ముక్కుకి రంధ్రం ఎలా పొడవగలరా అని నేను ఆశ్చర్యపోతాను. అలా ఒంటి నిండా నగలు దిగేసుకోనంత మాత్రాన అందంగా కనపడరా? బొట్టు పెట్టుకునే పద్ధతి నాకు నచ్చింది. కాని, వాళ్లు కళ్లకు అంత ఎక్కువగా కాటుక పూసేయడం నచ్చలేదు. కాటుక రేఖామాత్రంగా వుంటేనే బావుంటుంది!" అంది.

"భారతదేశంలో యువతుల్ని తల్లిదండ్రులు హద్దుల్లో వుంచడం బాగుంది. ఇక్కడ మాకు వున్న విపరీత స్వేచ్ఛ ఒకవిధంగా భవిష్యత్తుని దెబ్బతీస్తోంది. ఓ భారతీయ యువతి తల్లి వారానికొకసారి ఆమె ఉండే హాస్టల్‌కు వచ్చినప్పుడల్లా బాగా చదువుకోమని చెబు



తుండేది. ఇప్పుడు డాక్టర్ అయిందామె. నేను తల్లిదండ్రుల నుంచి చదువు గురించి ఎలాంటివ త్తిడిలేక ఓ గుమాస్తాగా మిగిలిపోయాను" అంది మరొకామె.

"పొడుగాటి జుట్టులో గుబాళించే పూలు, చీర కట్టువల్ల హాయలుగా సాగే నడక భారతీయ స్త్రీకి అసమానమైన సౌందర్యాన్నిస్తాయి. చీర కట్టుకోవడంలో భారతీయ స్త్రీకి వుండే ఓపికని నిజంగా అభినందించాలి. భారతీయ స్త్రీలు అంత ఖచ్చితంగా నుదుటి మధ్యలో బొట్టు ఎలా పెట్టుకుంటారా అని నేను ఆశ్చర్యపోతుంటాను. మా ప్రధానమంత్రి మార్గరెట్ థాచర్ ఇటీవల భారతదేశాన్ని సందర్శించినప్పుడు బొట్టు పెట్టుకు తిరిగినట్టు నేను విన్నాను. ఒకసారి నేను గౌను వేసుకొనే బదులు చీర కట్టుకోవాలనుకుంటాను. కాని చీరను భారతీయ యువతులకిమల్లే త్వరగా జారిపోకుండా చుట్టుకోవడమెలాగో నాకు తెలియదు. బొట్టు పెట్టుకోవాలనికూడా చాలాసార్లు ఆశపడ్డాను. కాని ఎలాగో సరిగ్గా తెలీక నేర్పేవాళ్ళ కోసం ఎదురుచూస్తున్నాను. త్వరితంగా అభివృద్ధి చెందుతూ, ఎన్నో మార్పులకి లోనవుతున్న ఈ ప్రపంచంలో భారతీయ స్త్రీలు మరికొంచెం స్వతంత్రంగా, ధైర్య సాహసాలతో మెలగాలి" అంది వివరగా మెర్లీ లిటియార్డ్ అనే బ్రిటిష్‌మహిళ.

## ప్రపంచ రికార్డులు

ప్రతివారికీ అచ్చులో తమ పేరు చూసుకోవాలని గాని, పేపర్‌లో తమ ఫొటో చూసుకోవాలని గాని అంతర్గతమైన కోరిక వుంటుంది. ఈ కోరికే కొందరిని విపరీతమైన, ప్రమాదకరమైన పనులు చేసేందుకు పురికొల్పుతుంది. ప్రపంచ రికార్డులు ఆవిధంగానే సృష్టింపబడతాయి.

ప్రపంచ రికార్డులు సాధించిన భారతీయులు కూడా కొందరున్నారు. ఉత్తరప్రదేశ్‌లోని ప్రతాపఘర్‌కి చెందిన మసూరియాదిన్ అనే అతను, 1949 నుంచి తన మీసాలను పెంచుతూ



ఇప్పటికి 102 అంగుళాల మీసాలను పెంచాడు. కలకత్తావాడైన మురారి మోహన్ ఆదిత్య తన ఎడమచేతి అయిదు వేళ్లకి 15 అంగుళాల పొడవైన గోళ్లను పెంచాడు. షాజహాన్‌పూర్ నివాసి స్వామి మౌజ్‌గిరి మహరాజ్ 1955 నుంచి 1972 వరకూ 17 ఏళ్లపాటు నిలబడి ధ్యానంచేసి ప్రపంచరికార్డు సృష్టించాడు.

ప్రపంచ రికార్డు నెలకొల్పడానికి సముద్రాలు దాటడం, సముద్రంలో లోతులకంటా వెళ్లి రావడం లాంటి ఘనమైన పనులే చేయాలనుకుంటారు అనేకులు. కాని, యాపిల్‌పండు పైతోలు వలవడంలాంటి స్వల్పమైన పనులుచేసి కూడా ప్రపంచ రికార్డు సృష్టించవచ్చునని ఎవరికీ తట్టదు. న్యూయార్క్‌కి చెందిన 17 ఏళ్ల కేథీ వాఫిల్ ఒక పోటీలో 20 అవున్సుల బరువున్న యాపిల్ తోలును 172 అడుగుల పొడవుగల రిబ్బన్‌లా వలిచేసింది.

నార్మన్ అనే ఆంగ్లేయుడు 54 గంటలపాటు అకార్డియన్ అనే సంగీత వాయిద్యాన్ని వాయించి, మరోవ్యక్తి 505 గంటలపాటు డ్రమ్ వాయించి ప్రపంచ రికార్డు నెలకొల్పారు. నలుగురు రొడీషియన్లు ఏకబిగిన 100 గంటలపాటు 'బెగ్‌పైప్' అనేదాన్ని వాయించి రికార్డు సృష్టించారు.

## ఫ్రెంచివాళ్ల అపరిశుభ్రత

బి. బి. సి. ప్రసారంచేసే కార్యక్రమాలలో 'అవుట్‌లుక్' అనేది చాలా మంది శ్రోతలు ఇష్టపడే కార్యక్రమం. ఆ కార్యక్రమాన్ని నిర్వహించే ప్రొడ్యూసర్లు, 'ప్రపంచంలో ప్రజలు అతి శుభ్రంగా వుండే దేశమేది?' అన్నది తెలుసుకోవడానికి ఇటీవల ప్రపంచ వ్యాప్తంగా ఓ సర్వేని చేపట్టారు.

ఆ సర్వేలో బ్రిటిష్‌వాళ్లు బాగా పరిశుభ్రంగా వుంటారని తేలింది.

తమాషా ఎక్కడంటే, చాలా అందంగా వుంటారని చెప్పుకోబడే ఫ్రెంచివాళ్లు ఎంతో అపరిశుభ్రమైన మనుషులట. ఆ సర్వేలో ఫ్రెంచివాళ్ల గురించి తెలిసిన వికారమైన అంశాలేమిటంటే- ఫ్రెంచివారిలో 50 శాతం మంది టూత్‌పేస్ట్ వుపయోగించరు. సగంమంది ఫ్రెంచి స్త్రీలకి అసలు పళ్లు తోముకునే అలవాటే లేదు. ఫ్రెంచి జనాభాలో 30 శాతంమంది అయిదురోజులకొక్కసారి మాత్రమే దుస్తులు మార్చుకుంటారు. ఫ్రెంచి దేశీయులు సగటున ఒక్కొక్కరూ నెలకి రెండు సబ్బులు మాత్రమే ఉపయోగిస్తారు.

మనదేశంలో ఎవరైనా పై సర్వేను నిర్వహిస్తే భారతీయులు అపరిశుభ్రతలో ఖచ్చితంగా ఫ్రెంచి దేశీయులను మించినవాళ్లే అని కనుగొంటారేమో!



మంచులో మునిగివున్న చిక్కని చీకటిని చీల్చుకొంటూ ఆ టాక్సీ బీనాపూర్ రైల్వేస్టేషన్ ముందు ఆగింది. బ్రేకుల కీచుమనే శబ్దంతోపాటు వచ్చిన కుదుపుకు సోనియా ఉలిక్కిపడి లేచింది. ఆమె నిద్ర పటాపంచలై బయటకు చూడాలని కారు అద్దం కిందికి దింపింది. అంతే! తీవ్రంగా వీస్తున్న చల్లని గాలి దూసుకువచ్చి ఆమె చెంపలను వాడి సూదుల్లాగా తాకింది.

టాక్సీ డ్రయివరు దిగివచ్చి వెనుక తలుపు తెరుస్తూ - "అమ్మగారూ! బండి స్టేషన్లో రెడీగా ఆగి వుంది" అన్నాడు ఆత్రంగా.

సోనియా తన ఒడిలోని బ్రీఫ్‌కేస్ జాగ్రత్తగా పొదివి పట్టుకొని పర్సులోంచి నాలుగు పదిరూపాయల నోట్లు తీసి టాక్సీ డ్రయివర్‌కు ఇచ్చింది. ఆ వెంటనే టాక్సీలో నుండి బయటకు దూకింది.

"కలకత్తాకు ఫస్ట్‌క్లాస్ టికెట్ ఒకటి ఇవ్వండి. ప్లీజ్...క్విక్!" సోనియా బుకింగ్ దగ్గరకు వెళ్ళగానే అడిగి పర్సులో నుండి డబ్బు బయటకు తీసింది.

స్పష్టంగా, మధురంగా, సితారు మీటినట్లున్న ఆ యువతి స్వరం విన్న స్టేషను మాస్టరు తల పైకెత్తి చూశాడు. అతని చూపులు గులాబీ రంగులో ఉజ్వలంగా మెరుస్తున్న ఆమె ముఖంపై నిలిచాయి. అప్రపాటు ఆమెవైపు చూసి తర్వాత అన్నాడు-"ఇది జనతా ట్రైను.. సెకండ్‌క్లాసు మాత్రమే వుంటుంది..."

"ఫరవాలేదు... ఇవ్వండి" అంటూనే పర్సులోనుంచి వందరూపాయల నోటు తీసి ఇచ్చింది. అతడు టిక్కెట్టిచ్చి మిగిలిన చిల్లర లెక్కపెడుతుండగానే సోనియా చేతిలో టికెట్టుతో రైలు దగ్గరికి పరుగు తీసింది. ఈలోపే రైలు కూడా బయలుదేరింది.

"అరే... ఆగండి. మిస్... ఓ.. మిస్... చిల్లర తీసుకొని వెళ్ళండి" అని స్టేషను మాస్టరు బిగ్గరగా అరిచాడు.

సోనియా అతని పిలుపు వినిపించుకోకుండా ట్రైన్‌దగ్గరికి చేరింది. అప్పటికే చివరి పెట్టె వచ్చేసింది. ఆమె నడుస్తున్న రైలుని ఎలాగైనా ఎక్కాలనే ప్రయత్నం చేసింది. కానీ ఆమె పట్టుకోబోయిన రైలు కడ్డీ జారిపోయింది. ఆమె తూలి కింద పడబోయి ఎలాగో నిలదొక్కుకుంది.

"మైగాడ్..." ఆమె నోటినుండి అప్రయత్నంగా ఆ మాట వెలువడింది. అలాగే నిలబడి ఒక నిట్టూర్పు వదిలింది. మంచుతెరల మధ్య దూరంగా మాయమైపోతున్న రైలుకేసి నిరాశా నిస్పృహలతో చూస్తూ ఉండిపోయింది.

సోనియా గుండె వేగంగా కొట్టుకోసాగింది. క్షణంపాటు నిశ్చేష్ఠురాలై అక్కడే నిలబడిపోయింది. తన జీవితంలో అత్యంత విలువైన ఘడియలు క్షణంలో చేయిజారి పోయాయన్నట్లుగా, నిరాశా దృక్కులతో శూన్యంలోకి చూస్తూ ఉండిపోయింది.

"మీ డబ్బులు...." అకస్మాత్తుగా వినిపించిన మాటలకు ఆమె ఉలిక్కిపడి పక్కకు తిరిగి చూసింది. పోర్టరు మిగిలిన చిల్లర చేతిలో పట్టుకొని నిలబడి వున్నాడు.

"మీరేమీ కంగారుపడకండి. ఈ టిక్కెట్టు తర్వాతి ట్రైనుకు కూడా పనికి వస్తుంది" ఆమె ముఖంలో ముసురుకొన్న విచారాన్ని, నిరాశను గమనించిన అతడు ఓదార్పుగా అన్నాడు.




"తర్వాతి ట్రైనా ... ఎప్పుడు వస్తుంది?"

"ఉదయం ఆరు గంటల పది నిమిషాలకు"

'ఆరుగంటల పది నిమిషాలకా?' స్వగతంలా అనుకొంది. ఉదయంపూట అనేది ఆమెను గుండెల్లో వాడికత్తిలా దిగి బాధపెట్టింది.

"అవును" పోర్టరు తలవూపి రైలు వచ్చేవేళను మరోసారి నొక్కి చెప్పాడు. సోనియా విసుగ్గా అతని చేతిలోని చిల్లర లాక్కొని లెక్క పెట్టుకోకుండానే పర్సులో వేసుకుంది.

"అంటే–ఇంకా ఎనిమిదిగంటలదాకా నాకు రైలు లేదు. అంతేనా?" సోనియా కొంచెంసేపు మౌనంగా ఉండి అడిగింది.

"రైళ్ళు చాలానే ఉన్నాయి. కానీ ఈ స్టేషనులో అవి ఆగవు" పోర్టరు అందమైన ఆమె ముఖాన్ని దీక్షగా చూస్తూ అన్నాడు. ఆమె తనతో మాట్లాడుతూ అలాగే ఉండిపోతే బాగుండునని పిస్తోంది అతనికి.

సోనియా అతని చూపుల్ని పసిగట్టి పక్కకు తిరిగి ప్లాట్ ఫారాన్ని పరిశీలనగా చూడసాగింది.

చలికాలపు చీకటి రాత్రి, ఆ ప్లాట్ ఫారాన్ని కమ్ముకొన్న నిశ్శబ్దతా ఆమెను కలవరపరుస్తున్నాయి. రైలు వెళ్ళి పోయిన తర్వాత ప్లాట్‌ఫారంపై శూన్యం వ్యాపించింది. క్షణక్షణాకీ భరింపరాని నిశ్శబ్దత పెరుగుతోంది. ప్లాట్‌ఫారంపై మిగిలి ఉన్న కొద్దిమందీ ఆమెను ఒళ్ళంతా కళ్లు చేసుకుని చూస్తున్నారు.

ఆమె మెల్లగా అడుగులు వేస్తూ టీస్టాల్ దగ్గరికి వెళ్ళింది. అక్కడ ఉన్నవాళ్ళ వాడి చూపులను లెక్క చేయకుండా ఒక టీకి ఆర్డరు ఇచ్చింది. తర్వాత అక్కడ మండుతున్న కుంపటిపై చేతులుంచి చలిని పారదోలే ప్రయత్నం చేయసాగింది. రగిలే నిప్పుల వేడికి వణకటం తగ్గి కొంత ఊరట కలిగింది. కుంపటి చుట్టూ ఉన్నవాళ్లు కొంచెం పక్కకు జరిగినా మురికిగా వున్న ఓ మధ్య వయస్సు వ్యక్తి మాత్రం కదల లేదు. అతని నోటినుండి సారా వాసన కొడుతోంది. నిషా నిండిన అతని కళ్లు ఎర్రగా, భయంకరంగా కనిపిస్తున్నాయి. తీవ్రంగా వీస్తున్న చలిగాలి అతని నిషాను ఇంకా ఎక్కువ చేస్తోంది.

"బండి తప్పిపోయిందా మేడమ్?" సోనియా ముఖంపై చూపులు కేంద్రీక రిస్తూ అన్నాడతను.

సోనియా అతనికేసి చురచుర చూసింది తప్ప జవాబివ్వలేదు.

"వెధవనాయాల ఆ గార్డుగాడు ఈరోజు బండికి ముందే సిగ్నల్ ఇచ్చాడు. స్టేషన్ మాస్టరుకు రిపోర్టు రాసిఇవ్వండి" చిన్నగా నవ్వుతూ తడబడుతున్న స్వరంతో అన్నాడు ఆ తాగుబోతు.

ఈసారికూడా సోనియా నుండి ఏమీ జవాబు లేకపోయేసరికి ఆ తాగుబోతు లేచి ఆమె దగ్గరికి వచ్చి నిలబడ్డాడు. ఎర్రగా వెలుగుతున్న కళ్లతో ఆమెను తీక్షణంగా చూస్తూ అన్నాడు – "ఫరవా లేదు అరగంట తరువాత మెయిలువస్తుంది. నేను పట్టాలకు అడ్డం పడితే బండి తప్పకుండా ఆగుతుంది"

ఆ తాగుబోతుతో ఏమని మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో తోచక సోనియా ఆలోచనలో పడిపోయింది. అంతలోనే ఏదో ఆలోచన వచ్చి ఆమె శరీరం భయంతో కంపించిపోయింది.

ఇంతలో ఆమె ఆలోచనలకు అంతరాయం కలిగిస్తూ టీస్టాల్ యజమాని తాగుబోతును మందలించటంతో వాడు నోరు మూసుకున్నాడు.

"క్షమించాలి మేడమ్ ... వాడు మైకంలో ఉన్నాడు. ఆ మాటలను పట్టించుకోకండి" టీ కప్పు అందిస్తూ అన్నాడు టీ షాపు యజమాని.

సోనియా మౌనంగా ఆ కప్పు అందుకుంది. టీలో పాలు, పంచదార ఎక్కువైనందున రెండు గుక్కలకంటే ఎక్కువ తాగలేకపోయింది. రూపాయి నోటు తీసి షాపు అతనికి ఇచ్చింది.

"మీకు టీ నచ్చినట్లుగా లేదు" చిల్లర తిరిగి ఇస్తూ అన్నాడతను.

"ఫరవాలేదు.... నేను ఎక్కువ టీ తాగను" అని సోనియా అక్కడినుండి చకచకా నడిచి వెళ్ళింది. ఆ తాగుబోతు ఆమెను ఇంకా అలాగే పరిశీలనగా, ఆశగా, ఆకలిగా చూస్తూ ఉన్నాడు. ఏదయినా వస్తువు కొనేముందు దాన్ని పరిశీలనగా చూసినట్లుగా అతడామె శరీరాన్ని చూస్తున్నాడు.

"నువ్వేన్నయినా చెప్పుభాయీ...పిల్ల మాత్రం బంగారుబొమ్మే"

సోనియా ఈ మాటలు విని తక్కున ఆగింది. కానీ వెనక్కు తిరిగి పేచీ పడే సాహసం చేయలేక పెద్దగా అడుగులు వేస్తూ స్టేషను మాస్టరు గదికి వెళ్ళింది. క్రమక్రమంగా ఆమె మనసులో భయం పెరుగుతోంది. ఈ రాత్రంతా స్టేషన్‌లోనే గడపాలన్న విషయం ఆమెకు చాలా చికాకుగా అనిపిస్తోంది. బుకింగు దగ్గరకు వచ్చి కిటికీ వైపు చూసింది. ఆ కిటికీ మూసి ఉంది. చుట్టూ కలయజూసింది. మరో కిటికీ తెరిచివుంటే ఆ కిటికీ దగ్గరికి వెళ్ళింది.

చలికి ఆమె శరీరం గడగడ వణుకుతోంది. తీవ్రంగా వీస్తున్న చలిగాలిని తప్పించుకోవాలని గోడచాటున నిలబడి తెరిచివున్న కిటికీలోనుంచి లోపలికి చూసింది.

ఆ గదిలో స్టేషన్ మాస్టరు కుర్చీలో కూర్చొని ఫోనులో ఎవరితోనో మాట్లాడుతున్నాడు. ఆమె వ్యాకుల చిత్తంతో ఆ గదిలో వున్న గడియారంకేసి చూస్తూ ఉంది.

కాసేపాగి సోనియా స్టేషన్ మాస్టరు కేసి చూసింది. గంభీరమైన ముఖం, నిద్ర మత్తులో కూడా అందంగా వున్న పెద్ద పెద్ద కళ్ళు, చెదిరిన జుత్తు, గోధుమరంగు శరీరఛ్ఛాయ...దాదాపు ముప్పయి సంవత్సరాల వయసుంటుంది. కానీ జీవితంలోని అనుభవాలు అతని ముఖకాంతిని హరించివేశాయనిపిస్తోంది. అతడు తలచుకొంటే తన చిల్లర పెకం మింగివేసి ఉండేవాడే కానీ అలా చేయలేదు.

అంతలో అతను లేచి గోడపక్కన వున్న బీరువా దగ్గరికి నడిచాడు. బీరువాలోనుండి ఒక రిజిష్టరు తీసి పక్కకు చూసిన అతనికి కిటికీ వద్ద నిలబడి చలికి వణుకుతున్న సోనియా కనిపించింది.

"మీరు... ఆ బండిలో వెళ్ళలేదా?" అన్నాడతను ఆశ్చర్యపోతూ.

"బండి తప్పిపోయింది'' సోనియా వణుకుతున్న స్వరంతో జవాబు చెప్పింది.

''ఇక మీకు ఉదయం ఆరు గంటల వరకూ బండి లేదు. అప్పటిదాకా ఇలాగే చలిలో వుంటే ప్రమాదం''

''నాదొక చిన్న మనవి''

''ఏమిటి?"

''చెప్తాను'' అని ఆమె కిటికీ దగ్గరి



నుండి తలుపు దగ్గరికి నడిచింది. రెండు క్షణాల తరువాత ఆమె స్టేషను మాస్టరు గదిలో, అతని ఎదురుగా నవ్వుతూ నిలబడింది.

"నేను ఇక్కడే... ఈ గదిలోనే ఈ రాత్రంతా గడపాలనుకొంటే మీకేమైనా అభ్యంతరం ఉంటుందా?" సోనియా స్వరంలో అభ్యర్థన వుంది; అసహాయత ఉంది; వినయం కూడా ఉంది.

"వీల్లేదు...వీల్లేదు. అలా ఉండటానికి వీలుపడదు. అది క్రమశిక్షణకు విరుద్ధం" స్టేషన్ మాస్టరు భయపడుతున్నట్లుగా అన్నాడు.

"అంతేకాదు – మీరిక్కడ ఉండటం చూసేవాళ్ళకూ బాగుండదు. ఈ ఊరు చిన్నది. ఇక్కడ మనుషుల బుద్ధులు కూడా చిన్నవే"

ఆమె ముఖంలో వున్న నవ్వు మాయమైంది. ఆమె ఓసారి స్టేషన్ మాస్టరు వైపు నిరాశగా చూసి, బయటకు వెళ్ళడానికి ఉద్యుక్తురాలైంది.

"మిస్!మీరు ఉంటానంటే వెయిటింగ్ రూం సిద్ధం చేయిస్తాను"

"అక్కడ ఇతర ప్రయాణీకులు ఉండరా?"

"ప్రస్తుతం ఎవరూ లేరు" అతడు ఆమె అందమైన ముఖంకేసి చూస్తూ అన్నాడు.

"అక్కడ నేను ఒంటరిగా..ఎలా....?"

"మరేమీ భయపడకండి. ఈ ప్రాంతం నిర్మానుష్యంగా కనిపిస్తుంది గానీ ఇక్కడివాళ్ళు చాలా మంచివాళ్ళు" అంటూ గోడకు తగిలించివున్న తాళం చెవుల గుత్తిని చేతిలోకి తీసుకొన్నాడు అతను.

"వద్దండి....వద్దు. అక్కడ నేను రాత్రంతా వంటరిగా వుండలేను" అకస్మాత్తుగా అంది సోనియా.

"అయితే మరి నన్నేం చేయమంటావు?" విసుగ్గా అన్నాడు స్టేషన్ మాస్టర్ రోహిత్.

"ఒక చిన్న సాయం చేయండి..."

"చెప్పండి..." ఆశ్చర్యంగా అడిగాడు.

సోనియా తెరచి ఉన్న కిటికీలోంచి బయటకు చూసింది. ఛటుక్కున వెళ్ళి మూసివున్న తలుపునకు వీపు ఆనించి నిలబడింది. రోహిత్‌ను దగ్గరికి రమ్మని సైగ చేసింది. రోహిత్ కళ్ళు ఆశ్చర్యంతో, ప్రశ్నలతో నిండిపోయాయి. ఆమె తనకు ఎంత గొప్ప రహస్యం చెప్పబోతోందో వినాలని కుతూహలంతో వుండగానే సోనియా తన చేతిలోవున్న బ్రీఫ్‌కేసును తెరచి అతని ఎదుట ఉంచింది.

దానిలోని వస్తువులను చూసిన రోహిత్ కళ్ళు జిగేలుమన్నాయి. ఓ క్షణంపాటు అతని ఉచ్ఛ్వాస నిచ్ఛ్వాసాలు ఆగిపోయాయి. ఖరీదయిన వజ్రాలు,ముత్యాలు పొదిగిన బంగారు ఆభరణాలు ఆ పెట్టె నిండా ఉన్నాయి.

రోహిత్ ఏదో అడగాలనుకొన్నాడు కానీ అతని గొంతు దాటి ఒక్కమాట కూడా వెలుపలికి రాలేదు.

"ఇదే నాకున్న ఇబ్బంది. అయిదారు లక్షల రూపాయల నగలివి" స్టేషన్ మాస్టరునుద్దేశించి అన్నది సోనియా.

అతనికి తన కళ్ళమీద, చెవులమీద విశ్వాసం కలగటం లేదు. తాను వింటున్న మాటలు, చూస్తున్న వస్తువులు నిజమైనవా కావా అని అనుమానంవేసింది.

"నానుండి మీరు ఏమి సాయం కోరుతున్నారో నాకు అర్థం కావడంలేదు" తెరచివున్న బ్రీఫ్‌కేస్‌ను దీక్షగా చూస్తూ రోహిత్ ఆమెను సీరియస్‌గా ప్రశ్నించాడు.

"దీనిని మీరు మీ సేఫ్‌లో డబ్బుతో పాటు దాచిపెట్టారంటే, నేను ఎక్కడైనా హాయిగా నిద్రపోతాను" అని ఆమె బ్రీఫ్‌ను మూసివేసి అతని జవాబుకు ఎదురుచూస్తూ నిలబడింది.

"ఇంత విలువైన వస్తువులతో రాత్రిపూట తోడెవరూ లేకుండా మీరు ఎక్కడికి వెళ్ళుతున్నారు?" రోహిత్ ఆమెకేసి అనుమానంగా చూస్తూ అడిగాడు.

"తర్వాత నేను అన్ని విషయాలూ

వివరంగా చెబుతాను గానీ నన్ను నమ్మండి ఈ నగలన్నీ నావే... దొంగ వస్తువులు కావు. ఉదయం రైలు వచ్చేదాకా వీటిని మీ దగ్గర దాచిపెట్టండి....ప్లీజ్"

ఒక అపరిచిత యాత్రికురాలు తనను ఇంతగా నమ్మి అప్పగించబోతున్న సంపదను అతడు తిరస్కరించలేక పోయాడు. అతడా పెట్టెను అందుకొని ఆమెనొకసారి ఎగాదిగా పరిశీలనగా చూశాడు. లేత గులాబీ రంగు షర్టు, బెల్ బాటమ్ పాంటు ధరించిన ఆమె చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంది. తన చేతిలో ఉన్న బ్రీఫ్‌కేసు చూడగానే అదంతా కలకాదనీ, యదార్థమనీ నమ్మక తప్పటం లేదు.

రోహిత్ ఆ పెట్టెను టిక్కెట్లు, డబ్బు దాచిపుంచే సేఫ్‌లో పెట్టాడు. ఆ తర్వాత సేఫ్‌కు జాగ్రత్తగా తాళం వేసి, అది సరిగా పడిందో లేదో అని మరోసారి లాగి చూశాడు. సోనియా ముఖంపై సంతోషం కనిపించింది. భయంతో బెదురుతున్న ఆమె కళ్లు ఆనందంతో వెలిగాయి. దడదడలాడుతున్న గుండె మామూలుగా కొట్టుకోసాగింది.

"ఇక పదండి"

"ఎక్కడికి? ఓహ్.... వెయిటింగ్ రూమ్‌లో ఉండవచ్చు అన్నారు కదూ.... పదండి" అని రెండడుగులు వేసి మళ్ళీ సందేహంలో పడ్డాడు "మీరు కొంచెంసేపు ఇక్కడే ఉండండి"

"ఎందుకని?"

"మూడు నెలల నుంచి దానిని తెరవనే లేదు. ఎప్పుడైనా ఎవరైనా మంత్రి గానీ, ఆఫీసరు గానీ వస్తారని తెలిస్తేనే దాన్ని శుభ్రం చేయిస్తుంటాము. మీరిక్కడే ఉండండి. కొంచెంసేపట్లో అంతా రెడీ చేయిస్తాను"

"ఎంతసేపు పడుతుంది?"

"ఒక గంట చాలు"

"ఓహ్....అప్పటికి నా శరీరం ఈ చలికి గడ్డకట్టుకుపోతుందేమో!"

"అదే నేనూ ఆలోచిస్తున్నాను. ఒక వేళ వెయిటింగ్ రూము తెరచినా దాంట్లో మంచం లేదు. దుప్పటీ లేదు... ఎలాగా అని సందేహిస్తున్నాను" రోహిత్ విచార వదనంతో అన్నాడు.

అతని మాటలు విన్న సోనియా ముఖంపై విచార రేఖలు కమ్ముకొన్నాయి.

ఉన్నట్టుండి రోహిత్ ఏదో ఆలోచన వచ్చినవాడిలా అన్నాడు - "రైల్వేయార్డు వెనుక నా క్వార్టరు ఉంది. మీకు ఇష్ట మయితే రాత్రంతా అక్కడ విశ్రాంతి తీసుకోండి"

ఆమె అయోమయంలో పడింది.

"అక్కడ ఇంకా ఎవరున్నారు?" అడిగిందామె.

"ఎవరూ లేరు"

"మీరు... మీరు ఒంటరిగా ఉంటు న్నారా?" సోనియా మళ్ళీ ఆలోచనలో పడింది.

"నా భార్య పుట్టింటికి వెళ్ళింది. నేను రాత్రి డ్యూటీ కారణంగా ఇక్కడే ఉండాలి. మీరు నిశ్చింతగా ఆ గదిలో వెచ్చగా నిద్రపోవచ్చు. మీకేమీ కష్టం లేకుంటే ఈ పేద స్టేషను మాస్టరుకు అతిథిగా ఈ రాత్రి గడపండి"

రోహిత్ మాటల్లోని వినయం, ముఖంలోని అమాయకత్వం చూసిన సోనియా చిన్నగా నవ్వింది. అతని మాటల ప్రభావం ఆమెపైపడిందన్నందుకు ఆ నవ్వే నిదర్శనం. అతని ప్రవర్తన ఆమె మనసుపై అందమైన ముద్రవేసింది.




''అయితే పదండి...ఇంకా ఆలస్యం ఎందుకు" సోనియా తన కోమలమైన తెల్లని చేతితో ముఖంమీద పడినముంగురు లను పక్కకు సర్దుకొంటూ అంది.

అలా చెయ్యి పైకెత్తి దించడంలో ఆమె చేతి గాజులు ఘల్లుమని శబ్దం చేశాయి. ఆ శబ్దం మధురమైన జలతరంగ సవ్వడిలా అతని మనసును గిలిగింతలు పెట్టింది. సన్నగా, గులాబీరేకుల్లా ఎర్రగా ఉన్న పెదాలపై విరిసిన చిరునవ్వును చూసిన రోహిత్ గుండె వేగంగా కొట్టుకో సాగింది. కొంచెంసేపు బెదిరిన లేడి కళ్ల వంటి ఆమె కళ్లను అలాగే తదేకంగా చూస్తూ ఉండిపోయాడు...నిండిన మధుపాత్రలా మిలమిలలాడుతున్న ఆమె కన్నుల్లోని కాంతులు అతణ్ణి మైమరిపించాయి.

* * *

రాత్రి రెండవజాము కావడంవల్ల చలి గాలి తీవ్రంగా వీస్తోంది. ఆ గాలి చెవుల్లో దూరి శరీరాన్ని కుంగదీస్తోంది. రోహిత్ కుడి చేతిలో రైల్వే లాంతరు పట్టుకుని యార్డు వెనుక వైపున ఉన్న కాలిబాటపై తన క్వార్టరు వైపు నడుస్తున్నాడు. చలికి వణుకుతూ సోనియా అతనిని అనుసరించి నడుస్తోంది.

''ఇంకా ఎంత దూరం ఉంది మీ ఇల్లు?" ఇద్దరి మధ్య ఉన్న మౌనాన్ని ఛేదిస్తూ అడిగింది సోనియా.

''ఇదిగో... దగ్గరే వచ్చేసింది" రోహిత్ వేలెత్తి చూపిస్తూ అన్నాడు.

దారిలో ఉన్నట్లుండి సోనియా కాలు జారింది. రోహిత్ ఠక్కున వెనక్కు తిరిగి ఆమెను పడకుండా పట్టుకోవాలని ప్రయత్నం చేశాడు. కానీ కుదరలేదు ఆమె పక్కనే వున్న గుంటలో పడి పోయింది. ఆమె కేక అక్కడి శూన్య ప్రదేశంలో ప్రతిధ్వనించింది.

"దెబ్బ తగులలేదు కదా?" రోహిత్ ఆమెకు లాంతరు చూపుతూ అడిగాడు.

''ఊహూ" సోనియా నవ్వాలని ప్రయత్నం చేస్తూ సహాయం కొరకు చెయ్యి చాపింది.

రోహిత్ ముందుకు వంగి ఆమె చెయ్యి పట్టుకొని పైకి లాగాడు. ఆమె శరీరం మృదువుగా, మెత్తగా తగిలింది. యవ్వనంతో, అందంతో మెరిసిపోతున్న నవ యువతి స్పర్శవల్ల రోహిత్ మదిలో వేల దీపాలు వెలిగాయి. నవ్వుతూ సోనియా కేసి ఓరగా చూశాడు.

''థాంక్యూ!" సోనియా సిగ్గు బరువుతో వాలిన కనురెప్పలు పైకెత్తి చూస్తూ అంది.

ఇద్దరూ మళ్ళీ నడుస్తున్నారు. గుంటలో పడటం వల్ల సోనియా కాలు కొంచెం నొప్పి పట్టింది. అందుకని ఆమె నిదానంగా కుంటుతూ నడుస్తోంది. ఆమె చేతిలో చేయి కలిపి, ఆమెకు ఆసరాగా నిలబడి నడిపించాలని అనిపించినప్పటికీ రోహిత్ సంకోచంవల్ల మౌనంగా వుండి పోయాడు.

క్వార్టర్ దగ్గరకు చేరిన రోహిత్ ఆగాడు. సోనియా వైపు ఓసారి చూసి లాంతరు కింద పెట్టాడు. తాళం తీసి, తలుపు తెరిచి ఇంట్లోకి ప్రవేశించాడు. అతని వెంబడే సోనియా కూడా ఇంట్లోకి వెళ్ళింది. రోహిత్ రెండడుగులు పక్కకు వేసి లైటు స్విచ్ వేశాడు.

వెలుతురు వ్యాపించగానే సోనియా గదిని పరిశీలించి చూసింది. ఆమె వున్నది డ్రాయింగు రూము. అది చాలా అందంగా అలంకరించబడి ఉంది.

ఫర్నీచరు తక్కువే కానీ ఉన్న ప్రతి వస్తువూ ఇంటి యజమానియొక్క ఉత్తమాభిరుచిని తెలియజేస్తోంది. గోడలకు ఉన్న పెయింటింగులు గది అందాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. నేలమీద తివాచీ, ఒకవైపు రాక్స్‌లో పుస్తకాలు.

"ఈ పెయింటింగ్ చాలా మనోహరంగా ఉంది" సోనియా గోడకు తగిలించి వున్న ఒక చిత్రాన్ని చూపిస్తూ అంది. దాని దగ్గరకు వెళ్ళి పెయింటింగు మీది సంతకం చదువుతూ అంది-

"రశ్మి ఎవరోగానీ గొప్ప చిత్రకారుడు"

"ఎవరోకాదండీ రశ్మి...రశ్మి నా భార్య" రోహిత్ ఆమెను సమీపిస్తూ అన్నాడు.

"ఓహ్ ... వండర్‌ఫుల్! మీ ఆవిడ అంత అందమైన చిత్రాలు వేస్తుందా" సోనియా ఆశ్చర్యపోతూ అడిగింది.

"చిత్రాలు వేయటం మాత్రమేకాదు ఇంట్లోని ప్రతి వస్తువు మీదా, ప్రతి అలంకరణ మీదా ఆమె ప్రభావం ఉంది"

"ఓహ్... బ్యూటిఫుల్! మరి సంగీతం విషయంలో కూడానా?" ఓ మూలన బల్లపై వున్న టేప్‌రికార్డర్‌ను చూపిస్తూ అడిగింది.

"అవును... అది కూడా ఆమెదే. రశ్మికి సంగీతం అన్నా' పాటలన్నా చాలా ఇష్టం"

"అలాచెప్పండి మరి...అందుకే ప్రపంచ ప్రసిద్ధిచెందిన పాటల టేప్‌లు అన్నీ కొని వుంచింది" సోనియా అలమరలో వున్న టేప్‌ల మీద ఉన్న పేర్లు చదువుతూ అంది.

"అవును....ఇదే మా స్వప్నలోకం! ఇదే మా ఇద్దరికీ స్వర్గం. ఇందులో ఉంటున్న మేము అన్ని సుఖాలు, వైభవాలు లభించినట్లే భావిస్తుంటాము"

"మరి మీరు ఇంతగా ప్రేమిస్తున్న మీ భార్యను పుట్టింటికి ఎందుకు పంపించారు?"

"వాళ్ళ దాడీని చూసి రావాలని వెళ్ళింది"

"మీరు ఆమె వెంట ఎందుకు వెళ్ళలేదు?"

"శెలవు దొరకలేదు" ఈ మాటలంటున్నపుడు అతని ముఖం కళావిహీనం కావడాన్ని ఆమె గమనించలేదు.

సోనియా ఇంకేమీ ప్రశ్నలు వేయలేదు. కానీ ఆమె ఇప్పటివరకూ వేసిన ప్రశ్నలు ప్రశాంతంగా వున్న అతని మనసును కల్లోలపరిచాయి. భార్య జ్ఞాపకాలు అతనిని బాధపెట్టసాగాయి.

సోనియా సానుభూతి సూచకంగా అతనివైపు ఒకసారి చూసి మళ్ళీ గోడలకు ఉన్న పెయింటింగులను చూడసాగింది. ఆమెకి అన్పించింది

"రశ్మి ఒక గొప్ప కళాకారిణి. ఆమె తప్పకుండా అందగత్తె కూడా అయి వుండాలి. మరి ఒక మామూలు స్టేషన్ మాస్టరుకు అర్ధాంగి ఎలా అయింది? ఈ పేదరికంలో ఈ పల్లెప్రాంతంలో ఎలా జీవిస్తోంది?" అన్పి, అతడు బీరువాలోంచి ఒక టవలుతీసి ఆమెకు ఇస్తూ అన్నాడు-

"మీకిష్టమయితే పడుకొనేముందు కాళ్ళు, చేతులు కడుక్కోండి. అలసట తగ్గిపోతుంది"

"ఈ చలిలోనా?" ఆమె చల్లనినీళ్ళను వూహించుకొని భయపడుతూ అన్నది.

"బాత్‌రూంలో వేడినీళ్ళున్నాయి"

"అయినా..."

"బురదలో పడటంవల్ల మీ బట్టలకు, శరీరానికి మట్టి అంటుకొంది. ముఖం




కూడా వాడిపోయినట్లుంది" రోహిత్ ఆమెకు మాట్లాడే అవకాశం ఇవ్వకుండా అన్నాడు.

ఆమె వెళ్ళి అద్దంలో చూసుకుంది. బట్టలపైన, ముఖంపైన బురద మరకల్ని చూసి కిలకిల నవ్వింది.

"అయామ్ సారీ" ఆమె సిగ్గుపడుతూ అంది.

రోహిత్ బాత్‌రూం ఎక్కడ ఉన్నదీ చెప్పాడు.

స్నానాలగదిలో సోనియా కాళ్లు, ముఖం కడుక్కొంటూ చిన్నగా పాడుతోంది. ఆమె పాట అక్కడి ఏకాంతాన్ని భంగ పరుస్తూ మధుర, మంజుల వీణానాదంలా వ్యాపిస్తోంది.

రోహిత్ రెండు నిమిషాలపాటు ఆ తీయని పాట వింటూ గడిపాడు. అంత లోనే కర్తవ్యం గుర్తువచ్చి విచిత్రంగా తారసపడిన గెస్టుకు విశ్రాంతికోసం ఏర్పాట్లు చేయసాగాడు. ముందు రూం హీటర్‌ను ఆన్‌చేశాడు. పక్కనేవున్న సోఫామీద కంబళి, దిండు పెట్టాడు. హీటరు ప్రభావంవల్ల గది క్రమంగా వెచ్చగా మారుతోంది.

వీపువెనక చల్లగా అనిపించటంతో అతడు ఉలిక్కిపడి వెనుదిరిగి చూశాడు. తడిసిన వెంట్రుకలను విరబోసుకొని ఉన్న సోనియా అతని వెనకే నిలబడి ఉంది. స్నానం చేశాక ఇప్పుడామె ముఖం మంచులో తడిసిన గులాబీలా, స్వచ్ఛంగా మరింత అందంగా కనిపిస్తోంది.

"మీ శ్రీమతి ఎంతో అదృష్టవంతురాలు" ఆమె రోహిత్‌కేసి చూస్తూ అంది.

"ఎందుకని?"

"కొత్తగా వచ్చిన నాయెడలనే ఇంత శ్రద్ధ, మర్యాద చూపుతున్నారే... ఆమెను మీరెంత ప్రేమగా చూసుకొంటారో వూహించలేనా"

"ఆమెను ఇంత శ్రద్ధగా చూడనవసరంలేదుగదా"

"ఎందుకని?"

"ఎప్పుడో ఒకసారి వచ్చే అతిథికి, ఎప్పుడూ ఇంట్లో ఉండే ఇల్లాలికి తేడా వుండదా! సరేగానీ... మీ పడక సిద్ధంగా ఉంది"

"కానీ..." సోనియా సోఫావైపు సందేహిస్తూ చూసి ఏదో అడుగబోయింది.

రోహిత్ ఆమె భావాలను కనిపెట్టి అన్నాడు – "క్షమించండి ... మీ పడక డ్రాయింగ్‌రూంలో ఎందుకు వేశానంటే" ఏదో చెప్పబోయి అతడు ఒక్కక్షణం ఆగాడు. వెంటనే ధైర్యం తెచ్చుకుని సోనియావైపు చూసి అన్నాడు–"అసలు విషయం ఏమంటే బెడ్‌రూం తాళంచెవి మా ఆవిడ తీసుకొని వెళ్ళింది"

"ఒకవేళ అది ఉన్నా నేను మీ బెడ్‌రూంలో పడుకోనుగదా" అతని భయాన్ని పోగొడుతూ సోనియా అన్నది.

అతడు కిటికీల తెరలు కిందికి దించుతూంటే ఆమె అతని ముఖంకేసి పరీక్షగా చూస్తూ ఉంది. "ఇతడు చాలా సభ్యత, సహృదయతగల వ్యక్తిలా ఉన్నాడు. మనసులో ఏదో బాధ, చిక్కు సమస్య దాగి ఉంది. కాని దానిని బయటకు చెప్పాలనుకోవడం లేదు" అనుకొంది.

"కొంచెం టీ తాగుదామా?" అతని మూడ్ మార్చాలన్న ఉద్దేశంతో సోనియా అన్నది.

"మీరు సరిగ్గా నా మనసులోని మాట అన్నారు" రోహిత్ వెళ్ళి కిచెన్‌రూమ్ లైటు వెలిగించాడు.

కొద్ది నిమిషాల తరువాత ఇద్దరూ రూమ్ హీటరుకు ఎదురుగా కూర్చొని టీ తాగుతున్నారు. టీ అతి మామూలుగా ఉంది. కానీ సోనియా చేసింది కాబట్టి అతడు రుచిని ఆస్వాదిస్తున్నట్లుగా, నిదానంగా తాగుతున్నాడు.

సోనియా ఒక్క క్షణంపాటు మౌనం వహించి తరువాత అడిగింది–"మీ ఇద్దరిదీ లవ్‌మేరేజా?లేక పెద్దలు చేసిన పెళ్లా??"

"లవ్..." రోహిత్ ఈమాట అంటూ ఉద్రేకం ఆపుకోలేక కూర్చొన్నచోటు నుండి లేచాడు.

"అరెరె... ఎందుకు లేచి నిలబడ్డారు"

"టెన్ డవున్ రైలు వచ్చే సమయం అయింది. కాబట్టి నేను తప్పక డ్యూటీలో వుండాలి''

"ఓహ్....అలాగా!"

"మీరు విశ్రాంతిగా నిద్రపోండి. కానీ నిద్రపోయేముందు బయటి తలుపు తప్పకుండా మూయండి"

"కానీ.... ఉదయం?''

"సరిగ్గా అయిదుగంటల పది నిమిషాలకు నేను మీకు ఫోన్‌చేసి లేపుతాను" అతడు టీపాయ్ మీదున్న టెలిఫోన్‌ను చూపిస్తూ అన్నాడు.

"ఓకే... బైబై"

రోహిత్ రైల్వే లాంతరు చేతిలోకి తీసుకొని బయలుదేరాడు. తలుపు దగ్గరికి వచ్చి, ఓసారి వెనక్కు తిరిగి చిరునవ్వుతో చిన్నగా అన్నాడు–"గుడ్‌నైట్"

"గుడ్ నైట్" సోనియా కూడా చిరునవ్వుతో జవాబిచ్చింది.

రోహిత్ వెళ్ళిపోగానే ఆమె తలుపు గడియపెట్టాలని లేచింది. మూసేముందు ఓసారి తలుపు కొంచెం తీసి చూసింది. చల్లని గాలి ముఖాన్ని తాకేసరికి చటుక్కున తలుపు మూసి, గడియపెట్టి వచ్చి సోఫాలో వాలింది.

ఆమె కొంచెంసేపు అక్కడే ఏదో ఆలోచిస్తూవుండిపోయింది. అక్కడినుండే గోడలకు వేలాడుతున్న అందమైన చిత్రాలను మరోసారి పరిశీలనగా చూసింది. రశ్మి.... ఆమె ఎంత గొప్ప కళాకారిణి! దేవుడామెకు అద్భుతమైన అందం కూడా ఇచ్చాడు.

భార్యాభర్తల మధ్య అమితమైన అనురాగం కూడా ఉండి ఉంటుంది...ఇలా ఎన్నో ఆలోచనలు ఆమె మనసులో అల్లిబిల్లిగా అలుముకొన్నాయి. కొంచెం సేపట్లో ఆమెపై నిద్రాదేవి మత్తుమందు చల్లింది.




చలిగాడ్పు ఎక్కువైంది. రోహిత్ డ్యూటీలో నిమగ్నమైవున్నాడు. టెలిగ్రాఫ్ యంత్రం గర్...గర్‌మని శబ్దం చేస్తూ ఉంది. దూరాన ఇంజను పెట్టెలను తగిలించుకొంటూ నిశ్శబ్ద వాతావరణాన్ని భంగపరుస్తూ ఉంది.

రోహిత్ సిగరెట్టు వెలిగించి పెదాల మధ్య పెట్టుకొన్నాడు. అతడి మనో ఫలకంపై సోనియా కదులుతూ ఉంది.

అర్ధరాత్రి సమయంలో, ఒంటరిగా, లక్షల రూపాయలు విలువచేసే ఆభరణాలతో ఎక్కడికి పోతోంది? ఎందుకు పోతోంది? తనకా బ్రీఫ్ అప్పజెప్పి తననుకూడా ఏదేనా తప్పులో భాగస్వామిగా చేస్తోందా?

అతని చెవుల్లో సోనియా అడిగిన ప్రశ్న ఇప్పటికీ ప్రతిధ్వనిస్తోంది. "మీది లవ్ మేరేజా లేక పెద్దలు చేసిన పెళ్ళా?"

"లవ్..." అప్రయత్నంగానే అతని పెదాలు దాటి ఈ మాట వెలువడింది. అతడు గత స్మృతుల్లో లీనమయ్యాడు.

తానొకసారి మామ కూతురు శాంత పెళ్ళికి తాతగారి ఊరు వెళ్ళాడు. ఆ రోజు రశ్మిని ... మెరుపు తీగలాంటి ఆమె సౌందర్యాన్ని అప్పుడే చూశాడు.

ఆడవాళ్ళందరూ పెళ్ళికూతుర్ని మధ్య కూర్చుండబెట్టి పాటలు పాడు తున్నారు. అందరూ కలసి జానపద గేయాలు పాడుతున్నారు. రశ్మి మృదంగం వాయిస్తూ ఉంది. వుంగరాల జుత్తు ... సన్నగా, పొడవుగా ఉన్న ముఖం ... వెడల్పుగా, పెద్దగా ఉన్న కళ్ళు.....సిగ్గు బరువుతో వాలిపోతున్న కనురెప్పలు..... కాటుక పెట్టకున్నా కాటుక దిద్దినట్లే కని పిస్తూ ప్రకాశవంతంగా వున్నాయి. లిప్ స్టిక్ పూయకున్నా పెదాలు గులాబీరేకుల్లా ఎర్రగా ఉన్నాయి. చక్కని పొడవైన ముక్కు, అందమైన చిన్న గడ్డం, దానికి ఓ వైపున నల్లగా మెరుస్తూ ఆమె అందాన్ని ఇను మడింపజేసే చిన్న పుట్టుమచ్చ. ఆమెకు దిష్టి తగులకుండా దేవుడే దాన్ని అక్కడ ఏర్పాటు చేశాడేమో అనిపిస్తుంది. అందా నికి తోడు మధురమైన కంఠం కూడా వుండటంతో అక్కడి గుంపులో ఆమె చుక్కల్లో చంద్రునిలా వెలిగిపోతోంది.

పాడుతూ ఉన్న రశ్మి తనవైపే రెప్ప వాల్చకుండా చూస్తున్న రోహిత్‌ను గమనించింది. రెండు మూడుసార్లు వాళ్ళ చూపులు కలిశాయి. అతడు తన సౌంద ర్యానికి ఆకర్షింపబడ్డాడని గ్రహించిన రశ్మి చిన్నగా నవ్వుకొంది. ఆతర్వాత మరికొన్ని మంచి పాటలు పాడింది. ఆ పాటలు రోహిత్‌లో రగులుతున్న ప్రేమ జ్వాలను అధికం చేశాయి. అతడు తన్మ యుడై పరిసరాలను మరచిపోయి తివాచీ దారాలను మెలివేస్తూ కూర్చొన్నాడు.

సంగీత కార్యక్రమం అయిపోయింది.

శాంత తల్లి ఆడవాళ్ళందరికీ మిఠాయి పాకెట్లు పంచుతోంది. అందరూ వెళ్ళి పోయిన తరువాత కూడా రోహిత్ అక్కడే ఉండిపోయాడు.

"అన్నయ్యా! ఒక చిన్నపని చేసి పెడతావా?" శాంత తన దగ్గరకు వచ్చి అడగగానే అతడుఉలిక్కిపడ్డాడు.

"ఏం పని?" అతడు అర్థంకానివాడిలా ముఖంపెట్టి అడిగాడు.

"నా స్నేహితురాలిని వాళ్ళ ఇంటి దాకా వదిలి రావాలి"

రోహిత్ ఓ లిప్తపాటు రశ్మిని చూశాడు. ఆమె చిరునవ్వుతో అతనివైపే చూస్తూవుంది. రశ్మిలాంటి సౌందర్యదేవత వెంటవెళ్ళి కొన్ని నిమిషాలు ఏకాంతంగా గడపబోయే అదృష్టం లభిస్తున్నందుకు అతని మనసు సంతోషంతో పొంగి పోయింది.

రోహిత్ వెళ్ళి టార్చి తీసుకొని వచ్చాడు.

కొంచెంసేపయిన తరువాత రోహిత్, రశ్మి ఆ పల్లెటూరి ఇరుకు దారిలో నడిచి పోతున్నారు. రశ్మి వయ్యారంగా నడుస్తూ అతనికి ఇంకా ఉత్తేజం కలిగిస్తూ

ముందుకు నడుస్తోంది. రోహిత్ ఆమె యవ్వన శోభను, జడలోని పూల సుగంధాన్ని ఆస్వాదిస్తూ వెనుక నడుస్తున్నాడు. రోహిత్ అప్పుడప్పుడు వెనుక నుండి టార్చి వెలిగిస్తూ ఆమెకు వెలుతురు చూపిస్తున్నాడు. ఒక్కోసారి టార్చి వెలుగు గోరింటాకు పూసిన ఆమె పాదాలపై పడినపుడు అతనికి కళ్ల ముందు మెరుపు మెరిసినట్లు వుండేది. అందమైన ఆమె ముఖాన్ని చూడాలనే కోరికను బలవంతంగా అణుచుకొనేవాడు. అతనిలో ఏదో తెలియని బెరుకుతనం చోటుచేసుకొంది. ఇద్దరూ మౌనంగా నడుస్తూవున్నారు. ఆ నిశ్శబ్ద వాతావరణంలో వాళ్ళకు తమ గుండెలు వేగంగా కొట్టుకొంటున్న విషయం స్పష్టంగా తెలుస్తోంది.

సందు తిరగబోయిన రశ్మి ఠక్కున ఆగింది. వెనుక పరధ్యానంగా వస్తున్న రోహిత్ ఆమెను దాదాపుగా ఢీకొన్నాడు. రశ్మి కోమల శరీరపు స్పర్శ అతనిలో పులకింత కలిగించింది. అతని మస్తిష్కం మత్తులో మునిగిపోయింది. రశ్మి ఎదుటివైపు చూపింది. రోహిత్ టార్చివేసి చూశాడు. ఎదురుగా పెద్ద ఆవుల గుంపొకటి వస్తూ కనిపించింది. అది తమ వైపునకే వస్తోంది. ఇద్దరూ వెనక్కు అడుగులు వేయసాగారు. అవి ఇంకా దగ్గరికి వచ్చాయి. టార్చి వెలుతురులో వాటి కళ్లు భయంకరంగా కనిపిస్తున్నాయి. ఆవులు రశ్మిని తగిలేంత దగ్గరికి వచ్చేశాయి. ఆమె కెవ్వున అరచి వీధి పక్కన ఒక ఇంటి ముందర ఉన్న చిన్న అరుగు ఎక్కింది. రోహిత్ కూడా వేరే మార్గంలేక అరుగు ఎక్కాడు.





రశ్మి గోడకు ఆనుకొని ఉంది. రోహిత్ ఆమెకు ముందు ఆవులకు అడ్డంగా డాలు వలె నిలబడ్డాడు. నవ యవ్వనంలో వున్న దేహాలు ఇలా విచిత్రంగా దగ్గరికి చేరాయి. వాళ్ళ మధ్యలో అడ్డుగోడలా వున్న కొత్తదనం ఇప్పుడు కూలిపోయింది. ఆవుల గుంపు ఆ వీధినంతటినీ ఆక్రమించింది. అవి తమను నెట్టి కిందపడవేయకుండా తప్పించుకొనే ప్రయత్నంలో అతడు వెనక్కు జరుగుతున్నాడు. అలా జరుగుతున్నకొద్దీ అతని వీపు మెత్తని ఆమె వక్షస్థలానికి ఒత్తుకొంటూంది. ఇద్దరి శరీరాలు ఒకటిగా అయిపోయాయి. చుట్టూ చల్లని వాతావరణం వ్యాపించివున్నా రోహిత్‌కు రశ్మి విడిచే శ్వాస వెచ్చగా మెడను, చెంపలను తాకుతోంది. అతడు కల్పనాలోకంలో ఉన్నట్లు మత్తుగా ఫీలయ్యాడు. రశ్మి మృదువైన, ఎత్తయిన వక్షస్థలం ఊపిరి పీలుస్తున్నప్పుడు పైకిలేస్తూ, తగ్గుతూ అతని భావాలకు, ఉద్రేకాలకు ఒక పరీక్షగా ఉంది.

మరికాసేపటికి పశువుల గుంపు వెళ్ళిపోయింది. సందు మునుపటిలాగా నిశ్శబ్దం అయిపోయింది. ఆవుల గిట్టల చప్పుడు క్రమక్రమంగా దూరం అయిపోయింది. అయినా రశ్మి, రోహిత్ మరికొంచెం సేపటివరకు ఆ చిన్న అరుగుమీద ఒకళ్ళనొకరు అంటిపెట్టుకొని అలాగే నిలబడివున్నారు. వాళ్ళిద్దరూ ఏదో ఊహాలోకంలో విహరిస్తున్నారు.

కొన్ని క్షణాల తరువాత రశ్మి ఉలిక్కిపడి రోహిత్ వైపు చూసింది. ఆ చల్లని రాత్రి సమయంలో కూడా అతని ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది. రోహిత్ కూడా ఉలిక్కిపడి కల్పనా జగత్తునుండి బయటపడ్డాడు.

రోహిత్ తనను తాను సంబాళించు కొని వీధిలోకి టార్చిని వేస్తూ అన్నాడు- "పదండి".

ఇద్దరూ మళ్ళీ ఆ ఇరుకు దారుల గుండా నడుస్తున్నారు. రశ్మి మాటి మాటికి అతని ముఖాన్ని ఓరగా చూస్తోంది. అలా చూస్తూ ఒకసారి రాయి తగిలి పడబోయింది, కానీ రోహిత్ ఆమె చెయ్యి పట్టుకొని ఆపాడు.

"అనవసరంగా మీకు శ్రమ కలిగి స్తున్నాను" ఆమె బాధపడుతున్నట్లుగా అన్నది.

రోహిత్ ఒకసారి రశ్మి కళ్ళల్లోకి చూసి అన్నాడు - "ఇందులో శ్రమ ఏముంది?"

"ఇదంతా శాంత మూలంగా జరిగింది. ఇంతసేపూ అక్కడే వుండమని ఆమె బలవంత పెట్టకపోతే ఇపుడు మీకు ఈ ఇబ్బంది వుండేది కాదు"

"కాని శాంత ఆపకపోతే మీతో మాట్లాడి, మీ తీయని పాటలు వినే అదృష్టం దొరికేదికాదేమో?"

"మీకు నా పాట నచ్చిందా?"

"మీరు చాలా బాగా పాడతారు"

"నన్ను నిచ్చెన లేకుండానే ఆకాశానికి ఎక్కిస్తున్నారా?" అని ఆగి అతని వైపు భావగర్భితంగా చూసింది.

"అదేమీ కాదు. సూర్యునికి దీపం చూపాల్సిన అవసరం ఏముంది?"

"కాని మీరిప్పుడు చూపిస్తున్నది టార్చిలైటు...దీపం కాదు" రశ్మి నవ్వుతూ అంది.

రశ్మి అన్న మాటలకు రోహిత్ కూడా నవ్వాడు. అతని ముఖంలో ప్రసన్నత ఉంది. ఇప్పటికి అతని భయం తగ్గి, కొంత ధైర్యం వచ్చింది.

"పల్లెటూళ్ళలోని ఈ ఇరుకు సందులు, మురికి వీధులు ఎప్పటికి మారతాయో" రశ్మి అకస్మాత్తుగా తన ఆవేదన వెలిబుచ్చింది.

"మీకు ఈ గ్రామం నచ్చలేదా?'' రోహిత్ అడిగాడు.

"బొత్తిగా నచ్చలేదు. ఏముంది ఇక్కడ? పనేమీ వుండదు ... కాల క్షేపమూ ఉండదు. జీవితం మహాబోర్‌గా ఉంటుంది. విసుగు, నిరాశ, దుఃఖం తప్ప ఇక్కడి ఏమి ఉన్నాయి?"

"అయితే ఎక్కడికయినా వెళ్ళకూడదా"

"వెళ్ళాలనుకొన్నా ఎక్కడికీ వెళ్ళలేని నిస్సహాయురాలిని నేను" ఆమె నిస్పృహతో అన్నది.

"ఎందుకని?''

''నన్ను గురించి శాంత మీతో ఏమీ చెప్పలేదా?''

"లేదు" రోహిత్ ఆమెకేసి ప్రశ్నార్థ కంగా చూస్తూ అన్నాడు

రశ్మి ఒక నిట్టూర్పు వదలి అన్నది- ''మా నాన్నగారు ఈ వూరిలో గొప్ప ధనవంతులు. గ్రామంలోని భూముల్లో సగం ఆయనవే..."

''అయితే మరీ మంచిది. మీరు ఇష్టం వచ్చినచోటికి, ఇష్టం వచ్చినప్పుడు పోవచ్చు, రావచ్చు" ఆమె చెప్పేది పూర్తిగా వినకుండానే రోహిత్ అన్నాడు

"బి.ఏ...దాకా ఇక్కడే ఉండి చదివాను. ఐదుమైళ్ళ దూరంలో ఉన్న కాలేజీకి జీపులో వెళ్ళి వచ్చేదాన్ని"

"మరి...ఇప్పుడు?"

"చదువు పూర్తికావడంతో ఇల్లుదాటి బయటకు వచ్చే వీలుండటం లేదు?"

"బి.ఏతో ఎందుకు ఫుల్‌స్టాప్

పెట్టారు?" ఎం.ఏ చదివి యల్.యల్.బి. గానీ పి.హెచ్.డి. గానీ పూర్తిచెయ్యలేక పోయారా?"

"మా నాన్నగారు పాతకాలం మనిషి. ఆయనకు ఆడపిల్లలు ఎక్కువగా చదవటం ఇష్టం లేదు"

"మీ అమ్మగారితో చెప్పించలేక పోయారా?"

"ఆమె ఏనాడో ఈ లోకం వదిలి వెళ్ళిపోయింది" ఈ మాటలు అంటున్నపుడు రశ్మి కంఠంలోనూ, ముఖంలోనూ బాధ వ్యక్తమైంది.

"ఓహో...అయామ్ సారీ" రోహిత్ వెంటనే క్షమాపణ అడిగాడు.

వాళ్ళు ఊరు దాటి తోటలు, పొలాల మధ్యగా నడుస్తున్నారు. కొంత దూరంలో వున్న మామిడి వనం నల్లని గోడలాగా అడ్డంగా ఉంది. వాతావరణంలో నిశ్శబ్దం దాని మూలంగా భయం వ్యాపించాయి. చుట్టూ భయంకరంగా వ్యాపించివున్న పరిసరాలను చూసిన రోహిత్ కొంచెం భయపడ్డాడు. అతడొక చోట తక్కున ఆగిపోయాడు.

"ఎందుకు ఆగిపోయారు?" రశ్మి అతడి దగ్గరికి వచ్చి అడిగింది.

"ఇంకా ఎంత దూరం ఉంది మీ ఇల్లు?" ముందు వైపు టార్చి వేస్తూ అడిగాడు.

"మనం మా ఇంటి తోటలోనే ఉన్నాము" రశ్మి చిరునవ్వుతో జవాబు ఇచ్చింది.

రోహిత్ నమ్మలేనట్లుగా రశ్మివైపు చూశాడు. ఆమె వేలితో కుడిచేతివైపు చూపింది. అతడా చీకటిగుండా పరిశీలనగా చూశాడు. కొంతదూరంలో జమీందార్ల కాలపు రెండతస్తుల భవనం ఒకటి కనిపించింది. మేడపై ఉన్న గదిలో లైటు వెలుగు కనిపిస్తోంది.

"మీ ఇంట్లో ఎవరెవరు ఉంటున్నారు?" టార్చి వెలుగు ఇంటివైపు వేస్తూ ప్రశ్నించాడు.

"నాన్నగారు, నేను, నలుగురు నౌకర్లు. ఇల్లు చాలా పెద్దది కానీ మనుషులం మాత్రం చాలా తక్కువ''

"ఇక్కడి ఏకాంతానికి మీరు భయపడు తుంటారనుకొంటాను"

"తరచుగా భయపడుతుంటాను. బోర్‌గా ఫీలవుతుంటాను. పగలు ఎలాగో గడుస్తుంది కానీ రాత్రులు మాత్రం చాలా కష్టంగా ఉంటుంది. ఈ అడవి ప్రాంతపు చిక్కని చీకటి, సుదూర ప్రాంతాలవరకూ వ్యాపించిన నిశ్శబ్దత నాకు భయం కరంగా గోచరిస్తుంటాయి" ఈ మాటలు చెబుతున్నపుడు ఆమెను నిజంగానే భయం ఆవరించింది. ఆమె రోహిత్ దగ్గరకు జరిగింది.

"మీరు ఇప్పుడు కూడా భయపడు తున్నట్లున్నారే?" ఆమె భయంతో వణుకుతున్న విషయం గ్రహించి అతడు అడిగాడు.

"లేదు ... ఇప్పుడు మీరు దగ్గరున్నారుగా!" రశ్మి తనను తాను సంభాళించుకొని అన్నది.

"ఒకవేళ నేను మీ వెంబడి రాకుంటే?"

"అక్కడే పడుకొని వుండేదాన్ని. నాన్నగార్కి ముందే చెప్పి వచ్చాను"

"మరి ఎందుకని వుండలేదు?"

"వున్నట్టుండి నాకో విషయం గుర్తు కొచ్చింది. రేపు కైలాష్ వస్తున్నాడన్న విషయం నాన్నగారితో చెప్పలేదు"

"కైలాష్..?" రోహిత్ ఉలిక్కిపడ్డాడు. అర్థంకానట్లుగా ముఖం పెట్టాడు




"మా నాన్నగారి స్నేహితుని కొడుకు. ఈ అడవిలో వేటాడటానికి తరచుగా వస్తుంటాడు. ఆయన రేపు వస్తాడు కాబట్టి నేను ఇంట్లోనే రెడీగా ఉండాలి"

"అవునవును ... అతిథికి స్వాగత సత్కారాలు చేయడానికి మీరు ఇంట్లో ఉండకుంటే ఎలా?" రోహిత్ పైకి నవ్వుతూ అన్నాడు.

"ఆయన అతిథి మాత్రమేకాదు" రశ్మి అతని ముఖకవళికలు గమనిస్తూ అన్నది.

"అతిథి కాక మరెవరు?" రోహిత్ కుతూహలంతో అడిగాడు.

"నాన్నగారు కైలాష్‌ను నా జీవన సహచరునిగా చేయాలని నిర్ణయించారు" ఆమె చూపులు పక్కకు తిప్పుకొని అన్నది.

రోహిత్‌కు గొంతులో పచ్చి వెలక్కాయ పడినట్లయింది. అతని వూహల తాజ్‌మహల్ క్షణంలో కుప్పగా కూలి పోయింది. అతనికి మెదడులో నరాలు జివ్వున లాగినట్లయింది. దెబ్బతిన్న వాడిలా, ఓడిపోయినవాడిలా నిరాశగా రశ్మివైపు చూశాడు. రశ్మి తలకిందికి వంచి కాలి చెప్పుతో నేలమీద గీతలు గీస్తూ అంది. ఆమె ఏదో చెప్పాలను కొంది కానీ మాటలు గొంతుదాటి రాలేదు.

కొన్ని క్షణాలపాటు ఇద్దరూ మౌనంగా నిలబడ్డారు.

* * *

ఆ సమయంలో అడవిలో వెళ్తున్న రైలు శబ్దం విని రోహిత్ ఉలిక్కిపడ్డాడు. రైలు తుఫానులా, వేగంగా పెద్దగా కూత వేస్తూ వాతావరణంలో అలజడి కలిగిస్తూ సాగిపోయింది.

ఈ దడదడ శబ్దం రోహిత్ కలల్ని భగ్నం చేసింది. ఆలోచనలకు అంత రాయం కలిగి వాస్తవ జగత్తులోనికి వచ్చాడు.



3

పెళ్లి అయిపోయింది. శాంత పల్లకీలో అత్తవారింటికి వెళ్ళిపోతోంది. బంధువులు, స్నేహితులు, గ్రామస్తులు, గుంపులుగా తోడువెళ్ళి పెళ్లి కూతుర్ని సాగనంపు తున్నారు. అందరూ చెరువు గట్టుదాకా వెళ్ళారు. శాంత పుట్టి పెరిగిన ఇంటిని, వూరిని వదలి భర్త ఇంటికి వెళ్తోంది. ఈ దినం ఆమె జీవితంలో ఒక ప్రత్యేకమైన దినం. ఆ వీడ్కోలు దృశ్యం రాతి గుండె కలవారిని సహితం కరిగిస్తుంది. అందరి కళ్లల్లో కన్నీరు నిండింది. రోహిత్ కళ్లలో కూడా నీళ్ళు నిండాయి. ఆ గుంపులో వున్నవాళ్ళలో ఒక్క రశ్మి మాత్రం ఏడవలేదు సరిగదా రోహిత్‌కేసి ఓరగా చూసి తనలో తాను చిన్నగా నవ్వుకొంది.

శాంత వీడ్కోలు తీసుకొని వెళ్ళి పోయింది. బంధువులందరూ కొంచెం సేపు చెరువుగట్టుపై నిలబడి సాగి పోతున్న పల్లకిని చూస్తూ ఉండిపోయారు. తర్వాత మెల్లగా ఇంటిదారి పట్టారు బోయీలు పల్లకిని భుజాలపై పెట్టుకొని వేగంగా స్టేషనువైపు సాగిపోతున్నారు.

ఈ దృశ్యాన్ని రోహిత్, రశ్మి కూడా రెప్పవాల్చకుండా చూశారు. కొంచెం సేపటికి పల్లకి కనుమరుగైపోయింది. బ్యాండు శబ్దం మాత్రం వాతావరణంలో ప్రతిధ్వనిస్తూంది.

తడి కన్నులతో, ఉదాసీన భావంతో రశ్మికేసి చూశాడు. ఆమె చెరువుగట్టుపై కూర్చొని వుంది. ఓ గడ్డిపోచను వేళ్ళ మధ్య వుంచుకొని అటూ ఇటూ తిప్పు తోంది. రోహిత్‌ను చూసి ఆమె చిన్నగా నవ్వింది. అప్పటికి వాళ్ళిద్దరూ తప్ప మిగతావాళ్ళంతా ఇళ్ళకు వెళ్ళిపోయారు. రశ్మి వయ్యారంగా వొళ్ళువిరుచుకొని, లేచి రోహిత్ దగ్గరకు వచ్చింది. ఒక గడ్డిపోచను ముని పళ్ళతో కొరుకుతూ అన్నది–"హలో...ఏమిటి మీరింకా ఏడు స్తున్నారా?"

"అబ్బే...లేదు" రోహిత్ వాస్తవ జగత్తులోకి వస్తూ అన్నాడు. "మనసు ఎందుకో భారంగా అయిపోయింది... అందుకనే మౌనంగా ఉన్నాను"

"మన భారతీయుల ప్రవర్తన చాలా విచిత్రంగా ఉంటుంది. దుఃఖ సమయం లోనే కాదు. సంతోష సమయంలోకూడా ఏడుస్తారు" రశ్మి చిరునవ్వుతో అన్నది.

"మీకు స్నేహితురాలు దూరం అవు తుందన్న బాధలేదా?" రోహిత్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకు బాధపడాలి? శాంత కలలు పండాయి. ఆమెకు ఆనందమైన క్రొత్త జీవితం లభించిందిగదా"

"మీ నాన్నగారిని, పుట్టిపెరిగిన మీ ఇంటిని వదిలి వెళ్ళేటప్పుడు మీ కళ్లలో కూడా మీకు తెలియకుండానే కన్నీళ్ళు నిండుతాయి"

"నిజంగానా...!" రశ్మి చిలిపిగా నవ్వుతూ అంది.

"నేను దూరం అయిపోతే మీరు ఇప్పటి లాగే బాధపడతారా?" ఆమె కళ్లలో చిలిపితనం నిండివుంది.

రశ్మి అడిగిన ప్రశ్నకు అతడు సిగ్గు పడి జవాబు చెప్పలేకపోయాడు.

ఆమె చిరుకోపం ప్రదర్శిస్తూ చక చకా చెరువుగట్టు దిగి కాలిబాటగుండా అడవివైపు వెళ్ళింది.

అతడు అక్కడే నిలబడి ఆమెను చూస్తూ ఉండిపోయాడు. ఆమె చక చకా నడుస్తూ పొదల మధ్య మాయమైంది.

ఉదయకాలపు నీరెండ కాంతిలో పచ్చని అడవి వింత కాంతిలో మెరిసిపోతోంది. గడ్డిమీద మంచు బిందువులు ముత్యాల్లా మెరిసిపోతున్నాయి. అరుణకిరణాలు ఇంకా వాటిని చుంబించలేదు. చెట్లమీద పక్షులు ఉల్లాసంగా, మధురంగా పాడు తున్నాయి. కాని, రోహిత్ మనసిప్పుడు ఈ ప్రకృతి సౌందర్యాన్ని ఆస్వాదించే స్థితిలోలేదు. అతడు రాతిబొమ్మలా అక్కడే నిలబడి రశ్మి రాకకై నిరీక్షిస్తు న్నాడు. చాలా సేపటివరకు ఆమె రాకపోవడంతో రోహిత్ ఆందోళనగా లేచి నిలబడ్డాడు. రశ్మికోసం మరికొంతసేపు వుండాలా లేక ఇంటికి వెళ్ళాలా అని ఆలో చిస్తున్న సమయంలో అతనికి రశ్మి వేసిన కేక వినిపించింది. హడావిడిగా రశ్మి వెళ్ళిన వైపు పరుగుతీశాడు.

దట్టంగా పెరిగిన పొదలను, వాటి కొమ్మలను పక్కకు తొలగించుకుంటూ పెద్దగా రశ్మి పేరు పెట్టి పిలుస్తూ అతడు అడవిలో ముందుకు పోతున్నాడు. మరి కొంత దూరం ముందుకు పోగానే రశ్మి రెండోసారి వేసిన కేక వినిపించింది. ఆమె అతన్నే పేరుపెట్టి పిలుస్తోంది.




రోహిత్ గుండె వేగంగా కొట్టుకో సాగింది. కొంచెం దూరంగా వెళ్ళిన తరువాత అతనికి ఒక గుంటలో రశ్మి కని పించింది. ఆమె ఒక వలలో చిక్కుకొని వుంది. దానిని ఎవడో వేటగాడు అడవి జంతువుకోసం ఏర్పాటు చేశాడు. రశ్మి వలలో నుండి తప్పించుకోవాలని ప్రయత్నం చేస్తూ కాళ్ళుచేతులు ఆడిస్తోంది. రోహిత్‌ను చూడగానే ఆమె రోహిత్‌వైపు చెయ్యి చాచింది. రోహిత్ ఆమె చెయ్యినందుకుని ఒక్క ఊపులో బయటకు లాగాడు. వల ఇంకా ఆమె కాళ్ళకు తగులుకొని వుంది. రోహిత్ జేబు నుంచి చాకు తీసి వల తాళ్ళను కోసి వేశాడు.



రశ్మి బంధవిముక్తురాలయింది. కానీ గుంటలో పడటం, దానినుండి బయట పడాలని ప్రయత్నం చేయటంలో ఆమె బ్లవుజు రెండుమూడుచోట్ల పెద్దగా చిరిగింది. ఆ చిరుగుల్లో నుండి నున్నగా, తెల్లగా ఆమె శరీరం కనిపిస్తూ ఉంది. రోహిత్ రెప్పవేయడం మరచి ఆమె శరీరపు వొంపులను చూస్తూ వుండి పోయాడు. ఆమె సిగ్గుపడి రెండు చేతులతో శరీరాన్ని కప్పాలని విఫల ప్రయత్నం చేసింది.

అంతలో రశ్మి వివశత్వాన్ని, తన మూర్ఖత్వాన్ని గ్రహించిన రోహిత్ కళ్లు కిందకు వాల్చాడు. వెంటనే తన స్వెట్టరు తీసి ఇచ్చాడు.

రశ్మి అతని చేతిలోని స్వెట్టరును లాక్కుంది. ఆమె భయాన్ని గ్రహించిన రోహిత్ ఆమెకేసి చూడకుండా ఆమె పడిన గుంటవైపు చూడసాగాడు. తన నుండి దూరంగా పారిపోతున్న రశ్మిని మళ్ళీ తన దగ్గరకు చేర్చిన ఆ వేటగానికి మనసులోనే ధన్యవాదాలు చెప్పుకొన్నాడు.

అంతలోనే దగ్గిన శబ్దం వినిపించడంతో అతడు ఆ వైపు తిరిగాడు. రశ్మి అతనివైపు చూస్తూ చిన్నగా నవ్వుతోంది. స్వెట్టరు ఆమెకు బాగా సరిపోయింది. ఆమె ఇంతకుముందుకంటే ఎంతో అందంగా, స్మార్ట్‌గా కనిపిస్తోంది.

రోహిత్ రెప్పవాల్చకుండా ఆమెనే చూస్తున్నాడు.

"ఏమిటి...అలా వింతగా ఎప్పుడూ చూడని జంతువును చూసినట్లు చూస్తున్నారు?"

"ఓహ్...ఈ స్వెట్టర్‌లో నువ్వు ఎంత అందంగా వున్నావో...వర్ణించడం నా తరంగాదు"

"ఆత్మీయత ఉంటే అన్నీ బాగుంటాయి" ఆమె ఈ మాటలని కిలకిలా నవ్వింది.

"అవును..." ఆమె ఎందుకలా అన్నదో అర్థంకాకున్నా అతడు ఆమె మాటను అంగీకరించాడు. కానీ అతడి ముఖంలో ప్రశ్నార్థకం ఉంది.

"ఎందుకలా అన్నానో అర్థం చేసుకొన్నారా? ఇప్పుడు నన్ను 'మీరు' అనే బదులు 'నువ్వు' అంటున్నారు. మన మధ్య ఆత్మీయత పెరిగింది. అందుకే ఈ స్వెట్టరు కూడా సరిగ్గా సరిపోయింది."

నేల మీద ఎండుటాకులు దుప్పటిలా పరుచుకొని ఉన్నాయి. వాటిని నలిపివేస్తూ నడిచిపోసాగిందామె. అక్కడి ప్రశాంత వాతావరణంలో ఆకుల గలగల శబ్దం చాలాదూరంవరకూ వినిపిస్తోంది. రోహిత్ అక్కడే నిలబడి ఒక్కక్షణం పాటు ఆలోచించి ఏదో నిర్ణయానికి వచ్చినవాడిలా ఆమె వెనకే బయలుదేరాడు.

"ఎలావుంది ఇక్కడి ప్రకృతి?" రశ్మి మాటలకు ఉలిక్కిపడ్డాడు.

"అద్భుతంగా ఉంది. ఈ చిన్న పూరిలో ఇంత ఆకర్షణీయమైన, అందమైన ప్రకృతి వుందంటే చాలా ఆశ్చర్యంగా వుంది"

"మనసుకు ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగించే ఈ సుందర దృశ్యాలే గనుక లేకుంటే నేనీ పల్లెటూళ్ళో ఉండలేకపోయేదాన్ని"

"ఇక్కడికి రోజూ వస్తూంటావా?"

"ఆc...క్రమం తప్పకుండా వచ్చి ఈ సుందర దృశ్యాలను చూస్తూ కాలం గడుపుతుంటాను"





ఎండుటాకులను తొక్కుతూ పడిగా నడుస్తోందామె. రోహిత్ దీర్ఘంగా ఆలోచిస్తూ ఆమె వెనక నడుస్తున్నాడు.

రశ్మి ఒకచోటచటుక్కున కూర్చొంది. ఆమె అలసిపోయి కింద కూర్చొందేమో అనుకుంటూ అతడు కూడా ఆమెకు కొంచెం దూరంలో కూర్చున్నాడు. అతని దృష్టి చెప్పుల్లేని రశ్మి పాదంపై బడింది. ఆమె రెండు చేతులతో కుడికాలిని పట్టు కొని వుంది. ఆ కాలి బొటన వేలినుండి ఎర్రగా రక్తం కారుతోంది.

"ఏమిటి...ఏమయింది?" రోహిత్ ఆందోళనగా అడిగాడు.

"ముల్లు గుచ్చుకొంది"

"ఏదీ... నాకు చూపించు తీస్తాను" రోహిత్ ఆమె దగ్గరకు జరిగాడు.

"మీ దగ్గర పిన్ను ఉందా?"

"పిన్నుతో తీయడం మంచిదికాదు... సెప్టిక్ అయ్యే ప్రమాదం ఉంది"

"కానీ ముల్లు గుచ్చుకొంటే నడుప లేను. చాలా నొప్పిగా వుంది"

"పిన్ను లేకుండా తీస్తాను వుండండి" అని మెత్తని ఆమె కాలును తన చేతుల్లోకి తీసుకుని ముల్లు ఎక్కడవుందో వెదక సాగాడు. కాలికి మట్టి అయినందున ముల్లును వెదకడం కొంచెం కష్టంగా వుంది. బొటన వేలికి వున్న మట్టిని తుడిచి, ముల్లు వెదుకుతోంటే ఆమె శరీరంలో విద్యుత్తు ప్రవహించినట్లయింది. ఆమె ఒంట్లో గగుర్పాటు కలిగింది.

రెండు నిమిషాల్లో అతడు రశ్మి కాలికి గుచ్చుకొన్న ముల్లు తీశాడు.

రశ్మి కాలి నొప్పి తగ్గింది. ప్రాణం కుదుటపడింది. కొంచెం సేపటివరకూ ఆమె కాలు అతని చేతుల్లోనే వుంది. ఆమె కాలు వెనక్కు తీసుకోవాలని ప్రయత్నించ లేదు. ఇద్దరూ ఒకరి కళ్ళలోకి మరొకరు చూస్తూ వుండిపోయారు. ఇద్దరూ తమ మనసులో దాగిన మాటలను ఎదుటివారికి చెప్పాలనుకొంటున్నారు. కానీ ఏదో అజ్ఞాత శక్తి వాళ్ళ గొంతులను నొక్కిపడుతోంది. చాలా సేపటివరకూ ఇద్దరూ పరిసరాలను మరచి ఏవేవో ఊహల్లో తేలిపోయారు. ఇద్దరి మనసులు సంతోషంగా, మత్తుగా వున్నాయి. అతడు రశ్మి పాదాన్ని ఒడిలో నుంచి తీసి కిందపెట్టి లేవడానికి ఉద్యుక్తుడయ్యాడు. ఆమె అతని వైపు ప్రేమగా, గోముగా చూస్తూ అన్నది -

"ఇంకా కొంచెం సేపు కూర్చోండి... తొందరేమి వచ్చింది"

"నాకు తొందరేమీలేదు కానీ... నీకే ఆలస్యమౌతుంది" అంటూ అతడు మళ్ళీ కూర్చున్నాడు.

"ఇక్కడ ఇంకెన్ని రోజులుంటారు?" ఆమె కొన్ని క్షణాలు గడచిన తరువాత అడిగింది.

"రెండు మూడు రోజులుంటాను... అంతే"

"వెళ్ళి అర్జంటుగా చేయాల్సిన పను లేమయినా ఉన్నాయా?"

"అవును. ఒక ఇంటర్వ్యూకి వెళ్ళాలి"

"ఎక్కడ?"

"రైల్వే డిపార్టుమెంటులో"

"మీరు రైల్వే ఉద్యోగం చేస్తారా?" ఆమె ఆశ్చర్యంగా అడిగింది.

"మా నాన్నగారు కూడా రైల్వేలోనే గార్డు ఉద్యోగం చేశారు"

"ఎంత జీతం ఇస్తారు?"

"మొదట రెండువందలు ఇస్తారు. చివరకు ఆరేడు వందల దాకా ఇస్తారు"

"కానీ... అంతతక్కువ డబ్బుతో ఎలా జీవిస్తారు?" రశ్మి ఏదో విషయం

ఆలోచిస్తూ అన్నది.

"ఒంటరిగాడిని... ఎలాంటి దురభ్యాసమూలేదు. బాగానే సరిపోతుంది" రోహిత్ చిన్నగా నవ్వుతూ అన్నాడు.

"కానీ పెళ్ళయిన తరువాత ఒంటరి వాళ్ళెలా అవుతారు? అప్పుడెలా గడుస్తుంది?"

''నా భార్య తన అదృష్టాన్ని, సంపదను వెంట తెచ్చుకొంటుంది"

"అవన్నీ పాత రోజుల్లో మాటలు. ఈరోజుల్లో పిల్ల తరపువాళ్ళు అబ్బాయి గుణగణాలు, శక్తియుక్తులకంటే అతని ఆర్థిక స్తోమతకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు"

"అయితే మరీ మంచిది. అమ్మాయి దొరకకుంటే బ్రహ్మచారిగానే ఉండిపోతాను"

"ఎప్పటివరకు?"

''నా సంపాదనను గురించి ఆలోచించకుండా, దానిని లెక్కచేయకుండా నన్ను నన్నుగా ప్రేమించే అమ్మాయి దొరకేంత వరకు" రోహిత్ నవ్వుతూ అన్నాడు.

"సరే... ఓ అమ్మాయి వుందనుకోండి" రశ్మి చిలిపిగా అతని ముఖంలోకి చూస్తూ అంది.

''అనుకొన్నాను'' రోహిత్ కూడా ఆమెలాగే అన్నాడు.

''ఆ అమ్మాయికి మీరు బాగా నచ్చారు"

''అది నా అదృష్టం. ఆతర్వాత చెప్పండి?" రోహిత్ ఏదో ఆలోచిస్తూ అన్నాడు. అతడు విచిత్రంగా వున్న రశ్మి మాటలను వింటూ ఆకర్షణీయంగా వున్న ఆమె ముఖాన్ని చూస్తూ అడిగాడు.

''ఒకవేళ ఆ అమ్మాయి గనుక మీతో ఈ ఉద్యోగం చేయవద్దు అని అంటే?"

"ఆమె నన్ను ఆకలితో మలమల మాడి చావమని ఎందుకు అంటుంది?" రోహిత్ చిరునవ్వుతో అన్నాడు. అతడు నెమ్మదిగా రశ్మి మాటలలోని అంతరార్థం గ్రహించసాగాడు.

"ఆమె మిమ్మల్ని ఆకలితో చావనియ్యదు'' రశ్మి అతనివైపునుండి ముఖం పక్కకు తిప్పి అన్నది. ఆమె గంభీరంగా మారిపోయింది.

''మరి ఏం చేస్తుంది?"

''ఆమె చాలా ధనవంతురాలు. ఆమె వద్ద ధనరాసులు మూలుగుతున్నాయి''

"భలే తమాషా చేస్తున్నారే... అంతటి ధనవంతురాలు నావంటి ఫకీరును పెళ్లి చేసుకొని ఏం చేస్తుంది?"

''ఆమెకు ఇష్టమయింది... చేసుకుంటుంది''

"కానీ నాకు ఏ ధ న వం తు ని కుమార్తెకూ భర్తగా, మరోవిధంగా చెప్పాలంటే బానిసగా వుండటం ఇష్టం లేదు" అని అతడు లేచి నిలబడ్డాడు.

రశ్మి అతని చెయ్యి పట్టుకొని ఆపి, కూర్చోబెట్టింది. "మిమ్మల్ని బానిసగా ఎవరు చేస్తారు!"

''మీ మాటల్లో ఇంకేం అర్థం ఉంది" అతని ప్రశ్న కటువుగా వుంది.

"ఆ అమ్మాయి మీకో మంచి ఉద్యోగం ఇప్పిస్తుందేమో" అతని స్వరంలోని కటుత్వాన్ని లెక్క చేయకుండా రశ్మి మృదువుగా అంది.

రోహిత్ ముఖకవళికలు వెంటనే మారిపోయాయి. అతడు నవ్వుతూ అడిగాడు "జీతం ఎంత ఇస్తారు?"

"స్టార్టింగ్ వెయ్యి రూపాయలు... అంతేకాదు—వుండటానికి ఒక బంగళా, తిరగడానికి ఒక జీపు కూడా ఇస్తారు"





"అంత మంచి ఉద్యోగం అయితే ఆలోచిస్తాను" అంటూ రోహిత్ భావగర్భితంగా నవ్వాడు.

"అయితే మరి నాన్నగారికి చెప్పమంటారా?" అని రశ్మి అనగానే అతడు ఆమెకేసి చూడసాగాడు.

ఆమె చెబుతున్నది మరెవరో అమ్మాయిని గురించి కాదనీ, తనను గురించేననీ రోహిత్ ఊహించాడు. కానీ ఆమె ఇంత త్వరగా తన మనసు విప్పి చెబుతుందని మాత్రం అనుకోలేదు. నమ్మలేనట్లుగా ఆమెకేసే చూడసాగాడు. అతడి చూపులకు ఆమె సిగ్గుపడింది.

"సాయంత్రం మళ్ళీ కలుద్దాం" రశ్మి మెల్లగా అంది.

"ఎక్కడ?" రోహిత్ భయపడుతూ అన్నాడు.

"ఈ కొండమీదే. ఇక్కడ సాయంకాలాలు ఉదయ సంధ్యలకంటే ఎంతో అందంగా ఉంటాయి"

రోహిత్ అంగీకార సూచకంగా తల వూపాడు. రశ్మి అతనికేసి చూస్తూ చిలిపిగా అంది – "ఓకే...సాయంత్రం కలుద్దాం" ఈ మాటలని ఆమె గిరుక్కున వెనక్కు తిరిగి వెళ్ళింది.

ఆమె మాటలకు, అద్భుత సౌందర్యానికి, విశిష్ట వ్యక్తిత్వానికి ముగ్ధుడైన రోహిత్ ఆమెవైపు రెప్పవేయకుండా చూస్తూ వుండిపోయాడు.

తర్వాత మెల్లగా అడుగులు వేస్తూ ఊరివైపు నడిచాడు. అతని మనసును ఎన్నో ప్రశ్నలు వేధిస్తున్నాయి. నిశ్చితార్థం జరిగిన రశ్మి తనను ఎందుకు ప్రేమిస్తోంది? ఆమె స్వభావం ఎలాంటిది? ఆమె ఏమి కోరుతోంది? చిక్కుముడి లాంటి ఈ ప్రశ్నలను గురించి ఆలోచిస్తున్నకొద్దీ అతని మెదడు ఇంకా మొద్దుబారిపోతోంది.



# 4

రశ్మి చెప్పింది నిజమే.

ఆ లోయలో సూర్యాస్తమయం సూర్యోదయం కంటే ఎన్నో రెట్లు అందంగా, మనోహరంగా వుంది. బంగారు రంగుతో మెరిసిపోతున్న సూర్యబింబం ఇప్పుడు కొండలవెనక అస్తమించబోతోంది. అది కొత్త పెళ్ళికూతురు ఎరుపెక్కిన ముఖాన్ని, మునుగులో దాచుకొంటున్నట్లుగా వుంది.

సూర్యుడు అస్తమించాడు. కాని రశ్మి రాలేదు. ఏ చిన్న శబ్దం అయినా రోహిత్ పక్కకు తిరిగి చూస్తున్నాడు. రశ్మిని గురించి అతని మనసు పరిపరి విధాలుగా ఆలోచిస్తోంది.

పొద్దు కుంకడంతో చెట్ల నీడలు నల్లగా, భయంకరంగా మారసాగాయి. చల్లగాలి వీస్తోంది. రోహిత్ కళ్ళలో ఇంతవరకు వున్న ఆశ నశించి నిరుత్సాహపడ్డాడు. రశ్మి ఒక మృగతృష్ణ వంటిదనీ, ఆమె ప్రేమ కేవలం ఓ భ్రమ అనీ తలపోయసాగాడు. నిరీక్షణ అతన్ని ఎంతో వ్యాకులపరచింది. ఆమె ఇలా చేస్తుందని అతడు వూహించలేకపోయాడు.

నిరాశతో, ఆరిపోయిన మనసుతో,

గంభీర ముద్రలో ఇంటిదారి పట్టాడు.

ఇంటికి వెళ్ళగానే అతడు నేరుగా తన గదికి వెళ్ళి దీపం వెలిగించకుండానే మంచంపై అడ్డంగా పడిపోయాడు. క్రమంగా చీకటి ఎక్కువ అవుతోంది. మనసులో కూడా గాఢాంధకారం అలుము కొంది. రశ్మితో పరిచయం అతనిలో మధుర భావాలను రేకెత్తించింది. ఆ పరిచయమే, ఆ సంఘటనలే ఇప్పుడు భరించ రాని వ్యథను కలిగిస్తున్నాయి.

మూసిన కనురెప్పల్లో రశ్మి సౌంద ర్యాన్ని ఇముడ్చుకొని అక్కడే నిద్ర పోయాడు. కొంచెంసేపయిన తర్వాత గదిలో శబ్దం కావడంతో లేచి కూర్చు న్నాడు. గదిలో దీపం వెలుగుతోంది. అత్తయ్య అతని సూట్‌కేస్‌లో బట్టలు సర్దుతోంది.

"అత్తయ్యా... ఏం చేస్తున్నావు?" రోహిత్ అడిగాడు.

"చాకలి తెచ్చిన నీ బట్టలు సర్దు తున్నాను"

ఆమె వెళ్ళగానే రోహిత్ లేచి తల దువ్వుకొన్నాడు. చల్లని నీళ్ళతో ముఖం, చేతులు కడుక్కొని టవలుతో తుడుచు కొన్నాడు. కిందికి దిగాలని మెట్ల మీదికి వచ్చాడు. మెట్లు దిగుతోంటే వినిపించిన మధుర స్వరం విని ఠక్కున ఆగి పోయాడు. పక్కనున్న కిటికీ గుండా బయటికి చూశాడు. ఇంటి ముందు అరుగుమీద రశ్మి, ఆ పిల్లలతో క్యారమ్స్ ఆడుతోంది. ఆమె కాయిన్సును పాకెట్‌లో వేసినప్పుడు పిల్లలు సంతోషంతో చప్పట్లు కొడుతున్నారు. వాళ్ళతో పాటు ఆమె కూడా నవ్వుతోంది.

అక్కడ రశ్మిని అలా చూసి తన కళ్ళను తాను నమ్మలేకపోయాడు. మూడు నాలుగు సార్లు రెప్పలాడించి పరిశీలనగా చూశాడు. శిశిర ఋతువులో వసంతం వచ్చినట్లనిపించి ఒళ్ళు పులక రించింది. నేరుగా వెళ్ళి రశ్మిని గట్టిగా కౌగలించుకొని, ఆమె చేసిన మోసానికి ప్రతీకారం చేయాలనిపించింది.

రశ్మి మెట్లవైపు రావడం చూసిన రోహిత్ మెల్లగా వెనక్కు తిరిగి తన గదికి వెళ్ళాడు. అతడు సూట్‌కేసులోని బట్టలు బయట పడేసి, వాటిని వరుసగా మళ్ళీ సర్దుతున్నాడు. అతని చెవులు తలుపు దగ్గర కాబోయే శబ్దం కోసం ఎదురు చూస్తున్నాయి. గుండె వేగంగా కొట్టుకొంటోంది.

అంతలో రశ్మి తలుపు దగ్గరికి వచ్చి నిలబడింది.

"ఏం చేస్తున్నారు?"

"ప్రయాణానికి సిద్ధపడుతున్నాను"

"ఎక్కడికి పోతున్నారు?"

"ఈ వూరికి దూరంగా"

"ఎందుకు?"

"ఇక్కడి మనుషులు చాలా చెడ్డవాళ్లు. ప్రమాణాలు చేస్తారు కాని నెరవేర్చరు" రోహిత్ రోషంనిండిన స్వరంతో అని మళ్ళీ బట్టలు సర్దసాగాడు.

"నేనుమాత్రం అలాంటిదాన్ని కాదు" రశ్మి ఈ మాటలని వచ్చి అతనియెదుట మంచంమీద, సూట్‌కేసు పక్కన కూర్చుంది.

ఆమె కళ్ళలోకి తీవ్రంగా చూస్తూ రోహిత్ అడిగాడు-"అయితే నన్ను కొండమీదికి రమ్మని ఎందుకు అన్నావు?"

"అయాంమ్ సారీ" రశ్మి తలకిందికి వాల్చి అన్నది. కొంచెం ఆగి ఆమె మళ్ళీ అన్నది-"నేను విధిలేని పరిస్థితిలో రాలేక పోయాను"





"ఏమిటీ పరిస్థితి?" రోహిత్ విసుగ్గా అడిగాడు.

"కైలాష్ చాలాకాలం తర్వాత ఇక్కడికి వచ్చాడు."

"ఓహ్...అదాసంగతి" అతడు నిట్టూర్పు విడిచాడు. కైలాష్ పేరు వినగానే అతడేమీ మాట్లాడలేకపోయాడు. అతనికి గొంతులో ఏదో అడ్డుపడినట్లయింది. అతడేదో ఆలోచనలో పడ్డాడు. రశ్మి కూడా మౌనంగా కూర్చుని అతని ముఖంలో మారుతున్న రంగులను, భావాలను గమనిస్తోంది.

"ఒంటరిగా వచ్చావా?" అతడామె అందాన్ని కళ్ళతోనే తృప్తిగా ఆస్వాదిస్తూ అన్నాడు.

"లేదు...మాలతి వెంట వచ్చాను" రశ్మి చూపులు కిందికి వాల్చి అన్నది.

"ఏదయినా పనివుండి వచ్చావా?"

"మీకోసమే... మీతో మాట్లాడాలని"

"ఓహ్...థాంక్స్! చాలామంచిది. నేను వూరికి వెళ్ళేలోపల నిన్ను కలిసి మాట్లాడే అవకాశం దొరకదేమో అనుకొన్నాను"

"కాని మీరు రేపు వెళ్ళడానికి వీలు లేదు"

"ఎందుకని?"

"మీకు ఒక ఉద్యోగం రెడీగా వుంది"

"కాని, నేను...."

"నాన్నగారు మిమ్మల్ని రేపు రమ్మన్నారు. అన్ని సంగతులూ స్వయంగా మాట్లాడుతారట. ఈ విషయం చెప్పడానికే నేను ఇప్పుడిక్కడికి వచ్చాను" రశ్మి అతని మాటలకు మధ్యలోనే అడ్డువస్తూ అన్నది.

"మీ నాన్నగారు నన్ను బొత్తిగా ఎరుగరు. మరి నావంటి అపరిచితునికి, బాధ్యతాయుతమైన ఉద్యోగం ఎలా ఇస్తారు?"

"నేను మిమ్మల్ని, మీ స్వభావాన్ని బాగా ఎరుగుదును. అది చాలు. ఈ ప్రాంతంలో మీ మామగారిని ఎరుగని వారెవరున్నారు? ఆయన మాట చాలు. మీకు ఎంత పెద్ద వుద్యోగమయినా ఇప్పించే సామర్థ్యం ఆయన మాటకు వుంది"

"కాని రెండురోజుల్లో నేనొక రైల్వే ఇంటర్వ్యూకు హాజరుకావాలి"

"ఆ ఇంటర్వ్యూను తగలెయ్యండి. ఆ ఉద్యోగానికో నమస్కారం పడెయ్యండి. మీరు ఇక్కడ చేయబోయే ఉద్యోగం రైల్వే ఉద్యోగంకంటే పదిరెట్లు మంచిదనీ, ప్రయోజనకరమైందనీ, గౌరవప్రదమైనదనీ నేను మీతో ముందే చెప్పానా లేదా? వెయ్యిరూపాయలు జీతం, వుండటానికి ఒక బంగళా, తిరగడానికి జీపు... ఇక మీరు మీనమేషాలు లెక్కపెడుతూ ఆలస్యం చేయకండి"

"అలాగేనండీ మేడమ్‌గారూ! నేను ఏమేమి పనులు చేయాల్సి వుంటుందో దయచేసి సెలవిస్తారా?"

"మీరు మా జాగీరు వ్యవహారాలు అజమాయిషీ చేయాలి. పని చాలా కష్టమైనది, బాధ్యతాయుతమయినది. అయినా నమ్మకంగా చేస్తారని నేను నమ్ముతున్నాను"

"మీకేమీ చెడ్డపేరు రానివ్వనని హామీ ఇస్తున్నాను. అది సరే... ఇంతకుముందు జాగీరు వ్యవహారాలు ఎవరు చూస్తున్నారు?"

"నాన్నగారే చూసుకొనేవారు. కాని ఇప్పుడాయన పెద్దవారయ్యారు. అంత కష్టం చేయలేకపోతున్నారు"

రోహిత్ సంభాషణ పొడిగించక ముందే ఆమె మంచంమీద నుండి లేచి

నిలబడింది. అంతలో బయట మెట్లు ఎక్కి ఎవరో వస్తున్న చప్పుడయింది. లక్ష్మి రోహిత్‌ను పిలుస్తూ లోపలికి వచ్చింది. లోపల రశ్మి వుండటం చూసి ఆశ్చర్య పోయింది. తర్వాత భోజనానికి రమ్మని రోహిత్‌ను పిలిచింది.

రోహిత్ సూట్‌కేసు మూసి వెనక్కు తిరిగాడు. లక్ష్మి రశ్మిని కూడా భోజనానికి పిలిచింది. కాని ఆమె ఇంటిదగ్గర తండ్రి తనకోసం ఎదురు చూస్తూంటాడని చెప్పి లక్ష్మితో మాట్లాడుతూ గడిదాటి బయటి గుమ్మందాకా నడిచింది. ఇంట్లో ఇంకా కొందరు బంధువులు మిగిలివున్నారు. అందరి చూపులు రోహిత్, రశ్మిలమీదే వున్నాయి. వీడ్కోలు చెప్తూ రశ్మి చెయ్యి చాపింది. రోహిత్‌కు ఆమె చేతిలో చెయ్యి వేసి వీడ్కోలు ఇవ్వక తప్పలేదు.

ఇంట్లోవాళ్లు అర్ధవంతంగా ఒక ర్నొకరు చూసుకొన్నారు. లక్ష్మి మూతి విరిచింది. తర్వాత ఏమో గొణిగింది. రశ్మి చేస్తున్న పనులు ఆమెకు బొత్తిగా నచ్చలేదు.

రశ్మిని సాగనంపి ఇంట్లోకి వచ్చిన రోహిత్‌తో ఆమె కోపంగా అన్నది-"ఈ పూట అన్నం తింటావా తినవా?"

"ఎందుకు తినను అత్తయ్యా? నువ్వు ఎందుకలా అడుగుతున్నావు? తప్పకుండా తింటాను" ఆమె చిరుకోపం గమనించిన రోహిత్ ఏమీ ఎరుగని వానిలా అన్నాడు.

"ఆ అమ్మాయి భోజనానికి ఆహ్వానించిందేమో అనుకొన్నాలే" లక్ష్మి వ్యంగ్యంగా అన్నది.

"ఆహ్వానించింది... నిజమే. కాని ఈరోజుకాదు. రేపు రమ్మన్నది" రోహిత్ అత్తయ్యను ఇంకా వుడికించాలని అన్నాడు.

అతడుకాళ్ళు, చేతులు కడుక్కొని వెళ్ళి మామయ్య పక్కన కూర్చొన్నాడు. ఆయన భోజనానికి తయారయి హుక్కా పీలుస్తూ కూర్చున్నాడు.

కొంచెంసేపు ఆగి రోహిత్ అన్నాడు-"మామయ్యా... ఒకవేళ నేను రైల్వే ఇంటర్వ్యూకు వెళ్లకుంటే?"

"ఒక సదవకాశం చెయ్యిజారి పోతుంది. సిన్హాగారి సిఫారసు కూడా వ్యర్థమైపోతుంది. ఇంత మంచి వుద్యోగం మళ్ళీ దొరకడం అంత సులభమైన పని కాదు"

"నాకు అంతకంటే మంచి ఉద్యోగం దొరికితే?"

"ఎక్కడ?"

"ఈ వూళ్లోనే"

"ఈ వూళ్ళోనా? నీకేమయినా పిచ్చి పట్టిందా! ఈ వూళ్ళో అంత మంచి వుద్యోగం ఏముంది నాకు తెలియకుండా" మామ ఆశ్చర్యపోతూ అని, నీళ్ల గ్లాసును చేతిలోకి తీసికొన్నాడు.

"రశ్మి వాళ్ల నాన్నగారు..." రోహిత్ మామయ్య ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"ఆయన నీకు ఏం ఉద్యోగం ఇస్తాడు?"

"మేనేజరు వుద్యోగం. నెలకు వెయ్యి రూపాయలు ఇస్తారని నమ్ముతున్నాను"

మామ ఆశ్చర్యపోయాడు.

"ఓహో... ఇప్పుడు నాకు అంతా అర్థం అయింది. రశ్మి ఎందుకు వచ్చిందో నీకేమి చెప్పిందో తెలిసింది" ఆయన తల పంకిస్తూ అన్నాడు.

"రశ్మి నాన్నగారు నన్ను రేపు ఉదయం రమ్మన్నారట"




"ఆయన బాగా డబ్బున్నవాడే కాని మనిషి కొంచెం కఠినుడు. ముక్కుమీద కోపం వుంటుంది'' ఆయన ఈ మాటలు చెప్తూ ఏవో ఆలోచనల్లోకి జారి పోయాడు.

"నాకు ఆయన స్వభావంతో ఏమి పని వుంది? నా డ్యూటీ నేను చేసి, జీతం తీసికొంటాను''

''ఆయనతో వ్యవహారం చాలా కష్టం. అంతేకాదు – ఆయన ఎస్టేటులో పని చేయడం చాలా ప్రమాదకరం కూడా''

"అందుకే ఎక్కువ జీతం ఇస్తు న్నారు''



"ఏదయినా ఒక బాధ్యతను స్వీకరించే ముందు దాని బాగోగులను గురించి బాగా ఆలోచించుకోవాలి. సరేగానీ "ఆయనకు నీ పేరు ఎవరు రెకమెండు చేశారు?"

"రశ్మి"

"నీకు వుద్యోగం కావాలని ఆమెకు ఎలా తెలుసు?"

"మాటల సందర్భంలో నేనే రైల్వే ఇంటర్వ్యూను గురించి ఆమెతో చెప్పాను. రైల్వే వుద్యోగం అతి సాధారణమైన వుద్యోగం అని ఆమె వాదించింది''

"ఓహో...అలాగా!"

"ఆమె తండ్రికి బాగా కష్టపడేవాడు, విశ్వాసపాత్రుడు,మంచి గుణాలుకలవాడు అయిన మేనేజరు కావాలట. అందుకని రశ్మి నాకు ఆ అవకాశం ఇవ్వాలను కొంది''

''అమ్మాయి చాలా చురుకైనదిలా వుంది. మూడు నాలుగు దినాల పరిచయంలోనే నీ మంచితనాన్ని, సిన్సియారిటీని గ్రహించింది'' ఈ మాటలంటూ ఆయన భావగర్భితంగా రోహిత్ ముఖంలోకి చూశాడు. రోహిత్ కూడా మామ చూపుల్లో చూపులు కలిపాడు. ఇద్దరూ నవ్వారు

* * *

నౌకరు రోహిత్‌ను తీసికొని వెళ్ళి ఆదరపూర్వకంగా హాలులో కూర్చుండ పెట్టాడు. హాలును, అందులోని ఖరీదయిన ఫర్నిచరును చూసిన రోహిత్ ఆశ్చర్యానికి అంతులేదు. అతనికి ప్రాచీన కాలపు రాజమహల్లో కూర్చున్నట్లుగా వుంది. నేలపై అందమైన ఇరాన్ దేశపు తివాచీ, ఖరీదైన ఫర్నిచరు,గోడలకు పెద్ద ఆయిల్ పెయింటింగులు–ఆ ఇంట్లో వుంటున్న వ్యక్తుల అయిశ్వర్యాన్ని, హోదాను ప్రకటిస్తున్నాయి. హాలు మధ్యలో వేలాడుతున్న పెద్ద దీపం హాలు అందాన్ని ఇనుమడింపజేస్తున్నది.

నౌకరు వెళ్లి అతని రాకను యజమానికి చెప్పి వచ్చాడు. రోహిత్ మనసు సంకోచంతో ముడుచుకొని పోయింది.

భయాన్ని, సంకోచాన్ని మరచిపోయే ప్రయత్నంలో లేచి గోడలకు వున్న చిత్రాలను పరిశీలించి చూడసాగాడు. ఆ చిత్రాలద్వారా రశ్మి పూర్వీకులను గురించిన కొన్ని సంగతులు తెలుసు కోవచ్చునన్న ఆశ కూడా అతనిలో వుంది. కాని పరాయి ఇంట్లో, ఎవరూ లేని సమయంలో ఆవిధంగా గదంతా తిరగడం సభ్యత కాదని గ్రహించి తన స్థానంలో వచ్చి కూర్చుని రశ్మి నాన్నగారి కోసం నిరీక్షించసాగాడు.

''హల్లో...'' రశ్మి కంఠస్వరం మధు రంగా, వీణ మీటినట్లుగా వినిపించింది. అతడు వులిక్కిపడ్డాడు. "హల్లో... ఆమె పిలుపునకు జవాబుగా అని, ఆమె వైపు తిరిగాడు. ఆమె చేతిలో గులాబి పూల గుత్తులు వున్నాయి. వాటిని ఇప్పుడే తోటలో నుండి తెస్తోంది.

రశ్మి అతని దగ్గరకి వచ్చి స్వాగతం ఇస్తున్నట్లుగా చిలిపిగా నవ్వుతూ అన్నది ''గుడ్ మార్నింగ్ ... ఎప్పు డొచ్చారు?''

"ఇప్పుడే"

అంతలో నౌకరు వచ్చి రోహిత్‌ను పైకి రమ్మంటున్నారని చెప్పాడు. రశ్మి రోహిత్‌కు సైగ చేసి భయపడాల్సిన పని లేదని చెప్పింది. నిస్సంకోచంగా పైకి వెళ్ళమని ప్రోత్సహించింది. కాని అతడు సంకోచిస్తూ– "నీవు కూడా వెంట





రాకూడదూ" అన్నాడు.

"అరే...ఎందుకలా భయపడతారు? పరాయిఇంటికి వచ్చినట్లు సందేహిస్తున్నారే! పదండి"

"నేను ఇంతకు ముందెప్పుడూ మీ నాన్నగారితో మాట్లాడలేదు''

"అందుకేకదా ఈరోజు పిలిపించింది. భయపడాల్సిన పనేమీ లేదు. కాని ఒక సంగతి–నాన్నగారు పైకి కాస్త కఠినంగా కనిపిస్తారు. డబ్బు విషయాల్లో పిసినారితనం చూపుతారు.. కాని మీరు మాత్రం వెయ్యి రూపాయలకంటే తక్కువకు వప్పుకోవద్దు. జాగ్రత్త...ఇక వెళ్లండి''

రెండు నిమిషాల తర్వాత రోహిత్ దీవాన్ సర్దారీ లాల్ ముందు నిలబడి వున్నాడు.

దీవాన్ జీ వరండాలో పడక కుర్చీలో పడుకొని వుదయం ఎండలోని వెచ్చదనాన్ని అనుభవిస్తున్నారు. ఆయన ముఖానికి అడ్డంగా వార్తా పత్రిక వుంది. రోహిత్ వచ్చిన అలికిడి విని ఆయన ముఖానికి అడ్డంవున్న పత్రికను తొలగించి చూశాడు.

రోహిత్ గుండె వేగంగా కొట్టుకో సాగింది. తనో పేరు ప్రతిష్టలు కలిగి, ఠీవిగా వున్న ఓ పెద్దమనిషి ముందున్నాడు. పెద్ద మీసాలు, నిప్పుల్లాంటి పెద్ద కళ్లతో పెద్ద వయస్సు వాడయినా ఆరోగ్యంగా కనిపిస్తున్నాడు.

ఆయన రోహిత్‌ను నఖశిఖ పర్యంతం పరిశీలనగా చూశడు. రోహిత్ చేతులు జోడించి నమస్కరించాడు.

"కూర్చో.."ఆయన గంభీరస్వరంతో ఆదేశించాడు. రోహిత్ ఎదురుగా వున్న కుర్చీలో ఒదిగి కూర్చున్నాడు.

దీవాన్ గారు మళ్లీ పేపరు చూస్తున్నారు.

"నీ పేరేమి?" కొంచెంసేపయిన తర్వాత ఆయన వార్తాపత్రిక నుండి చూపులు మరల్చి అన్నాడు.

"రోహిత్'' అతడు కంపిస్తున్న స్వరంతో అన్నాడు.

"ఎంతవరకు చదివావు?"

"ఈ సంవత్సరమే బి. ఎ. పూర్తి చేశాను"

"నువ్వు... వంశీధర చెల్లెలి కొడుకువి కదూ?"

"అవునండి"

"ఇప్పుడు నీవేం చేయాలనుకుంటున్నావు?"

"నాకు అప్పగించిన ఏ పనయినా బాధ్యతాయుతంగా చేయాలనుకుంటున్నాను" రోహిత్ నెమ్మదిగా, మర్యాదగా అన్నాడు.

"రశ్మి చాలా మొండిపిల్ల" దీవాన్ గారు తనలోతాను గొణుగుకున్నారు.

"అవునండి..."ఆయన ఏ వుద్దేశంతో ఆ మాట అన్నాడో అర్థంకాకుండానే రోహిత్ అన్నాడు.

"నిన్ను గురించి బాగా విచారించి, తెలుసుకోకుండానే ఇక్కడ వుద్యోగానికి నిన్ను సెలెక్టు చేసింది"

"అందుకు ఆమె పశ్చాత్తాప పడవలసిన అవసరం రాదు"

"శెబాష్! నీ నమ్మకాన్ని, ధైర్యాన్ని మెచ్చుకొంటున్నాను. రేపటినుండి పనిలో చేరు"

"నేను ఏం పని చేయాల్సివుంటుంది?"

"నా జాగీరును అజమాయిషీ చేయడం, గుమస్తాల పనిని పర్యవేక్షించడం, వాళ్ళ లెక్కలు తనిఖీచేయడం...అంతే! నీడ్యూటీ అంతవరకే. అందుకుగాను నీకు నెలకు

నాలుగు వందల రూపాయలు ఇస్తాము"

"నాలుగు వందలేనా! పని చాలా కష్టమైంది. బాధ్యతతో కూడింది"

"నువ్వు సక్రమంగా నమ్మకంగా పనిచెయ్యి. తర్వాత యాభయ్యో, వందో పెంచుతాను"

"కాని దీవాన్‌గారూ... పని భారాన్ని బట్టి చూస్తే మీరు ఇస్తామంటున్న జీతం చాలా తక్కువ" రోహిత్ బిడియ పడు తూనే అన్నాడు.

"అయితే నీకెంతకావాలి?"

"కనీసం వెయ్యిరూపాయలు"

"వెయ్యి రూపాయలే!" ఆయన చేతిలోవున్న పత్రిక జారి కిందపడింది. ఆయన రోహిత్‌ను పరిశీలనగా చూడ సాగాడు. మారుతున్న ఆయన ముఖ కవళికలనుచూసిన రోహిత్ భయపడ్డాడు. ఆయనను శాంతపరచడానికి ఏమి మాట్లా డాలా అని ఆలోచిస్తుండగా ఆయనే మాట్లాడాడు.

"అంత డబ్బు ఇవ్వడం అంటే మా శక్తికి మించిన పని"

"సరే... మీ ఇష్టం. అంతకంటే తక్కువ జీతానికి నేను చేయలేను. నేను ఉచితమైన వేతనమే అడిగానని భావిస్తున్నాను" రశ్మి చెప్పిన మాటలు గుర్తుకురావడంతో అతడు తన మాటమీదే దృఢంగా వున్నాడు.

"అయితే ఈ విషయం జాగ్రత్తగా ఆలోచించవలసిందే"

"సరే... మరి నాకు సెలవు ఇప్పిం చండి"

"అలాగే... నీవు వెళ్లు" దీవాన్‌గారు నిర్లక్ష్యంగా అన్నారు.

దీవాన్‌గారి మాటలు విన్న రోహిత్ సందేహంలో పడ్డాడు. దీవాన్‌గారి ఇష్ట ప్రకారం చేయాలో లేక రశ్మి మాటలు నమ్మి తన మాటపైనే స్థిరంగా నిలబడి వుండాలో తేల్చుకోలేకపోతున్నాడు.

అతడలా అయోమయ స్థితిలో వుండ గానే రశ్మి అక్కడికి వచ్చింది. ఆమె చేతిలోని ఫ్లవర్‌వాజ్ నిండా గులాబీ పూలు చక్కగా అమర్చబడి వున్నాయి.

రశ్మి రాకతో అతనికి కొంత ధైర్యం వచ్చినా ఇక అక్కడ ఆగడం వ్యర్థమని పించింది.

అతడు లేచి రెండడుగులు ముందుకు వేశాడు. దీవాన్‌గారు కూతురివైపు ఒకసారి చూశారు. వెంటనే ఏదో జ్ఞప్తికి వచ్చినవానిలా అన్నాడు "ఆగు!"

వెళ్ళబోతున్న రోహిత్ ఆగి వెనక్కు చూశాడు. దీవాన్‌గారి దగ్గరికివచ్చి ఆయన ఏమి చెప్తారో వినాలని రెడీగా వున్నాడు. దీవాన్‌గారు వెంటనే ఒక నిర్ణయానికి రాలేక సతమతమవుతున్నారు. ఆయన చాలా సేపు తలవంచి ఆలోచిస్తూగడిపారు. రశ్మి రోహిత్‌వైపుచూసి నిర్ణయం అతనికి అనుకూలంగా వుంటుందనీ, ఏమీ భయపడాల్సిన పనిలేదని సైగచేసింది. అయినా రోహిత్ విచిత్రమయిన మానసిక సంక్షోభంలో వుండిపోయాడు.

చివరకు దీవాన్‌గారు తల పైకెత్తి ముందు రశ్మి వైపు, తర్వాత రోహిత్‌వైపు చూసి అన్నాడు–''సరే, నీవు కోరినట్లే ఇస్తాము. రేపు పనిలోచేరు"

''చాలా థాంక్స్...'' రోహిత్ తనలో పొంగుతున్న సంతోషాన్ని అణచు కొంటూ అన్నాడు.

"ఒక విషయం మీరు గుర్తుంచు కోవాలి" ఈసారి రశ్మి మాట్లాడింది.

"ఏమిటది?" రోహిత్ అడిగాడు.

"జబ్బుపడి బాగయినప్పటినుండి

 

నాన్నగారికి కోపం కాస్త ఎక్కువయింది. ఆయన కోపంలో ఏమైనా అంటే మీరు తప్పుగా భావించకూడదు"

రోహిత్ ''సరే'' అన్నట్లుగా చిరునవ్వుతో తల పంకించాడు. వెళ్లడానికి అనుమతి కోరాడు. రశ్మి టీ తాగి వెళ్ళమని అర్థించింది కాని అతడు వద్దని నమ్రతగా బయటపడ్డాడు.

దారిలో నడుస్తున్నాడే గాని అతని కళ్లముందు అమాయకత వుట్టిపడే రశ్మి ముఖమే నిలిచివుంది.



## 5

జీపులో ప్రయాణంచేస్తూ రోహిత్ సర్దారీలాల్ జాగీరును పరిశీలిస్తున్నాడు. వెంటవున్న రశ్మి అతనికి అన్ని విషయాలూ వివరిస్తూంది. ఆమె రోహిత్‌కు అతడు చేయవలసిన పనిలోని మంచిచెడ్డలను, అతడు తీసుకోవలసిన జాగ్రత్తలను వివరిస్తోంది. అతడు తన డ్యూటీని ఏ ఇబ్బందీ లేకుండా చేయాలని ఆమె అభిలాష.

దీవాన్‌గారి జాగీరు చాలా పెద్దది. దేవదారు చెట్లతో నిండిన అడవి, తేయాకు, యాపిల్ తోటలు, కోళ్ళు, పశువుల పెంపక కేంద్రాలూ వంటి ఎన్నో పరిశ్రమల ద్వారా ఆయనకు మంచి ఆదాయం వస్తోంది. ఆ జాగీరుకు ఆయనే మహారాజు. ఆయన ఆజ్ఞకు అక్కడ తిరుగు లేదు. అక్కడి మనుషులేకాదు-పశువులు, పక్షులు కూడా ఆయన ఆజ్ఞను శిరసావహిస్తాయి. ఇంతగా విస్తరించివున్న వ్యవహారాలన్నీ నిర్ణీతపద్ధతిలో జరుగుతూ వుండటం రోహిత్‌లోని కార్యదీక్షకు ప్రోత్సాహకరంగా వుంది.

దట్టమైన అడవికి రెండోవైపు ఓ చిన్న తిప్పమీద ఆఫీసు, ఉద్యోగుల క్వార్టర్సు వున్నాయి. అక్కడికి చేరిన తర్వాత రశ్మి వుద్యోగులందరిని కొత్త మేనేజరుకు పరిచయం చేసింది. అబ్దుల్, బాదల్ సింహ్ అక్కడ చాలాకాలం నుండి పని చేస్తున్న గుమస్తాలు. వాళ్ళకు జాగీరులో మంచి పలుకుబడివుంది. ఆతర్వాత రోహిత్‌కు కేటాయించిన ఆఫీసు మెట్లు ఎక్కుతూ రశ్మి మెల్లగా అన్నది-

"అబ్దుల్‌ను, బాదల్‌ను మీరు ఒక కంట కనిపెట్టాలి"

"ఎందుకని?"

ఇంతలో వాళ్ళిద్దరూ మేడపైకి చేరారు. రోహిత్ తాను వుండబోయే ఆఫీసు గదిని, ఇతర గదులను పరిశీలనగా చూశాడు. తర్వాత తన ప్రశ్నలకు సమాధానం చెప్పమన్నట్లుగా రశ్మికేసి చూశాడు.

"వాళ్ళిద్దరూ కైలాష్‌కు చాలా సన్నిహితులు.." రశ్మి 'చాలా' అన్న పదాన్ని నొక్కి పలుకుతూ అన్నది. ఆమె స్వరంలో ఓ ప్రత్యేక భావం ఇమిడి వుంది.

"కైలాష్ ఇక్కడ ఏం చేస్తుంటాడు?" రోహిత్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నాన్నగారి ఆరోగ్యం పాడయినప్పటి నుండి జాగీరు వ్యవహారాలు చూస్తున్నాడు"

"ఓహో ... అదా సంగతి! మరి నువ్వు ఈ సంగతి ముందే ఎందుకు చెప్పలేదు?"

"అవసరం రాలేదు. ఇకముందు అన్ని విషయాలూ మీరే చూసుకోవాల్సి వుంటుంది"

"కైలాష్ ఏమయినా వేరుగా భావిస్తాడేమో?''

"అతనెవరు మధ్యలో వేరుగా భావించడానికి!"

"రేపు నీ జీవిత భాగస్వామి కాబోయే వ్యక్తికదా'' రోహిత్ భావయుక్తంగా చిన్నగా నవ్వి అన్నాడు.

''కానీ...నేను మాత్రం అతన్ని పెళ్ళి చేసుకోనని స్పష్టంగా చెప్పేశాను" రశ్మి గంభీర ముద్రలో అన్నది.

"ఎందుకని?" ఈ మాట ఎందుకన్నాడో రోహిత్‌కే తెలియదు. కాని అతనికి మనసులో కొంత సంతోషంగా వుంది.

''అతడు నా ఆశయాలకు, అభిప్రాయాలకు పూర్తిగా భిన్నమయిన మనిషి"

"మీ నాన్నగారేమంటున్నారు?"

"'నీవు వట్టి అమాయకురాలివి. తెలివిలేని దానివి' అంటూ నన్నే మందలించారు"

"అందుకు నీవేమన్నావు?''

"అంతిమ నిర్ణయం ఆయనకే వదిలాను. అయితే ఏదో ఒకరోజు ఆయన నా ఇష్టానికి అనుకూలంగానే నిర్ణయం చేయక తప్పదని కూడా చెప్పాను"

"మరి....ఆయన వప్పుకోకపోతే?''

రోహిత్ అడిగిన ఈ ప్రశ్నకు ఆమె కొంచెం అయోమయంలో పడింది. తరువాత దృఢమైన స్వరంతో అన్నది-

"ఈ జాగీరు కోసమైనా ఆయన నా మాటను అంగీకరించక తప్పదు''





''ఎందుకు...ఈ జాగీరు ఆయనది కాదా?"

"ఇదంతా నా పేరుమీద వుంది. నాన్న కేవలం గార్డియనే. ఈ జాగీరు మా తాతగారిది. అమ్మ ద్వారా నాకు సంక్రమించింది"

''అయితే మరి కైలాష్‌తోనే నీ పెళ్ళి జరిపించాలని ఆయన ఎందుకంత పట్టుదల చూపిస్తున్నారు?''

"కైలాష్ కేవలం నాన్నగారి స్నేహితుని కుమారుడే కాదు...స్వయానా నా అక్కకు భర్త''

"నీకు అక్క వుందా...కైలాష్ ఆమె భర్తా?'' ఈ కొత్త సంగతి తెలిసిన రోహిత్ ఆశ్చర్యానికి అంతులేదు.

"అవును. కైలాష్‌కు మా అక్కతో వివాహమయింది. కాని వివాహమయిన రెండు సంవత్సరాలకే ఆమె చనిపోయింది. అప్పటినుండి నాన్నగారు నన్ను కైలాష్‌కు భార్యగాచేయాలనీ, పాడయిన అతని కుటుంబాన్ని మళ్ళీ బాగుచేయాలనీ తీవ్రంగా ప్రయత్నిస్తున్నారు''

"అతని సంసారం నిలబెట్టాలని ఆయన నీ ఆశలను,రంగుల భవిష్యత్తును నాశనంచెయ్యడం ఎందుకు?''

"ఈ జాగీరు విడిపోకుండా వుండటానికి. అక్కయ్య భాగం జాగీరు ఇప్పుడు కైలాష్ ఆధీనంలో వుంది'' ఈ కొత్త రహస్యం విన్న తర్వాత రోహిత్ మరికొంచెం ఆందోళన చెందాడు. ఈ చిక్కు సమస్యను గురించి అతడు దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. అంతలో ప్రసంగం మారుస్తూ రశ్మి అన్నది-

"ఇక్కడ మీకు ఎలా వుంది?''

ఆమె ప్రశ్నకు రోహిత్ వులిక్కిపడ్డాడు. రశ్మి చెప్పిన విషయాలు విన్న అతని మనసులో ఆలోచనలు సాలె

గూడులా అల్లుకొనిపోయాయి. ఈ ఆలోచనల మూలంగా తానొక అందమయిన భవనంలోని అతి సుందరమయిన మేడ గదిపై రశ్మితో ఏకాంతంగా వున్నాననే విషయమే మరచిపోయాడు. దట్టమయిన అడవి మధ్య సహితం పట్టణాలలోని, భవనాలలోవున్న ఆధునిక సౌకర్యాలన్నీ అక్కడ వున్నాయి. వాళ్ళు ఇప్పుడున్న విశాలమైన గదిలో చక్కగా అమర్చబడిన ఫర్నిచర్ చూసి రోహిత్ అడిగాడు-

''ఇక్కడ ఎవరు వుంటున్నారు?''

"మిస్టర్ రోహిత్ కుమార్. జాగీరు యొక్క కొత్త మేనేజరుగారు" రశ్మి చిరునవ్వు నవ్వుతూ అంతకు ముందే తలుపునకు తగిలించివున్న సైన్‌బోర్డును చూపింది.

దానిని చూసిన రోహిత్ కృతజ్ఞతా పూర్వకంగా రశ్మిని చూశాడు. ఆమె చేసిన వుపకారానికి కృతజ్ఞత చెప్పడానికి తగిన మాటలు అతనికి దొరకలేదు.

ఇంతలో బాదల్‌సింహ్ భార్య బిజిలీ మంచినీళ్ళ కూజాతో అక్కడికి వచ్చింది. ఆమె నవ యవ్వనంతో ఆరోగ్యంగా, పుష్టిగా, చలాకీగా వుంది. పేరు మాత్రమే కాదు, మనిషికూడా మెరుపుతీగలా వుంది. ఆమె ప్రతి అవయవం నిండుగా మగవానిలో కోరికలు రేపేటట్లు వుంది. ఆమె నడుస్తూ వుంటే మెరుపుతీగె మెరిసినట్లుగా, కన్నులు మిరుమిట్లు కొలుపుతూ వుంది. ఆమె కూజా స్టూలు మీద పెట్టి రోహిత్‌కు వందనం చేసింది. తర్వాత రశ్మి వైపు తిరిగి అడిగింది-

"అమ్మగారూ...టీ తెమ్మంటారా?"

"మీకు టీ కావాలా?" రశ్మి రోహిత్‌ను అడిగింది.

"వెరీగుడ్. బాగా అలిసిపోయాము. ఇప్పుడు టీ తాగితే అలసట అంతా పారిపోతుంది'' అతడు చిరునవ్వుతో జవాబు ఇచ్చాడు.

"అయితే వుండండి బాబుగారూ! ఫస్టు క్లాస్ టీ వేడివేడిగా తయారుచేసి తెస్తాను. ఒక కప్పు తాగారంటే మీ బడలిక అంతా తీరిపోతుంది'' బిజిలీ వయ్యారంగా అన్నది. వెంటనే అంతకంటే వయ్యారంగా నడుస్తూ వంటగది వైపు వెళ్ళింది.

రశ్మి నాలుగడుగులు వేసి గదికి వెనకవైపు వున్న కిటికీ తెరిచింది. బయట నుండి వచ్చిన పూల పరిమళం ఒక్కసారిగా గదంతా నిండుకొంది. రోహిత్ కిటికీ దగ్గరికి వెళ్ళి బయటికి తొంగిచూశాడు. కింద ఓ పెద్ద పూలతోట వుంది. ఆ తోటలో పూలతో నిండిన గులాబీ మొక్కలు, మల్లెలు, జాజి పొదలు కన్పిస్తున్నాయి. మనసును మత్తుతో ముంచే పరిమళం అతని మనసుకు ఆహ్లాదం కలిగించింది.

''నా అదృష్టం ఇంత త్వరగా మారిపోతుందని నేను కలలో కూడా వూహించలేదు" కొంచెంసేపు మౌనంగా వున్న తర్వాత రోహిత్ అన్నాడు.

''నీ రాకవల్ల నా అదృష్టం కూడా మారిపోతుందని నమ్ముతున్నాను. నా నమ్మకం వమ్ముచేయనని ప్రమాణం చెయ్యి రోహిత్" రశ్మి పరవశంతో అన్నది.

"ఎలా మారుతుంది?''

''కైలాష్‌ను ఈ జాగీరు నుండి దూరంగా పంపడంద్వారా! ఆ పని చేయాలంటే నీవు రాత్రింబవళ్ళు కష్టపడాలి. ప్రతి అడుగు ఆలోచించి

వేయాలి. పనిలోని ప్రతి అంశాన్ని క్షుణ్ణంగా అర్థంచేసుకోవాలి. జాగ్రత్తగా ప్రవర్తించి కూలీలనందరినీ నీ గుప్పెట్లో పెట్టుకోవాలి."

"నా శక్తికొలది ప్రయత్నిస్తాను... నాకు నీవు ఇచ్చిన ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేస్తాను.''

రశ్మి అతనివేపు ఆప్యాయంగా, ప్రేమగా చూసింది. రోహిత్ కూడా ఆమె అందమైన ముఖాన్ని తదేకదృష్టితో చూస్తూ వుండిపోయాడు.

''ఒకమాట అడగనా?'' రోహిత్ అన్నాడు.

''అడుగు''

''నాపట్ల ఇంత అభిమానం ఎందుకు చూపుతున్నావు?"

"నా స్వార్థంకోసం!''

''ఏమిటా స్వార్థం?"

"నిరాశామయమైన నా జీవితానికి ఒక మంచి సహయాత్రికుణ్ని పొందడం" రశ్మి ఈ మాటలు చెప్పినపుడు సిగ్గుతో ఆమె కళ్లు కిందకు వాలాయి.

సంతోషంతో రోహిత్ గుండె అతి వేగంగా కొట్టుకోసాగింది. తమ మధ్య వున్న కొత్తదనం పూర్తిగా మాసిపోయినట్లుగా ఫీలయ్యాడు. అతడొక విధమైన ప్రేమ మైకంలో ఎదుటివ్యక్తులను, పరిసరాలను మరచిపోయాడు. ఇంకా ఎంతసేపు అలావుండేవాడో కాని బిజిలీ రాకతో అతడు మళ్ళీ ఈ లోకంలోకి వచ్చాడు. బిజిలీ చేతో రెండు టీకప్పులతో ప్రత్యక్షమయింది.

*     *     *

రోజులు గడిచిపోతున్నాయి. రోహిత్ రాత్రనక, పగలనక జాగీరు వ్యవహారాలు చూస్తున్నాడు. రశ్మి సూచనమేరకు అతడు బాదల్‌తోను, అబ్దుల్‌తోను స్నేహంగా వ్యవహరిస్తూనే వాళ్ళ చర్యలను జాగ్రత్తగా గమనిస్తున్నాడు. వాళ్ళ స్వభావాలు అతడు బాగా గ్రహించాడు. ఇద్దరూ పైకి చాలా వినయంగా తీయగా మాట్లాడతారు. కాని అవసరంవస్తే ఎంతటి దుర్మార్గమయినా చేయడానికి వెనుదీయరు.

ఒకరోజు పెద్దకొట్లాట జరగబోయింది కానీ జరగలేదు. అబ్దుల్,బాదల్ కూలీలతో పేచీపడ్డారు. కూలీలుపని మానుకొంటామని బెదిరించారు. పరిస్థితి విషమించడంతో రోహిత్ జోక్యం చేసుకోవలసి వచ్చింది. అతడు కూలీల క్వార్టర్సుకు వెళ్ళాడు. అన్ని విషయాలూ స్వయంగా విన్నాడు. ప్రతి కూలివానికి సచ్చజెప్పి, పని మానుకొంటే కలుగబోయే కష్టాలను వారికి వివరించాడు. అతని సలహాలు వాళ్ళకు నచ్చాయి. వాళ్ళు రాజీపడ్డారు. అబ్దుల్, బాదల్ కూలీలపైన చేస్తున్న జులుం తగ్గిపోయింది. మొదటిసారిగా వాళ్ళకు చుక్కెదురయింది.

రశ్మి రోజూ ఒకసారి రోహిత్‌దగ్గరకు వెళుతుంది. అతడు ఒక విధేయుడయిన ఉద్యోగిలా ఆమెకు ఆరోజు జరిగిన విషయాలన్నీ వివరించేవాడు. ఆమె అతని తెలివితేటలకు, డ్యూటీపట్ల అతనికివున్న శ్రద్ధకు లోలోపల సంతోషించేది. అందరూ వున్నపుడు ఆమె ఒక యజమానురాలిలా ప్రవర్తించేది. ఏకాంతంలో మాత్రం స్వంత విషయాలు మాట్లాడేది.

నియమం తప్పకుండా రోజూ జరిగే ఈ సమావేశాలు వాళ్ళమధ్య ప్రేమను, ఆకర్షణను పెంచాయి. ఒక్కరోజుకూడా ఒకర్నొకరు చూడకుండా మాట్లాడకుండా వుండలేరేమో అని వాళ్ళకు అనిపించ




సాగింది. తమిద్దరి గాఢపరిచయం, సమావేశాలు షికార్లు అన్నీ అబ్దుల్, బాదల్‌ల ద్వారా కైలాష్‌కు తెలుస్తున్నాయనికూడా రోహిత్ గ్రహించాడు.

ఈ విషయంలో ఎదురుకాబోయే ఎలాంటి విషమపరిస్థితినయినా ఎదుర్కొనేందుకు రోహిత్ రెడీగా వున్నాడు. రశ్మి కూడా తన ప్రేమ వ్యవహారంలో నిశ్చలంగా, ఇతర వ్యవహారాలలో దృఢంగా వుంది.

ఒకరోజు రోహిత్ తన పనినుండి ఇంటికి వచ్చాడు. రశ్మి అతన్ని మెట్లదాకా వదిలి వెళ్ళింది. రశ్మి ఇచ్చిన గులాబి రెమ్మనుచేతిలో ఆడిస్తూ చిన్నగా పాడుతూ అతను తన గదిలోకి వచ్చాడు. కర్టెన్ తొలగించి లోపల అడుగుపెట్టబోయాడు.



లోపలవున్న వ్యక్తిని చూసి ఆశ్చర్య పోయాడు. అతడి చేతిలోవున్న గులాబి రెమ్మ కింద పడిపోయింది. అతడు ఆశ్చర్యంతో, భయం భయంగా కైలాష్ వైపు చూస్తూ వుండిపోయాడు. కైలాష్ సోఫాలో కూర్చొని కాళ్లు దూరంగా పార జాపి విలాసంగా కూర్చుని వున్నాడు.

"మీరా! మీరు ఎప్పుడు వచ్చారు?" రోహిత్ భయపడుతూ అడిగాడు.

"వచ్చి చాలా సేపయింది. మీ రాక కోసమే ఎదురుచూస్తున్నాను" జవాబు చెప్పిన కైలాష్ లేచి ముందుకు వచ్చి కింద పడిన గులాబీరెమ్మను అందుకొన్నాడు. గులాబీని వాసనచూస్తూ రోహిత్ కేసి తీవ్రంగా చూడసాగాడు.

"ఏదయినా పనివుండి వచ్చారా?" రోహిత్ తనను తాను సంబాళించుకొన్న తర్వాత అడిగాడు.

"నువ్వు అబ్దుల్‌ను బెదిరించావట! నిజమేనా?"

"అవును... వార్నింగ్ ఇచ్చాను. దొంగతనం చేస్తూ పట్టుబడ్డాడు"

"అయితే నీ సొమ్మేంపోయింది? అప్పుడప్పుడూ చిన్న దొంగతనాలు చెయ్యడం ఇక్కడ మామూలే. లేకుంటే ఇంత తక్కువ జీతాలతో పనివాళ్ల జీవితాలు ఎలా గడవాలి?"

"ఏమిటి మీరంటున్నది?" రోహిత్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నీవు వింటున్నది, నేను చెప్తున్నది ఒకటే! ఈరోజుల్లో దొంగతనం చేయని వాడెవడు? నువ్వు దొంగతనం చేస్తున్నావు...నేనుకూడా దొంగతనం చేస్తున్నాను...అందరం దొంగలమే"

"అంటే ఏమిటి మీ అభిప్రాయం? నాకేమీ అర్థం కావడంలేదు"

"అర్థంచేసుకొంటే అర్థమవుతుంది. ఒక అమాయకురాలైన యువతిని మభ్యపెట్టి వశపరచుకోవడం కూడా దొంగతనమే"

"మీరేమి చెప్పాలనుకొంటున్నారు మిస్టర్ కైలాష్?" రోహిత్ కోపంగా అడిగాడు.

"నువ్వు, రశ్మి రోజూ కలుసుకోవడం, మీ కబుర్లు, మీ షికార్లు అందరూ కథలుగా చెప్పుకొంటున్నారు. అది తెలపడానికే వచ్చాను"

"అయితే ఇక్కడికి రావద్దని మీరే రశ్మితో చెప్పండి" రోహిత్ విసుగ్గా అన్నాడు.

"షటప్! యూ..రాస్కెల్!" కైలాష్ కోపంగా కళ్లెర్రజేసి అన్నాడు. ఆ మాటలకు రోహిత్ కోపంతో ఊగిపోయాడు. రశ్మి పేరు బయటకివచ్చి ఆమె అవమానం పాలవుతుందని మౌనం వహించాడు. కైలాష్ ఒక నిముషం ఆగి మళ్ళీ అన్నాడు–

"ఆమెకు, నాకు వున్న సంబంధం ఏమిటో నీకు తెలియదు"

"నాకు బాగా తెలుసు" రోహిత్ దృఢ స్వరంతో అన్నాడు.

"తెలిసి వుంటే నువ్వు మా మధ్య అడ్డుగోడగా నిలబడే సాహసం ఎందుకు చేస్తున్నావు?"

"నేను యథార్థంచెబితే నీకు బాధ కలుగుతుంది"

"చెప్పకుంటే ఇంకా బాధకల్గుతుంది"

"అయితే వినండి. మీరు మీ భవిష్యత్తును గురించి కంటున్న కలలు కల్లలవుతాయి" రోహిత్ ఇంకా దృఢంగా అన్నాడు.

"రోహిత్...!" కైలాష్ పెద్దగా అరిచాడు. అంతకంటే ఏమీ అనలేక




పోయాడు. కోపంతో అతని ముక్కుపుటాలు పెద్దవయ్యాయి. చికాకుతో అతడు తన చేతి వేళ్ళు నలుపుతూ వున్నాడు.

కొంచెంసేపు అతడు అదే పరిస్థితిలో వున్నాడు. అంతలో అతని ఆవేశం తగ్గిపోయింది. ముఖం కాంతివిహీనం అయింది. నిప్పుల్లా ఎర్రగా వున్న కళ్ళు తెల్లబడ్డాయి. అతడు లేచి మెల్లగా నడిచి వచ్చి రోహిత్ భుజం పై చెయ్యివేసి అన్నాడు— "అయామ్ సారీ! ఉద్రేకంలో నిన్ను ఏమేమో అన్నాను. నువ్వు వాస్తవాన్ని చెప్పి చాలా మంచిపని చేశావు. విద్యావంతురాలు, వివేకవంతురాలు అయిన ఒక యువతిని బలవంతంగా నాదానిని చేసుకోవడానికి నాకేం అధికారం వుంది? నన్ను క్షమించు బ్రదర్!" అతడు చాల వినయంగా ఈ మాటలు పలికి ఓడిపోయినవాడిలా తల దించుకొని వెళ్ళిపోయాడు.

అతని ప్రవర్తన రోహిత్‌కు చాలా జాలి కలిగించింది. వాస్తవ విషయాలు కైలాష్‌కు చెప్పి అనుచితకార్యం చేశానేమో అని తలపోశాడు. తలవంచి ఏదో తీవ్రమైన ఆలోచనలో లీనమయ్యాడు.

గదిలో దట్టంగా కమ్ముకుంటున్న చీకటి అకస్మాత్తుగా వెలుగుగా మారిపోయింది. రోహిత్ పక్కకు తిరిగి చూశాడు. బిజిలీ వెలుగుతున్న దీపం చేత పట్టుకొని గదిలో ప్రవేశించింది. ఆమె దీపం బల్ల మీద పెట్టి దానిమీదున్న వస్తువులు సర్దింది. తర్వాత రోహిత్ దగ్గరికి వచ్చి అతడిని మంచం మీద నుండి లేచి కుర్చీలో కూర్చోమంది. రోహిత్ లేవగానే అతని పడకను సరిచేసింది.

"బిజిలీ...!" రోహిత్ చిన్నగా పిలిచాడు.

"నువ్వు నాపట్ల ఎందుకింత శ్రద్ధ చూపిస్తున్నావు?''

''బహుమతి కోసం!''

''కేవలం బహుమతి కోసం ఎవరూ ఇంత పని చేయరు. నేను కూలీలకు బోనస్‌లు, బహుమతులు ఇస్తుంటాను. కాని వాళ్ళెపుడూ ఇంత శ్రద్ధగా పని చేయడంచూడలేదు. వాళ్ళు తాము చేయాల్సిన పనిమాత్రమే చేస్తుంటారు"

"వాళ్ళు మగవాళ్లు.. కాని ఆడవాళ్ళ సంగతి వేరు బాబూ! వాళ్లు మనస్ఫూర్తిగా సేవ చేస్తారు''

రోహిత్‌కు ఆమె మాటలు నచ్చాయి. జేబులో నుండి పది రూపాయల నోటు తీసి ఆమెకు ఇచ్చాడు. ఆమె ముందు వద్దన్నది కాని తర్వాత అతని చేతిలో నుండి అందుకొని తన జాకెట్‌లో దాచుకొంది. రోహిత్ కళ్ళు పుష్టిగా, జాకెట్ నిండుగావున్న ఆమెవక్షాన్ని అరనిముషం సేపు పరిశీలనగా చూశాయి. అది గమనించిన ఆమె సిగ్గుతో నవ్వింది. తర్వాత ఆమె గదిలో నుండి బయటికి పోతూ వెనక్కి తిరిగి రోహిత్‌ను అడిగింది –

''బాబూ...మీకు ఒక కప్పు టీ తెమ్మంటారా?''

రోహిత్ అంగీకార సూచకంగా తల వూపాడు. ఆమె వంకర్లుపోతూ వంట గది వైపు నడిచింది.

అయిదు నిమిషాల్లో ఆమె టీ కప్పుతో ప్రత్యక్షమయింది. రోహిత్ టీ తాగబోతూ అన్నాడు" నీ భర్త బాదల్ ఎంత అదృష్టవంతుడు"

"ఎందుకని?"

"నీవంటి సేవాగుణం కలిగిన, చురుకైన స్త్రీ భార్యగా లభించినందుకు"

"ఆయనగారికి నేనుకాదు-నా చెప్పు కూడా సేవ చేయదు. ప్రతి రాత్రి వాడే నా కాళ్ళు పడతాడు!"

"అలా చేయించుకోవడం పాపం కాదూ!"

"పాపం, పుణ్యం సంగతి నాకు తెలియదు బాబూ! నాకు తెలిసింది ఒకటే....ఆడదానికి, మగవానికి సేవ చేయడంలోనే ఆనందం,తృప్తిలభిస్తాయి."

"బాదల్ మగవాడు కాదా మరి?"

"అతని మాటలు వదిలెయ్యండి బాబూ...మీ సంగతి చెప్పండి. ఇంకా ఎన్నాళ్లు ఇలా బ్రహ్మచారిగా వుంటూ బాధపడతారు? పెళ్లి చేసుకోరా?"

"చేసుకొంటాను .... ఈమధ్యేగా వుద్యోగం దొరికింది. ఇహ భార్య కూడా దొరుకుతుంది" రోహిత్ చిరునవ్వుతో అన్నాడు. అతనికి బిజిలీ మాటలు తమాషాగా వున్నాయి.

"మీకు భార్య దొరకడం మాత్రం కొంచెం కష్టమే!"

"ఎందుకూ?"

"మీరు ప్రేమించే అమ్మాయిపైన కైలాష్‌బాబు కన్ను పడింది. ఆయన చాలా గమ్మత్తయిన మనిషి. గడ్డివామిపై వుండే కుక్కలాంటివాడు. తాను తినడు.. ఎదుటివారిని తిననివ్వడు"

"ఈ సంగతులన్నీ నీకెలా తెలుసు?"

"ఆమాత్రం తెలుసుకోలేనా! నేను బాదల్ ఇంటికి వచ్చి నాలుగు సంవత్సరాలయింది. రాత్రిపూట నాలుగు గుక్కలు నాటుసారా తాగి వచ్చాడంటే కడుపులో వున్న రహస్యాలన్నీ కక్కేస్తాడు"

"అలా చెప్పు మరి! అయితే మీ బాబుగారి ప్రవర్తన గురించి కూడా నీకు చాలా విషయాలు తెలిసి వుంటాయ్!"

"ఓ...నెంబర్ వన్ వెధవ అంటే నమ్మండి. ఆయన కౌగిలిలో ఇమిడి పోవడానికి ఇష్టపడిన అమ్మాయిలే ఇక్కడి టీ తోటల్లో పనిచేయగల్గుతారు"

"ఓహ్...!" బిజిలీ మాటలకు అతడు ఆశ్చర్యపోయాడు. అతడింకా కొన్ని సంగతులు తెలుసుకోవాలని ఉత్సాహపడుతున్నాడు.

కొంచెంసేపు ఆగి బిజిలీ మళ్ళీ అన్నది – "ఒకరోజు ఆ దుష్టుడు సారా నిషాలో నా వెంటపడి నన్ను ప్రేమిస్తున్నానంటూ వాగసాగాడు"

"అప్పుడు నువ్వేం చేశావు?"

"'మీరు నన్ను నిజంగా ప్రేమిస్తుంటే నదికి వెళ్ళి పదిసార్లు ముఖం కడుక్కొని రండి' అన్నాను. ఆ మూర్ఖుడు నా మాటలు నిజమని నమ్మి నదికి వెళ్ళి ముఖం కడుక్కోసాగాడు" అని చెప్పి బిజిలీ కిలకిలా నవ్వసాగింది.

"ఆ తర్వాత ఏమయింది?" రోహిత్ కూడ నవ్వుతూ అడిగాడు.

"నేను ఎవరయినా చూస్తున్నారేమోనని అటు ఇటు చూశాను. తర్వాత మెల్లగా అతని వెనక్కు వెళ్ళి నడుము మీద గట్టిగా తన్నాను. అతడు ఎగిరి నీళ్లల్లో పడ్డాడు. నేను వెంటనే అక్కడనుండి పరుగుతీశాను"

బిజిలీ మళ్ళీ పెద్దగా నవ్వసాగింది. రోహిత్ కూడా నవ్వు ఆపుకోలేకపోయాడు. కొంచెంసేపయిన తర్వాత అతను తన నవ్వు ఆపుకొని అన్నాడు–

"అయితే మరునాడు కైలాష్ నీమీద కారాలు మిరియాలు నూరివుంటాడే!"

"లేదు బాబూ..అదే గమ్మత్తు! అక్కడే మగవాళ్లు బోల్తా కొడుతుంటారు" అని ఆమె కూడా పకపక నవ్వుతోంది. అంత





లోనే ఆమె నవ్వు తక్కున ఆగి పోయింది.

"బిజిలీ..." ద్వారం దగ్గర ఎవరిదో స్వరం కటువుగా వినిపించింది. రోహిత్ అటువైపు తిరిగి చూశాడు. బాదల్ బిజిలీవైపు కొరకొర చూస్తున్నాడు. అతడు గదిలో ప్రవేశించాడు. బిజిలీ అతన్ని చూడగానే నవ్వడం తక్కున ఆపింది. బాదల్ గదిలోకి రావడం చూసి ఆమె ఖాళీ టీకప్పు అందుకొని బయటికి వెళ్ళిపోయింది.

బాదల్ ఆమెకేసి తీక్షణంగా చూశాడు. తర్వాత రోహిత్ వైపు తిరిగాడు. అతని చేతిలో టిఫిన్ క్యారియర్ వుంది. దాన్ని బల్ల మీద పెడుతూ అతడు రోహిత్‌తో అన్నాడు—

"బిజిలీ అధికంగా మాట్లాడుంది బాబూ! మీరు తప్పుగా భావించకండి"

"బాదల్ ! నీ భార్య అతిగా మాట్లాడదు....కాని మెరుపులాగా మెరుస్తుంది. ఆమె నిన్నే పొగడుతూంది" రోహిత్ నవ్వుతూ అన్నాడు. బాదల్ చిన్నగా నవ్వాడు.

"జమిందారుగారితో పనివుండి వెళ్లాను. వస్తూంటే అమ్మాయిగారు ఈ టిఫిన్ క్యారియరు మీకోసం పంపారు" బాదల్ టిఫిన్‌వైపు చూపిస్తూ అన్నాడు.

రోహిత్ అడిగాడు "ఏముంది అందులో?"

"మీకు రాత్రి భోజనం వున్నట్లుంది"

"ఓహ్..సరే! అక్కడే వుంచు. నేను కొంచెంసేపు ఆగి తింటాను"

బాదల్ కొంచెంసేపు జమిందారీ కబుర్లు చెప్పి వెళ్ళిపోయిన తర్వాత రోహిత్ క్యారియర్ తెరిచి చూశాడు. దాని మూత తీయగానే రశ్మి పంపిన కూరల, పిండి వంటల సువాసన గదంతా వ్యాపించింది. గిన్నెల్లో పలావు, రకరకాల కూరలు, చపాతీలు వున్నాయి. రశ్మి ఇలా తనకు ప్రత్యేకమయిన భోజన పదార్థాలు పంపిందని కైలాష్‌కి తెలిస్తే అతడు పిచ్చికుక్కలాగా అయిపోయి, కనపడ్డవాళ్లందర్నీ కరుస్తాడేమో అని రోహిత్ మనసులో తలపోశాడు.తరువాత అతని దృష్టి చపాతీల పక్కనవున్న చీటీపై పడింది. దానిమీద గుండ్రని అక్షరాల్లో రాయబడి వుంది. "విష్ యూ స్వీట్ డ్రీమ్స్ ఆఫ్టర్ ఎ డెలిషియస్ డిన్నర్–'ఆర్'".

ఆ చీటీని చదివిన రోహిత్ రంగుల లోకంలో తేలిపోయాడు. అతడు ఆ వాక్యాన్ని నాలుగైదుసార్లు చదివి ఇంకా తనివితీరక ముద్దుపెట్టుకున్నాడు.

"ఓహ్... ప్రేమ ఎంత బలవత్తరమైనది ! ఎంత విచిత్రమైనది! మా ఇద్దరిలో చిగురించిన ఈ ప్రేమ అత్యల్ప కాలంలో ఎంత ఎత్తుగా ఎదిగింది?" అని ఆశ్చర్యపోయాడు.

* * *

హోలీ పండుగ వచ్చింది. మూడు రోజులనుండి ఎవరూ పనులకు పోవడం లేదు. గ్రామంలోని ప్రజలందరూ సరదాగా, హాయిగా డోలక్, తాళాలు వాయించుకొంటూ రకరకాల విచిత్ర వేషాలు వేసుకొని హోలీ పాటలుపాడుతూ తిరుగుతున్నారు. సారాయి, గంజాయి మత్తులో చాలామంది హుషారుగా కనిపిస్తున్నారు.

రోహిత్ హోలీ సందర్భంగా వాళ్ళ మామగారింటికి వెళ్లాలనుకున్నాడు. శాంత కూడా పెళ్లి అయిన తర్వాత వస్తున్న ఈ మొదటి పండుగకు

పుట్టింటికి వచ్చింది. రోహిత్ సాయంత్రం వస్తాననీ, రాత్రి భోజనం అక్కడే చేస్తాననీ చెప్పి పంపాడు. చాలా దూరం వరకు కనిపిస్తున్న రోడ్డువైపు రశ్మి రానున్న జీపుకోసం నిరీక్షిస్తున్నాడు. ఈరోజు హోలీ పండుగ. కనుక రశ్మి తప్పకుండా తన దగ్గరికి వస్తుందని అతని నమ్మకం.

వాళ్లు రోజూ ఇలా పరస్పరం కలుసుకోవడం, మాట్లాడుకోవడం, వాళ్ళ ప్రేమ వ్యవహారం పల్లె అంతా చర్చనీయాంశంగా అయిపోయింది.

అందుకని వాళ్లు అప్పుడప్పుడు చాటుమాటుగా మాత్రమే కలుస్తున్నారు. రశ్మి ఏ పనయినా నిర్భయంగా, నిస్సంకోచంగా చేస్తుంది. రోహిత్‌ను ప్రేమిస్తున్న విషయం కూడా ఆమె రహస్యంగా ఉంచదలచుకోలేదు. ఇలాంటి విషయాలు దాచివుంచితే ఇతరులకు ఎక్కువ ఆసక్తిని, అనుభవించేవారికి ఎక్కువ మానసిక సంఘర్షణను కల్గిస్తాయని ఆమె భావన. దాచివుంచే కొద్దీ ఊహాగానాలు, పుకార్లు ప్రచారంలోకి వస్తాయని ఆమె నమ్మకం. కాని రోహిత్‌కు మాత్రం తన ప్రేమ వ్యవహారాన్ని చాటిచెప్పి రశ్మిని అందరిలో చులకనచేయడం ఇష్టంలేదు.

కాలానికి అనుగుణంగా నడవడం బుద్ధిమంతుల లక్షణం అని అతని నమ్మకం.

అతడు ఒక అరుగుపై గుడిసెల్లో వుండే కూలీలకు కనిపించకుండా వున్న చోట నిలబడి దారివైపు చూస్తున్నాడు. రశ్మి వస్తున్న జాడ లేదు. జీపు శబ్దం కూడా వినిపించలేదు. దారివైపే చూస్తూ ఊహల్లో విహరిస్తూ అతడు అక్కడే నిలబడ్డాడు. చాలాసేపు గడచిన తర్వాత రశ్మిని వాళ్ళ నాన్న రాకుండా చేసి వుంటారనీ, ఆమె ఇక రాదనీ అనుకొన్నాడు. అయినా సంతోషకరమైన ఈ పండుగ సమయంలో ఆమె రాకుండా వుండలేదని కూడా అతడి అంతర్యం చెప్తూంది.

రోహిత్ ఆలోచిస్తూ అక్కడే నిలబడి వున్నాడు. అంతలో వున్నట్లుండి ఎర్రని రంగునీళ్ళు అతని ముఖంమీద పడ్డాయి. అతడు ఖిత్తరపోయి "ఎవరది?" అని గిరుక్కున వెనుదిరిగి చూశాడు. రశ్మి చేతిలో పిచికారి పట్టుకొని నిలబడివుంది. రోహిత్ బిత్తరపోయి అరవడం ఆమెకు భలే సరదాగా వుంది. ఆమె కిలకిలా నవ్వుతోంది. కోపం ప్రదర్శించబోయిన రోహిత్ ముఖం నవ్వుతో కళకళలాడుతోంది.

"ఏయ్...రశ్మి! ఏమిటీపని?" అంటూ వుండగానే మళ్లీ రంగు చల్లింది. అతడు రంగులో తడిసిపోయాడు.

రోహిత్‌కు కూడా వుత్సాహం కల్గింది. రెండు అంగల్లో రశ్మి దగ్గరికి వెళ్ళి ఆమె చేతిలోని పిచికారిని లాక్కోవాలని ప్రయత్నించాడు. ఆమె మెత్తని చెయ్యి అతని చేతిలో చిక్కుబడిపోయింది. అతడు పిచికారిని లాక్కోగానే ఆమె అక్కడి నుండి పారిపోవాలని ప్రయత్నించింది కాని అతడామెచేతినిగట్టిగా పట్టుకొన్నాడు.

ఆ పట్టు వదలకుండా ఆమెను గట్టిగా లాగటంతో ఆమె అతని గుండెలకు ఆనుకొంది. ఇపుడామె అతని బాహుబంధాల్లో బందీ అయిపోయింది. ఆమె అతని పట్టునుండి విడిపించుకోవాలని ప్రయుత్నిస్తోంది. రోహిత్ ఆమె నడుముమీద చేయివేసి దగ్గరికి లాక్కొని ఆమె పిచికారితోనే ఆమెమీద రంగు చల్లాడు.

ఈ పెనుగులాటలో రశ్మి బ్లవుజు




కుడివైపు చిరిగిపోయింది. రోహిత్ కన్నులు జాకెట్టులో నుంచి కనిపిస్తున్న ఆమె నున్నని కాంతివంతమయిన శరీరాన్ని రెప్ప వాల్చకుండా చూడ సాగాయి. అది గమనించిన రశ్మి సిగ్గు పడింది. చిరుకోపం ప్రదర్శిస్తూ అన్నది–
"మీకు సిగ్గులేదు. ఏమిటా చూపులు?"
"ఈరోజు సిగ్గు వదిలేయాలి. ఈరోజు ఎవరేలాంటి చిలిపిపని చేసినా క్షమింప బడుతుంది" అని రోహిత్ చిన్నగా నవ్వాడు.
తర్వాత ఆమె చెవి దగ్గరికి జరిగి చెవిలో అన్నాడు–
"తాకితే చిరిగిపోయే ఇలాంటి చౌకరకం బట్టలు ధరిస్తే ఎలా?"
రశ్మి సమాధానం చెప్పలేదు. కాని కొరకొర చూసింది. రోహిత్ ఆమె భుజాలపై చేతులు వేసి తన దగ్గరికి లాక్కోవాలని ప్రయత్నించాడు. కాని ఆమె విడిపించుకొని మేడపైకి పరుగు తీసింది. అక్కడే రోహిత్‌కు కేటాయించిన గదులు వున్నాయి. రోహిత్ ఆమెను పట్టుకోబోయాడు కాని ఆమె పరుగెత్తి దొరకకుండా గదిలో దూరి లోపలివైపు గడియ పెట్టింది. రోహిత్ విఫలేక గది బయట వుండిపోయాడు.
జాకెట్లోంచి కనిపించిన రశ్మి తెల్లని శరీరమే ఇప్పటికీ అతని కళ్లముందు మెదులుతోంది. అతడు చేతిలో పిచికారి పట్టుకొని తలుపువేపే దృష్టి నిలిపి చూసు న్నాడు. ఆమె తలుపు తీయగానే రంగులో ముంచివేయాలని సిద్ధంగా వున్నాడు. చాలా సేపటివరకు రశ్మి తలుపు తీయక పోవడంతో అతడు చికాకు పడ్డాడు. తలుపు తట్టి మెల్లగా పిలిచాడు. జవాబు లేదు. అందుకని తలుపు గట్టిగా నెట్ట బోయాడు, కాని అది వెంటనే తెరచు కొంది.
లోపలి దృశ్యం చూసిన రోహిత్ ఆశ్చర్యపోయాడు. రశ్మి అతని నైట్ గౌను, పైజామా వేసికొని గది మధ్యలో వుంది చిరునవ్వు చిందిస్తూ. పురుష వేషంలో ఆమె గమ్మత్తుగా, ఆకర్ష ణీయంగా వుంది. ఆ చారల బట్టల్లోనుండి కూడా ఆమె అవయవాల వంపుసొంపులు బాగా కనిపిస్తున్నాయి. ఆమెను దగ్గరికి తీసుకొని గట్టిగా హత్తుకొని అలాగే కొన్ని నిమిషాలు, గంటలు వుండిపోతే బాగుండు నని అనిపించింది. కాని హద్దుమీరి ప్రవ ర్తించడం ఇద్దరికీ మంచిదికాదని భావించి ఆమె అతిలోక సౌందర్యాన్ని అలాగే చూస్తూవుండిపోయాడు. ఆమె నవ యవ్వనం, పాలు, పసుపు కలిపి తయారు చేసినట్లున్న శరీరం, పొందికగా, ఆకర్ష ణీయంగా వున్న అవయవాలు, కవ్వించే కళ్ళు... చూస్తూ నిలబడ్డాడు.
చిత్తరపోయి తనను చూస్తున్న రోహిత్ దగ్గరికి వచ్చి రశ్మి అడిగింది–
"నాకు ఈ బట్టలు ఎలావున్నాయి? మీకు నచ్చాయా?"
"ఏమిటి?" రోహిత్ అకస్మాత్తుగా నిద్రలేచిన వాడిలా అన్నాడు.
"మీ బట్టలు వేసుకొన్నాను! నాకు బాగాలేవా?" అని ఆమె చటుక్కున తన చేతులు వెనక్కి తీసుకొంది. ఆమె పిడికిలి మూసివుంది. అతడది గమనించి కూడా తెలియనివాడిలా అడిగాడు—
"బాగున్నాయి. కాని వాటి అదృష్టం చూస్తుంటే నాకు అసూయ కలుగుతూ వుంది. అవి నన్ను వదిలి నీ కోమల శరీరాన్ని వరించాయి..." అతడింకా ఏదో అనబోయేటంతలో ఆమె అన్నది—


చతుర ... లీల

"ష్...ష్...!" ఆమె రోహిత్‌ను మాట్లాడకుండా ఆపి చిన్నగా బయటికి పారిపోవాలని ప్రయత్నించింది. రోహిత్ చటుక్కున ఆమె చెయ్యి పట్టుకొని ఆమె పిడికిలి విప్పి చూడాలని ప్రయత్నిస్తూ అన్నాడు— "ఏమిటి? నా వస్తువు ఏదో దొంగిలించి పారిపోతున్నట్లున్నావు?"

"ఏమీలేదు...... అబ్బా! నాచెయ్యి వదలండీ...విరిగిపోతుంది"

"వదలను" అంటూ రశ్మి పిడికిలి విప్పి చూశాడు. ఆమె చేతిలో నుండి ఒక చిన్న వెండి పెట్టె కిందపడింది. రోహిత్ వంగి పెట్టె అందుకొని దానిని తెరచి చూశాడు.ఆ చిన్న పెట్టెలో కొన్ని యాలకులు వున్నాయి. అతడు రశ్మివైపు ప్రశ్నార్థకంగా చూశాడు. రశ్మి సిగ్గుపడుతూ అన్నది "మీకోసం"

"ఓహ్...అలా చెప్పమరి...థాంక్స్" అని రోహిత్ ఒక యాలకికాయ తీసి రశ్మికి తినిపించాలని ప్రయత్నం చేశాడు.

"ఉహూ... ముందుమీరు" అని ఆమె అతని చేతిలో వున్న యాలకులు అందుకొని తన సున్నితమైన వేళ్ళతో అతని నోటిలో వేసింది.

రోహిత్ ఆమెవైపు ఆనందంగా, ఓరగా చూస్తూ వాటిని పళ్ళతో కొరికాడు. వెంటనే "అబ్బా" అని పెద్దగా అరిచాడు. తరువాత నోటిలోవున్న దాన్ని కింద వుమిశాడు. రశ్మి పకపక నవ్వుతోంది. రోహిత్ తన మూర్ఖత్వానికి సిగ్గుపడ్డాడు. అయినా ఏడవలేక నవ్వాడు. యాలకుల లోపల చిన్న రాళ్ళువున్నాయి. అవి ఏదో చేదు రసంలో ముంచబడ్డాయి కూడా.

రోహిత్ రశ్మి చేసిన చిలిపి పనికి బదులు తీర్చుకోవాలనుకొన్నాడు. ఆమెను పట్టుకోవాలని ముందుకు అడుగువేశాడు. కాని ఆమె దొరకకుండా గది దాటి పారిపోయింది. రోహిత్ ఆమె వెంటపడ్డాడు... కాని ఆమె మేడదిగి కొంతదూరంలోవున్న గుంపులో కలిసిపోయింది. అక్కడ వున్నవాళ్ళు ఒకళ్ళపై ఒకళ్ళు రంగులు చల్లుకొంటూ నవ్వుతూ, పాడుతూ, ఎగురుతూ, గంతులువేస్తూ సంతోషంగా వున్నారు. గుంపులోని ఆడవాళ్లు రశ్మిపై రంగులు చల్లారు. ఆమెను వెంబడిస్తూ అక్కడికి వచ్చిన రోహిత్‌పై కూడా రంగులు చల్లారు. రోహిత్ కూడా బిజిలీ చేతిలోవున్న పిచికారి లాక్కొని అందరి మీద రంగు చల్లుతూ హోలీ వేడుకలో పాల్గొన్నాడు.

అక్కడ కొంచెంసేపు పెద్ద- చిన్న, ధనిక - పేద బేధ భావాలంతరించాయి. రోహిత్, రశ్మి కూడా తమ తమ అంతస్తులను, హోదాను మరచి రంగులు చల్లుకున్నారు. రశ్మి తలనుండి కాళ్ళదాకా ఎర్రని రంగులో తడిసివుంది. మెడలో ఢోలక్ తగిలించుకుని సంతోషంగా వాయిస్తోంది. అక్కడ కూడివున్న యువతుల్లో ఒకదానిలా అయిపోయింది. అందరూ నాట్యంచేస్తున్నారు. చప్పట్లు కొడుతున్నారు. కేకలు వేస్తున్నారు. అంతలో బిజిలీ ఎక్కడినుండో లడ్డూల పళ్ళెం తెచ్చింది. ఒక్కొక్క లడ్డు రశ్మి, రోహిత్ నోళ్లలో కుక్కింది. లడ్లు చాలా రుచిగా వున్నాయి. రోహిత్ ఇంకా రెండు లడ్లు ఆమె దగ్గర లాక్కొని ఒకదాన్ని రశ్మి నోట్లో కుక్కి తాను కూడా ఒకటి తిన్నాడు.

నృత్యం చేస్తున్నప్పుడు వాళ్ళకు ఆకాశం, భూమి గిరగిర తిరుగుతున్నట్లు అనిపించింది. లడ్లలో కలిపిన గంజాయి




తన ప్రభావం చూపసాగింది. అక్కడున్నవాళ్ళందరూ లడ్డూలకోసం ఎగబడ్డారు. ఒకరి చేతిలోది మరొకరు లాక్కొని తింటున్నారు. చేతిలో చెయ్యి కలిపి నాట్యంచేస్తున్న రశ్మి, రోహిత్ మెల్లిగా గుంపుకు దూరం అయ్యారు. అంతలో రశ్మి చటుక్కున చేయి విడిపించుకుని అడవివైపు పరుగుతీంది. రోహిత్ ఆమెను వెంబడించాడు.

ఒకరివెనుక మరొకరు పరుగుతీస్తూ ఒక సెలయేరు దగ్గరికి చేరారు. అది ఒక కొండమీదనుండి కిందవున్న పెద్ద రాళ్ళమీద పడుతోంది. రశ్మి చెట్ల పొదల మధ్య రోహిత్‌కు కనిపించకుండా పరు

గత్తింది. సెలయేరు దగ్గరికి వెళ్ళిన రశ్మి ఒక పెద్ద బండరాయిమీద కూర్చుంది. ఆమెపై నీటిధార పడ్తూంది. మంచులాంటి చల్లని నీటిలో తడిసిన రశ్మికి గంజాయి మైకం కాస్తా వదిలింది. ఆ నీటి ధార ఉల్లాసాన్ని, ఉత్సాహాన్ని కలిగిస్తోంది. రోహిత్ తనను కనుక్కోలేక అడవిలో వెదుకుతూ వుంటాడనుకొని తనలో తాను నవ్వుకొంది. చల్లని నీటి ధార మీద పడు తోంటే కళ్ళు మూసుకొని పరవశించి పోతూంది.

కొంచెంసేపటికి రోహిత్ ఆమెను వెదుకుతూ అక్కడికి వచ్చాడు. ఒక పెద్ద బండరాయి చాటున నిలబడి ఆమెను పరిశీలనగా చూస్తూ వుండిపోయాడు. తర్వాత మెల్లగా ఆమె వెనుకవైపు వెళ్ళి నిలబడ్డాడు. రశ్మి అతని రాకను గమనించకుండా హాయిగా స్నానం చేస్తోంది

నీటి ధార రశ్మి ముఖంమీద, తలమీద వున్న రంగును కడిగివేసింది. ఇపుడు రశ్మి ముఖం స్వచ్ఛమయిన ముత్యంలా, నిర్మలంగా మెరిసిపోతోంది. తడిసిన ఆమె ముఖం, ఆమె శరీరం మరింత ప్రకాశవంతంగా, అందంగా కనిపిస్తున్నాయి. రోహిత్ చటుక్కున వెనుక నుండి ఆమె కళ్ళు మూశాడు. రశ్మి భయంతో కెవ్వున అరిచింది.

అంతలో రోహిత్ "దొంగను పట్టుకున్నాలే" అంటూ ఎదుటికి వచ్చి నిలబడ్డాడు. తడిసిన ఆమె శరీరాన్ని మత్తు నిండిన కళ్ళతో తదేకంగా చూస్తున్నాడు. రశ్మి కూడా తనను తాను మరచిపోయి అతన్ని చూస్తూ వుండిపోయింది. తడిసి శరీరానికి అంటుకొనిపోయిన తన బట్టల విషయం ఆమె మరచిపోయింది. ఆమె అతని చూపుల్లో చూపులు కలిపి మత్తుగా చూస్తూ, నవ్వుతూ వుండిపోయింది. ఒంటికి అంటుకొనిపోయిన బట్టలు వుండీ లేనట్లే అయ్యాయి. ఆమె అందమైన శరీరపు వంపుసొంపులు స్పష్టంగా బయటకు కనిపిస్తున్నాయి. బలంగా, ఆరోగ్యంగా వున్న పచ్చని శరీరం, మత్తుగొలిపే కళ్ళు, తడిసి కాంతులు వెదజల్లుతున్న పెదాలు —ఇవన్నీ రోహిత్‌ను ప్రేరేపిస్తున్నాయి. ఆమెను బాహుబంధాల్లో బిగించమనీ, ముద్దుల వర్షంలో ముంచెత్తమనీ తొందర చేస్తున్నాయి.

అక్కడి ఆహ్లాదకరమైనవాతావరణం, పరిస్థితులు అతని కోరికలకు అగ్నికి ఆజ్యంలా తోడయ్యాయి. సిగ్గు, సంకోచం స్థానంలో నిర్లజ్జత, ధైర్యం నిండుకొన్నాయి. ఇద్దరిలోనూ ప్రేమాగ్ని రగిలి, జ్వాలగామారి దేహాలను దహించివేస్తోంది. ఇద్దరిలోనూ కోరికలు తుఫానులా చెలరేగాయి. రెండు తరుణ శరీరాలు అయస్కాంతమూ, ఇనుమూలాగా పరస్పరం ఆకర్షించబడి గాఢాలింగనంలో పరవశమయ్యాయి. పెదాలు ముద్దులద్వారా ప్రేమరసాన్ని తనివితీరా గ్రోలుతున్నాయి. అధరామృతం ప్రేమ జ్వాలను చల్లబరుస్తోంది.

వాళ్ళిద్దరూ పరిసరాలను మరచి గాఢాలింగనంలో పరవశులయివున్న సమయంలో అకస్మాత్తుగా ఒక పెద్ద బండరాయి పైనుండి దొర్లుతూవచ్చి వాళ్ళకు కొంతదూరంలో నీళ్ళలో పడింది.

ఇద్దరూ ఉలిక్కిపడి దూరంగా జరిగారు. రోహిత్ తలెత్తి పైకి చూశాడు. అక్కడ చెట్లచాటున ఏదో నీడ కదిలిపోతున్నట్లనిపించింది.

"ఎవరది?" రోహిత్ పెద్దగా అరిచాడు. రశ్మిని అక్కడే వదిలిపెట్టి కొండ




పైకి ఎక్కాడు. దూరాన చెట్లు, పొదల చాటున గుర్రంపై స్వారీచేస్తూ వెళుతున్న మనిషి కనిపించాడు. అతడు కైలాష్ అని గ్రహించడానికి రోహిత్‌కు ఎంతో సేపు పట్టలేదు. అతడు తనని, రశ్మిని వెంబడిస్తూ ఇక్కడికి వచ్చాడని రోహిత్ అర్థం చేసుకొన్నాడు.

"ఎవరది?'' రశ్మి బెదురు బెదురుగా అడిగింది.

"కైలాష్...!''

"ఓహ్... అంతేనా! దానికింత భయం దేనికి! నేను ఏదో అడివి జంతువు వచ్చిందని భయపడ్డాను సుమా!"

"కైలాష్ అడవి జంతువు కంటే భయంకరమయిన వాడు"

"నువ్వు అనవసరంగా అతనికి భయపడుతున్నావు. మూడ్ అంతా చెడగొట్టావు"

"అతనికి భయపడటం లేదుకాని మీ నాన్నగారికి చాడీలుచెప్పి ఏదయినా అనర్థం కలిగిస్తాడేమో అనిపిస్తుంది"

"అలా ఎన్నటికీ జరగదు"

"ఎందుకని?"

"నేను ఈరోజే నా నిర్ణయాన్ని డాడీకి చెప్పాలని నిర్ణయించుకొన్నాను"

"ఏమని...?"

"నేను నా జీవన సహచరుణ్ణి ఎన్నుకొన్నాను అని" రశ్మి దృఢస్వరంతో అన్నది.

రోహిత్ ఆమె బాహువులు పట్టుకొని దగ్గరికి లాక్కున్నాడు. ఆమె అందమైన కళ్ళలోకి తీక్షణంగా చూశాడు. ఆ చూపుల్లో కొత్త కొత్త మధురభావాలు ప్రతిఫలించాయి. ఆమె రోహిత్ విశాల వక్షస్థలంపై తలవుంచి కళ్లు మూసుకొని వుండిపోయింది.



## 6

రోహిత్ తన బంగళావైపు వెళ్తున్నాడు. అడవిలోని పెద్ద వృక్షాలు ఆ చీకటి రాత్రిలో నిద్రలో తూలుతున్నట్లుగా వున్నాయి. దూరాన హోలీ పండుగ సరదాలకు చిహ్నంగా పాటలు, మంగళ వాయిద్యాలు ఇంకా వినిపిస్తున్నాయి.

ఉన్నట్లుండి కళ్ళు మిరుమిట్లుగొలిపే కాంతి అతనిపై పడింది. ఆ కాంతి జీపు హెడ్‌లైట్ల నుండి వెలువడింది. జీపు రోడ్డు మధ్య ఆగివుంది. దగ్గరికి రాగానే జీపులో కూర్చుని వున్న రశ్మి తండ్రి సర్దారీలాల్‌ను చూసి అతడు ఆశ్చర్యపోయాడు.

"మీరా దీవాన్‌గారూ... ఈ రాత్రి సమయంలో ... ఈ అడవిలో...?" రోహిత్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నీ కోసమే నిరీక్షిస్తున్నాను"

"నా కోసమా ... నిరీక్షిస్తున్నారా!"

"అవును. చాలాసేపటినుండి నీకోసం ఎదురుచూస్తున్నాను"

"నన్ను పిలిస్తే నేనే వచ్చేవాణ్ని కదా! మీరు ఇంత రాత్రి సమయంలో శ్రమపడి ఇక్కడికి ఎందుకువచ్చారు?''

"అవసరం వచ్చిందికనుక వచ్చాను. ఈ విషయం ఇంటిదగ్గర మాట్లాడటం కుదరదు"

"చెప్పండి...ఏమిటా ముఖ్యమయిన సమస్య?"

"రశ్మి నా ఇంటి గౌరవాన్ని, నన్ను బజారుపాలుచేయాలని నిర్ణయించుకొంది"

"అంటే...నాకేమీ అర్థంకావడంలేదు" అతడు కంపిస్తున్న స్వరంతో అడిగాడు. ఆ తర్వాత దీవాన్‌గారు కళ్ళలోకి చూడ సాగాడు.

"రశ్మి వట్టి అమాయకురాలు...చిన్న పిల్ల. దానికి ఊహల్లో విహరించడం మాత్రమే తెలుసు. కాబట్టి త్వరపడి జీవితంలో ఏదయినా పొరపాటుచేసే అవకాశం వుంది"

"పొరపాటు ఎందుకు చేస్తుంది? చేయాల్సిన అవసరం ఎందుకు వచ్చింది?"

"నీ వలన ఆ అవసరం వచ్చింది!"

"నా వల్లనా! ఏమిటి మీరనేది? నాకేమీ అర్థంకావడంలేదు. మీకెవరోచాడీలు చెప్పారు బహుశా ఏటిదగ్గర సంఘటనకు చిలవలు,పలవలు కల్పించి చెప్పివుంటారు. ఆరోజు రశ్మి తన ముఖానికి అయిన హోలీ రంగు కడుక్కోవడానికి ఏటికి వెళ్ళింది. అంతకంటే వేరే కారణం ఏమీ లేదు"

"మంచిదే. కాని జీవితానికి కళంకం అంటుకొంటే అది నీళ్లతో కడిగినా పోయేది కాదు"

దీవాన్‌గారి కటువైన మాటలు విన్న రోహిత్ చేదుమందు మింగినట్లుగా అయ్యాడు. అతడు దీవాన్‌గారి మాటల అంతరార్థం గ్రహించాడు. కాని పెంకిగా మాట్లాడి వాదన పెంచడం బాగుండదని గ్రహించాడు. చాలాసేపటివరకు అతడు మౌనంగా అక్కడే నిలబడ్డాడు. అందు కని దీవాన్‌గారే అన్నారు-

"నువ్వుగనక తలచుకొంటే రశ్మిని ఏ పొరపాటు చేయకుండా తప్పించ గలవు"

"ప్రేమించడం తప్పుకాదు దీవాన్ గారూ!" భావుకత్వంతో రోహిత్ అన్నాడు.

"అది అవమానంగా పరిణామం చెందనంతవరకు తప్పుకాదు"

"ఆమెను ఎవరు అవమానిస్తున్నారు?"

"ఇంకెవరు? నువ్వే!"

"మీరు నన్ను తప్పుగా అర్థంచేసు కొన్నారు. కనుక నేను ఏమి చెప్పినా వినరు. మీరు మీ అమ్మాయికి నచ్చచెప్పు కోండి"

"ఆమె గ్రహించగలిగితే సీదాకా వచ్చి నిన్ను బతిమాలుకోవాల్సిన కర్మ ఎందుకు పడుతుంది?"

"అయితే చెప్పండి. నన్ను ఏం చేయ మంటారు?"

"రశ్మి పట్ల విరక్తిని, అసహ్యాన్ని ప్రదర్శించు"

"నేనలా చేయకపోతే?"

"దానికి తగిన ఫలితం అనుభ విస్తావు"

"ఏమిటా ఫలితం?"

"వున్న ఉద్యోగం పోగొట్టు కొంటావు"

"మీ బెదిరింపులు ప్రేమ ప్రవాహాన్ని ఆపలేవు"

"అయితే నీ ప్రేమకు బదులుగా డబ్బు ఇస్తాను. ఎంత ఇవ్వమంటావో చెప్పు" దీవాన్‌జీ విసుగ్గా అన్నారు.

"ఎంత ఇవ్వగలరు?"

"నువ్వే అడుగు. ఎంతకావాలి? పది వేలా? ఇరవై వేలా...నలభైవేలా?"

"మీ దృష్టిలో మీ కుమార్తె విలువ నలభై వేలేనా!"




"అయితే ఇంకా ఎంత కావాలి?"

"నాకు మీ ఖజానా అంతటిలోకి విలువైన వజ్రం ఒకటి మాత్రం చాలు. ఆ వజ్రమే రశ్మి. తక్కిన రాళ్లు, కాగితాలు నాకు అవసరం లేదు"

"యూ... షటప్"

దీవాన్‌గారు రోహిత్ నోట తన కుమార్తె పేరు వినగానే మండిపడ్డాడు. ఆయన కోపంతో వూగిపోతున్నాడు. అసహ్యంతో ముఖాన్ని పక్కకు తిప్పుకొన్నాడు. తర్వాత మెల్లగా నడిచి వెళ్ళి జీపులో కూర్చున్నాడు. రోహిత్‌పై ఆయన కోపం ఏమీ ప్రభావం చూపించినట్లులేదు. అతడు నిర్లక్ష్యంగా అక్కడే నిలబడి వున్నాడు. జీపు కదలి దూరంగా వెళ్ళేంతవరకు అక్కడే నిలబడి వున్నాడు. జీపు దూరం వెళ్ళి చీకట్లో కలిసిపోయిన తర్వాత కింది పెదవిని పళ్లతో నొక్కిపెట్టి ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆ తర్వాత నిర్లక్ష్య భావంతో తల విదిలించి తన ఇంటివైపు నడిచాడు.

రోహిత్ తన రూముకు చేరేసరికి రాత్రి పదిగంటలయింది. చీకటి పడటంతోనే అడవి ప్రాంతమంతా భయంకరంగా మారిపోతుంది. ఆగి ఆగి వినిపించే పక్షుల కూతలు, జంతువుల అరుపులు, కీచురాళ్ళ గింగురు శబ్దాలు గుండెల్లో గుబులును ఎక్కువ చేస్తాయి. కాని ఈ దినం హోలీ పండుగ కారణంగా పల్లె వాసులు తమ పల్లెను కళకళలాడే తిరుణాలగా మార్చివేశారు. హోలీ మంటలు ధూ...ధూ... శబ్దంతో మండుతున్నాయి. నిషాలో తూలుతున్న శ్రామికులు ఇంకా తూలుతూ, పాటలు పాడుతూ అల్లరి చేస్తున్నారు.

రోహిత్ ఇంటిముందున్న అరుగు మీద నిలబడి ఊరివైపునుండి వినిపిస్తున్న అల్లరిని కొంచెంసేపు విన్నాడు. తర్వాత తన గదిలో ప్రవేశించాడు. కిటికీలు, తలుపులు తెరిచి వున్నందున గదిలో కూడా చాలా చలిగా వుంది. అతడు కిటికీ రెక్కలు, తలుపులు మూసి టేబిల్ మీద వున్న లైటు వెలిగించాడు. గదిలో వెలుగు వ్యాపించింది.

అతడు గదంతా ఒకసారి కలయ జూశాడు. నేలవైపు చూసి బిత్తరపోయాడు. అతడు రెప్పవాల్చకుండా ఆ దృశ్యం చూస్తూ వుండిపోయాడు. తన కళ్లను తానే నమ్మలేక నాలుగైదుసార్లు రెప్పలాడించి, తివాచీపై అస్తవ్యస్తంగా పడుకొని వున్న స్త్రీని అయోమయంగా చూశాడు. బిడియపడుతూనే ఆమె దగ్గరికి వెళ్ళి పరిశీలించి చూశాడు.

ఆ స్త్రీ మరెవరో కాదు...బిజిలీ.రోహిత్ రెండు మూడు సార్లు ఆమెను పిలిచాడు. ఆమె కళ్లు తెరవకుండానే ఏమేమో మాట్లాడుతోంది.

రోహిత్ వంగి ఆమెను వెల్లకిలా తిప్పాడు. ఆమె మదిర మత్తులో తన స్థితినే పూర్తిగా మరిచిపోయింది. ఆమె జాకెట్టు సరిగా లేదు. దానిలోనుండి ఆమె బలిష్టమయిన గుండ్రని వక్షాలు బయటికి తొంగిచూస్తున్నాయి. ఆమె నోటినుండి వెలువడుతున్న సారాయి వాసన గదంతా నిండిపోయింది.

రోహిత్ కొంచెం సేపు ఏమీ పాలుపోక అక్కడే నిలబడ్డాడు. తర్వాత బిజిలీ భుజాలు పట్టుకొని గట్టిగా వూపుతూ ఆమెను లేపి నిలబెట్టాలని ప్రయత్నం చేయసాగాడు. బిజిలీ మత్తుగా కళ్లు తెరిచి చూసింది. చిన్నగా తమాషాగా నవ్వింది. తర్వాత గొణిగింది. "వెళ్ళను...నేనా

ఇంటికి వెళ్ళను బాబూ"

"బిజిలీ ... ఏమిటా పిచ్చిమాటలు. బాదల్ నీకోసం ఎదురు చూస్తుంటాడు. పద పోదాం"

"ఉహూ....వాడా దొంగ వెధవ. నాకోసం ఎదురు చూస్తాడా? చూడడు. తప్పతాగి ఎక్కడో దొర్లుతూ ఉంటాడు'' బిజిలీ ఆగి ఆగి మాట్లాడుతోంది.

"నువ్వు వెళ్ళకుంటే బాదల్ తిడతాడు. నిన్ను కొడతాడు"

''వాడిని నేను వదిలేశాను. వాడి దగ్గరికి పోనంటే పోను"

"ఏమిటి నువ్వు వాగేది?" రోహిత్ కోపగించుకున్నాడు.

"మీ ఇంటికి వెళ్లు చాలా రాత్రయింది"

"తెల్లవారిన తర్వాత పోతాను. ఇప్పుడు పోతే వాడు తిడతాడు...ఒళ్లు హూనం చేస్తాడు"

"అది సరే కానీ నువ్వు ఇక్కడేం చేస్తావు?" రోహిత్ ఆందోళన నిండిన స్వరంతో అడిగాడు.

"రాత్రంతా మీకు సేవ చేస్తాను. సరేనా!"

'ఓహ్ ... భగవాన్ ఇదెక్కడి పీడరా బాబూ!' అతడు తనలోతాను గొణుగుకొన్నాడు.

అతడు ఆమె రెండు భుజాలు గట్టిగా పట్టుకొని బలవంతంగా లేపి తివాచీ మీద నిలబెట్టాడు. బిజిలీ తొట్రుపాటుతో మరల కూర్చోనబోయింది. కాని రోహిత్ ఆసరా ఇవ్వడంతో అతన్నే గట్టిగా కరచుకొంది.ఆరోగ్యంగా, బలంగా వున్న స్త్రీ ఇలా అకస్మాత్తుగా హత్తుకోవడంతో అతని చలి పారిపోయింది. భయం వల్ల అతని శరీరం చెమటతో తడిసిపోయింది.

యవ్వనంలో వున్న ఈ మొరటు స్త్రీ ప్రవర్తనకు అతడు భయపడ్డాడు. చలిలో కూడిన ఈ ఏకాంతపు చీకటి రాత్రిలో, మదిర మత్తులో తనను తాను మరచిన పడతి ఒడిలో అతడు బందీగా వున్నాడు. రోహిత్ భయంతో కంపించి పోయాడు. ఆ స్థితిలో చాలా సేపు ఉండలేకపోయాడు. బిజిలీని పక్కకు తోశాడు. ఆమె కింద పడబోయి నిలదొక్కుకుని రోహిత్ మంచంపై పడిపోయింది.

"ఏం..బాబూ! భయపడుతున్నావా?'' నిషా మూలంగా ఎర్రగా అయిన కళ్లతో రోహిత్‌ను చూస్తూ అన్నది.

రోహిత్ మౌనంగా వుండిపోయాడు. లేనిపోని సమస్యలు పెంచుకోవడం అతనికి ఇష్టం లేదు. అతనికి ఏమి చేయాలో పాలుపోవడంలేదు. అతడు విసుగ్గా అటు ఇటు చూడసాగాడు. అంతలో ఆమె ముఖం మీద చల్లని నీళ్లు చల్లితే నిషా దిగిపోతుంది అన్న ఆలోచన వచ్చింది. అతడు వెంటనే నీళ్ల కోసం మూలనవున్న కూజా దగ్గరికి వెళ్లబోయాడు.

అంతలోనే తలుపు దభాలున తెరచుకొంది. ద్వారం మధ్య నిలబడ్డ బాదల్‌ను చూసి రోహిత్‌కు కాళ్ళకింది భూమి కుంగిపోతున్నట్లు, తాను పాతాళానికి పోతున్నట్టు అనిపించింది. అంతలోనే తేరుకొని అన్నాడు-"బాదల్...నువ్వా!"

"అవును బాబూ..బిజిలీ ఇంకా ఇంటికి రాలేదు. ఇక్కడికి వచ్చిందని తెలిసింది. దానిని ఎక్కడ దాచావు చెప్పు?'' బాదల్ రోహిత్‌వేపు అనుమానంగా చూస్తూ సీరియస్‌గా అడిగాడు.

"అదుగో...నీ ఎదుటే వుంది" రోహిత్





బెదిరిపోయినవాడిలా అక్కడినుండే మంచంవేపు చూశాడు. బిజిలీ అస్తవ్యస్తంగా, అర్ధనగ్నంగా మంచంపై పడుకొని వుంది. మామూలు పరిస్థితుల్లో ఏ స్త్రీకూడా అలా పడుకోదు. బాదల్ కోపంగా ముందు బిజిలీవేపు తర్వాత రోహిత్ వేపు చూశాడు. రోహిత్ అతికష్టం మీద తన భయాన్ని, వణకును అణచుకొని అన్నాడు–

''బిజిలీ ఎక్కువగా తాగింది. పూర్తి మైకంలో వుంది''

"అది ఇక్కడేం చేస్తుంది ఇంతసేపు?'' బాదల్ రోహిత్‌ను తీక్షణంగా చూస్తూ అన్నాడు.

''నేను వచ్చేసరికి నిషాలో వళ్లు తెలియకుండా పడివుంది"

"దాన్ని ఆ స్థితిలో చూసి మీకు కూడా నిషాలో ఒళ్ళు తెలియలేదు. అంతేనా బాబూ!" బాదల్ వ్యంగ్యంగా అన్నాడు.

"బాదల్!" కోపాన్ని ఆపుకొంటూ రోహిత్ అన్నాడు.

"అయితే కిటికీలు, తలుపులు మూసి ఆమెను స్మారకంలోకితెచ్చే ప్రయత్నం చేస్తున్నారా...భలేగావుంది మీ చికిత్స!"

"అధిక ప్రసంగం ఆపు. నీవేం మాట్లాడుతున్నావో ఆలోచించి మాట్లాడు"

"అధికప్రసంగం ఏముంది? అవమానం జరిగింది నాకు..మర్యాద మంటగలిసింది నాకు. కాని మీరు కోపపడుతున్నారా ఒక మాట చెప్పనా బాబూ!"

రోహిత్ అతనివేపు చూడసాగాడు.

బాదల్ జవాబుకోసం ఎదురుచూడకుండా అన్నాడు–

"రాత్రంతా దాన్ని ఇక్కడే వుండనివ్వండి. ఉదయం పంపండి. వూరివాళ్లు అందరూ చూసి ఇది బజారుముండ అని తెలుసుకోకముందే తెల్లవారుఝామునే పంపండి"

"నీ భార్యను గురించి ఇలా మాట్లాడటానికి నీకు సిగ్గులేదూ?"

"నా భార్యను గదిలో వుంచుకొన్న నీకు సిగ్గుండాలి బాబూ ... నాకు కాదు"

"ఏమిటి నువ్వు మాట్లాడేది బాదల్!"

"నేను వున్నమాట మాట్లాడుతున్నాను. రేపు గ్రామం అంతా అంటుంది. ఎల్లుండి వూళ్ళో నేను ముఖంపై ముసుగు వేసుకొని తిరగాలి" అతడు బిగ్గరగా అరుస్తున్నాడు. రోహిత్ బాదల్‌ను ఆపాలని ప్రయత్నించేకొద్దీ అతడు కోపంగా అరుస్తున్నాడు. అతని అరుపులు విని చాలామంది గుమిగూడారు. వాళ్ళను చూసి బాదల్ రెచ్చిపోయాడు. అతడు చటుక్కున లోపలికివెళ్ళి బిజిలీని బయటికి లాక్కొని వస్తూ తిడుతున్నాడు. గుమికూడిన వాళ్ళకు బిజిలీ సిగ్గులేనితనాన్ని గురించి పెద్దగా అరిచి చెప్పసాగాడు. అతని భార్యను రోహిత్ బలవంతంగా సారాయి తాగించి గదిలో బంధించాడనీ, ఆమెను బలాత్కరించాడనీ విన్న గ్రామస్తులకు కూడా చాలా కోపం వచ్చింది. రోహిత్ తన నిర్దోషిత్వాన్ని ఋజువుచెయ్యాలని ప్రయత్నించాడు. కాని అందరూ అతన్నే విమర్శింపసాగారు. కొంచెంసేపట్లో ఈ చిన్న విషయం తీవ్రరూపం దాల్చింది. ఒకరిద్దరు రోహిత్‌ను పట్టుకొని కొట్టాలని ప్రయత్నించారు. కాని రోహిత్ వాళ్ళను వెనక్కునెట్టి లోపలికివెళ్ళి దిండు కింద వున్న తన పిస్టల్ తీసికొని బయటికి వచ్చాడు. అక్కడ వున్నవాళ్ళంతా భయంతో వెనక్కు జరిగారు. ఒకడు ముందుకువచ్చి రోహిత్ చేతిలోని పిస్టల్ లాక్కోవాలని ప్రయత్నించాడు, కాని

రోహిత్ అవకాశం ఇవ్వలేదు. రెండు గుళ్ళు గాలిలోకి పేల్చి కోపంగా అన్నాడు –

"ఎవరయినా ముందుకు అడుగువేశారంటే కాల్చేస్తాను...జాగ్రత్త!"

అందరూ భయపడి కిందికి దిగి వెళ్లారు. కొందరు పరుగెత్తారు. బాదల్ కూడా బిజిలీని ఈడ్చుకొంటూ కిందికి వెళ్ళాడు. రోహిత్ గదిలోకి వెళ్ళి లోపల గడియవేసుకొన్నాడు. అతడు రివాల్వర్‌ను మళ్ళీ దిండు కింద పెట్టాడు. జరుగుతున్న విషయాలను గురించి ఆలోచించసాగాడు. అతడి మెదడు మొద్దుబారిపోయింది. కింద ఇంకా మనుషుల గోల వినిపిస్తోంది. అతని చూపులు దిండు కిందనుండి కొంచెం బయటికి కనిపిస్తున్న పిస్టల్ వైపు మరలాయి. అతడు గడిచిన నెలలోనే అడవి జంతువులను కాల్చడానికని పిస్టల్ కొన్నాడు. అది ఇప్పుడు ఈ అడవి మనుషులను బెదిరించడానికి ఉపయోగపడింది. అతని చేతిలో పిస్టల్ గనక లేకపోతే వాళ్ళు అతన్ని కొట్టిచంపే వాళ్ళే. అతడు లేచి కిటికీ తెరచి చూశాడు. కోపంతో ఉన్న జనం రకరకాలుగా మాట్లాడుతున్నారు. కిటికీ తెరవడంచూసి. ఎవరో ఒక రాయి విసిరారు. రోహిత్ వెంటనే కిటికీ మూశాడు. కొంచెం సేపు వరకు కిటికీ మీద రాళ్ళు పడుతూనే ఉన్నాయి. కొంచెంసేపు అయిన తర్వాత అందరూ ఇళ్లకు వెళ్ళిపోయారు.

రోహిత్ రాత్రి చాలాసేపటి వరకు రశ్మిని గురించి, తనను గురించి, ఇద్దరి స్నేహాన్ని గురించి, జరిగిన ఈ సంఘటన గురించి ఆలోచిస్తూ గడిపాడు. ఎప్పుడు నిద్ర పట్టిందో అతనికే తెలియలేదు. ఉదయం నిద్రలేచేసరికి అతనికి తల





భారంగా ఉంది. అతడు అన్యమనస్కంగానే కాలకృత్యాలు ముగించుకొని పనిలోకి వెళ్ళడానికి సిద్ధపడుతుండగా ఒక నౌకరువచ్చి పంచాయితీ ఎదుట హాజరు కావాలని చెప్పివెళ్ళాడు. దీవాన్ గారు స్వయంగా చెప్పి పంపారు. ఆయనే పంచాయితీ పెద్ద. రోహిత్ రెండు నిమిషాలపాటు ఆలోచించి రివాల్వరు తీసి జేబులో పెట్టుకొని పంచాయితీ జరుగుతున్న చోటికి వెళ్ళాడు.

పంచాయితీ కూడిన చోట దీవాన్ గారితో బాటు ఆయన కుమార్తె రశ్మి, కైలాష్ కూడా వున్నారు. రశ్మి అతనికి ఈరోజు ఒక కొత్త యువతిలా కనిపిస్తోంది. ఆమె చూపుల్లో భయం, అనుమానం, అసహ్యం లాంటి భావమేదీ కనిపించడంలేదు. దీవాన్‌గారు సైగచేయగానే రోహిత్ రాత్రి జరిగిన విషయం వివరింపసాగాడు. మధ్యలోనే అడ్డం వచ్చి కైలాష్ అన్నాడు–

"కథలు చెప్పనవసరం లేదు. అడిగిన దానికి జవాబు చెప్పు...చాలు"

"ఏమిటి మీరు అడగదలుచుకొన్నది?"

"నిన్న రాత్రి బిజిలీ నీ గదిలో వున్నదా?"

"నేను బయటినుండి గదికి వచ్చినప్పుడు...."

కైలాష్ అతన్ని పూర్తిగా చెప్పనియ్యకుండా అన్నాడు–

"అదంతా వద్దు. అవునో కాదో చెప్పు"

"వున్నది"

"ఏం చేస్తూ వున్నది?"

"సారాయి తాగిన మైకంలో తివాచీ మీద పడివుంది"

"అంతా అబద్ధం బాబూ! ఇతడే నా భార్యకు బాగా సారాయి తాగించాడు"

కైలాష్ కోపంతో అతన్ని నోరు మూసికొని వుండమని ఆదేశించాడు. రోహిత్ ఒకసారి రశ్మివైపు చూశాడు. ఆమె ముఖం క్షణక్షణానికి కాంతి విహీనం అయి పాలిపోతూవుంది.

"బిజిలీకి నువ్వే సారాయి తాగించావు అన్న విషయం నిజమేనా?"

"కాదు...పూర్తిగా అబద్ధం. నేను సారాయి ముట్టను. ఇతరులకు తాగించానన్న మాటను మీరు ఎలా నమ్ముతున్నారు?''

"బాదల్ నీ ఇంటికి వచ్చినపుడు ఇంటి తలుపులు, కిటికీలు మూసివున్నాయట. ఈ విషయం వాస్తవమేనా?"



"నిజమే... చలి ఎక్కువగా వుందని నేనే తలుపులు, కిటికీలు మూశాను''

"బాదల్ సుమారు అర్ధగంట సేపు బయటవుండి గదిలో మీ ఇద్దరూ మాట్లాడు తుండటం విన్నాడట"

"వినివుంటే మేము ఏమిమాట్లాడామో అదికూడా విని వుంటాడుకదా! మీకు చెప్పలేదా?" రోహిత్ విసుగ్గా అన్నాడు.

రోహిత్ మాటలకు అక్కడ వున్న వాళ్ళంతా నవ్వారు. బాదల్ ఏమిటో గొణుగుతున్నాడు. అతడు ఏమంటు న్నాడో ఎవరికీ వినిపించలేదు.

కైలాష్ కోపంతో అరిచి అందరినీ నోరు మూయించాడు.

"బాబూ... ఈయన నా భార్యను ప్రేమిస్తున్నాడండి" బాదల్ వెంటనే అన్నాడు.

"వీడు అబద్ధం చెప్తున్నాడు" రోహిత్ కోపం, అసహ్యం నిండిన చూపుతో వాణ్ని చూశాడు.

"అయితే నువ్వు, బిజిలీ గదిలో అంత సేపు ఏం చేశారు?" కైలాష్ మళ్ళీ బాదల్ వాదనను సమర్థిస్తూ అడిగాడు.

"ఆమెను స్మారకంలోకి తెచ్చే ప్రయత్నం చేస్తున్నాను"

"స్మారకంలోకి తేవడానికి తమరు ఏమేమి చేశారో చెప్తే వింటాము"

"నేను...నేను ఆమెను...."

"స్పష్టంగా జరిగిందేమిటో చెప్ప రాదూ! 'వ్యసనంలో, నిషాలోవున్న ఆడదాన్ని చూడగానే నా మతిపోయింది. ఆమెను బలాత్కరించాను' అని చెప్ప డానికి ఇన్ని డొంకతిరుగుడు మాట లెందుకు?"

"మిస్టర్ కైలాష్!" రోహిత్ కోపంగా అరిచాడు. వెంటనే తనను తాను సంబా ళించుకొన్నాడు. కొంచెం ఆగి అన్నాడు- "మీరు నామీద అపవాదువేసి నన్ను అవమానిస్తున్నారు"

"నువ్వు పరాయి ఆడదానిపై చెయ్యి వేసి వూరివాళ్ళందరినీ అవమానించావు"

"అవును...అవును. ఇతడు అందర్నీ అవమానించాడు. ఈరోజు ఈ పని చేశాడు. రేపు ఎవరి కూతుర్నీ, ఎవరి కోడల్ని అవమానిస్తాడో తెలియదు" అక్కడ వున్న ప్రజలు ముక్తకంఠంతో అరిచారు.

రోహిత్ పెద్దగా అరిచాడు - "అంతా అబద్ధం...పచ్చి మోసం. నామీద కుట్ర పన్నారా" అంటూ అతడు రశ్మికేసి చూశాడు.

ఆమె ఇప్పుడు బిజిలీ పక్కన నిలబడి వుంది. బిజిలీ మూలంగా పల్లె అంతా అలజడి రేగింది. బాదల్ చకచకా వెళ్ళి భార్యను లాక్కొనివచ్చి పెద్దలముందు నిలబెట్టి కోపంగా అన్నాడు - "నిజం చెప్పు. నిన్న రాత్రి ఏం జరిగిందో చెప్పు"

బిజిలీ భయంభయంగా రోహిత్‌వైపు చూసి తర్వాత నేలకేసి చూడసాగింది.

"నిన్న నువ్వు తాగావా?" కైలాష్ గదిమాడు.

"ఆ...హోలీ పండుగఅని తాగాను" బిజిలీ వంచిన తల ఎత్తకుండా అన్నది.

"నీకు ఎవరు తాగించారు?"

"వూళ్ళోవాళ్లు"

"అయితే రాత్రి నువ్వు రోహిత్ గదిలోకి ఏమి చెప్పడానికి వెళ్ళావు?"

"నే వెళ్ళలేదు బాబూ!"

"అబద్ధం చెప్పవద్దు. జాగ్రత్త"

"అబద్ధం కాదు బాబుగారూ...నిజం చెప్తున్నాను. గదిలో జరిగిన సంగతులు కొంచెం కొంచెం జ్ఞాపకం వున్నాయి"





"ఏమేమి జ్ఞాపకం వున్నాయి?"

"నేను బాగా నిషాలో వున్నపుడు ఈ బాబుగారు నన్ను భుజాలు పట్టుకొని నిలబెట్టారు..."

"అవును...నేను ఆమెను నేలమీది నుండి లేపి నిలబెట్టాను" రోహిత్ మధ్యలోనే తన నిర్దోషిత్వాన్ని వివరింప సాగాడు.

కాని కైలాష్ వారించి అతన్ని చెప్ప నివ్వలేదు. గ్రామస్తుల్లో గుసగుసలు మొదలయ్యాయి. కొంచెం సేపట్లో సద్దు మణిగింది.

"ఆతర్వాత ఏం జరిగింది?" కైలాష్ అడిగాడు.

"ఈ బాబుగారు నన్ను దగ్గరికి లాక్కొని, గట్టిగా కరుచుకోబోయారు. నేను వద్దని బతిమాలాను. కాని ఈయన వినలేదు. 'భయపడవద్దు..బాదల్ ఇక్కడికి రాడులే' అని అన్నాడు"

"అంతా కేవలం అబద్ధం" రోహిత్ బిత్తరపోయి అన్నాడు. అతని కంఠ స్వరం బొంగురుపోయింది.

"నువ్వేమీ చెప్పవద్దు...అంతా విను" కైలాష్ రోహిత్‌ను ఆపి బిజిలీ వైపు తిరిగి అడిగాడు—

"తర్వాత ఏమయింది?"

"నిషాలో వున్నాను. నేను ఏమి చేశానో, ఏమి మాట్లాడానో నాకే తెలియదు. నేను తూలి పడబోతే బాబుగారే పట్టుకొన్నారు. నేను సిగ్గుపడి బయటికి పారిపోవాలని ప్రయత్నించాను. కాని ఆయన నన్ను గట్టిగా పట్టుకొని ఆపాడు'' అంటూ ఆమె కొంచెం సేపు ఆగింది. రోహిత్ వైపు భయం భయంగా ఓత్తర చూపులు చూడసాగింది.

"అప్పుడేం జరిగింది?"

"ఇద్దరం పెనుగులాడుతున్న సమయంలో బాదల్ వచ్చాడు. నేను దొరికిపోయాను"

అంతా వింటున్న రశ్మికి బొమలు ముడివడ్డాయి. ఆమె చాలా గంభీరంగా కనిపిస్తూంది. బిజిలీ చెప్పింది విని ఆమె గిరుక్కున వెనక్కి తిరిగి పోసాగింది. రోహిత్ చకచక ఆమె ఎదుటికి వెళ్ళి నిలబడి వినయపూర్వకంగా అన్నాడు—

"రశ్మీ...ఆగు! నా మాట కాస్త విను. ఆమె చెప్పిందంతా పచ్చి అబద్ధం. నమ్మవద్దు.''

కాని రశ్మి ఆగిపోలేదు. ఆమె ఒకసారి తీక్షణంగా రోహిత్ కేసి చూసి ఏమీ జవాబివ్వకుండానే ఆ చోటు వదిలి వెళ్ళింది.

తనపై అందరూ కలిపి కుట్రపన్ని అవమానపరచినందుకు రోహిత్ పిచ్చి వాడిలా అయిపోయాడు. అసత్యాన్ని ఆవేశం సహాయంతో ఓడించాలను కొన్నాడు. వెంటనే బిజిలీ దగ్గరకు వెళ్ళాడు. బిజిలీ "బాదల్...బాదల్" అని పిలుస్తూ అతని దగ్గరకు వెళ్ళి గట్టిగా కరచుకొని రోహిత్ వైపు బెదురు బెదురుగా చూడసాగింది. రోహిత్ ఇలా బిజిలీని వెంబడిస్తుంటే బాదల్ చూస్తూ పూరక ఉండలేకపోయాడు. అతడు వెనకా ముందు ఆలోచించకుండా నడుముకు ఉన్న లావుపాటి బెల్టు తీసి దానితో రోహిత్‌ను ఒక దెబ్బ వేశాడు.

రోహిత్ చురుకుగా దెబ్బ తప్పించు కొని పక్కకు జరిగాడు. బాదల్ బెల్టును విదిలించి రెండవసారి రోహిత్‌ను కొట్టాలని ప్రయత్నించాడు. రోహిత్ తెలివిగా ఆ బెల్టును పట్టుకొని బాదల్‌ను గట్టిగా లాగాడు. బాదల్ ముందుకు

తూలి బోర్లా పడ్డాడు. అక్కడ గుమి గూడినవాళ్ళంతా కోపంతో రోహిత్‌ను పట్టుకోవాలని లేచారు.

"ఆగండి..." కైలాష్ పెద్దగా అరిచాడు. పల్లెవాసులంతా ఎక్కడివా రక్కడే ఆగిపోయారు. వాతావరణంలో నిశ్శబ్దం వ్యాపించింది. రోహిత్ చేతిలో వున్న బెల్టు కింద పడిపోయింది.

కైలాష్ ముందుకు నడిచి తన కాలు బెల్టుపై పెట్టి రోహిత్‌వైపు కోపంగా చూడసాగాడు.

"కైలాష్‌బాబూ...మీరు కూడా నన్ను తప్పుగా అర్థం చేసుకొన్నారా" రోహిత్ తీవ్రమైన కంఠస్వరంతో అడిగాడు.

కైలాష్ ఏమీ జవాబు ఇవ్వలేదు. అతని కళ్ళు కోపంతో ఎర్రబడ్డాయి. అతడు రోహిత్ వైపు అసహ్యంగా చూస్తున్నాడు. అతడు చటుక్కున వంగి కిందవున్న బెల్టు అందుకున్నాడు. రోహిత్ కొంచెం వెనక్కి జరిగాడు. అతడు కైలాష్ చేయబోయే ఘోర కార్యాన్ని వూహించాడు. ఆ చూపులే అతడు గ్రామవాసుల కళ్ళల్లో కూడా గమ నించాడు. చివరి ప్రయత్నంగా అతడు దీవాన్‌జీ వైపు చూశాడు. ఆయన పంచాయితి పెద్ద స్థానంలో విగ్రహంలా కూర్చుని వుండి తన కళ్ళముందే ఇలాంటి అక్రమం జరుగుతూంటే, ఏదో తమాషా జరుగుతున్నట్లుగా చూస్తూ వూరుకొన్నాడు. అతడు దీవాన్‌గారితో మాట్లాడబోయేటంతలో కైలాష్ చేతిలో వూగుతున్న బెల్టు ఛళ్ళున రోహిత్ వీపుపై పడింది దెబ్బతిన్న రోహిత్ దెబ్బలు తప్పించుకొని పారిపోవాలని ఒకవైపు పరుగుతీయబోయాడు కాని గ్రామస్తులు అడ్డువచ్చారు.

కైలాష్ వేట కుక్కలాగా అతనివైపు క్రూరంగా చూస్తూ వరుసగా బెల్టుతో కొట్టసాగాడు. రోహిత్ నేలమీద పడి పోయాడు. అతని కేకలు, అరుపులు జనుల మాటల్లో కలిసిపోయాయి. వాళ్ళు అరుస్తూ ఇంకా బాగా కొట్టమని కైలాష్‌ను ప్రోత్సహిస్తున్నారు.

అంతలో ఒక హెచ్చరిక విని కైలాష్ చెయ్యి ఆగిపోయింది. దీవాన్ గారు తానున్న చోటునుండి లేచి వాళ్ళ దగ్గరికి వచ్చాడు. ఆయన బాధతో మూలుగుతున్న రోహిత్‌ను చూశాడు. ఆయన దృష్టి అతని వీపుపై పడిన వాతలమీద పడింది. ఆ వాతల నుండి రక్తం కారుతోంది. బాధతో మూలుగు తూనే రోహిత్ లేచి నిలబడ్డాడు. ముందు కైలాష్ వైపు, తర్వాత దీవాన్‌గారి వైపు చూసి అన్నాడు–"ప్రాణాలు తీయకుండా ఆగిపోయారెందుకు బాబూ!"

"మాపై హత్యా నేరం రాకుండా వుండటానికి" దీవాన్‌గారు జవాబిచ్చాడు.

"బాబుగారూ! మీ చాకచక్యానికి నేను జోహార్లు అర్పిస్తున్నాను. మీరు డబ్బుతో కొనడం చేతకాక నిండుసభలో ఇలా అమానుషంగా, అన్యాయంగా హింసించారు....మంచిది'' అతడు ఆగి ఆగి అన్నాడు.

"నీ అధిక ప్రసంగం ఆపు" కైలాష్ అసహ్యంగా చూస్తూ అన్నాడు – "నీ ప్రాణాలు తీయకుండా విడిచిపెట్టాము. అందుకు సంతోషించు"

రోహిత్ చివరిసారిగా కోపం, అసహ్యం నిండిన చూపుతో కైలాష్‌ను తీవ్రంగా చూశాడు. తర్వాత లేచి చిన్నగా నడవసాగాడు.

వూరంతా మౌనంగా వున్న




సమయంలో నడిచి వెళ్తున్న రోహిత్ చెప్పుల శబ్దం బాధతో విలపిస్తున్న నిరపరాధి మూల్గుతున్న శబ్దాన్ని గుర్తుకు తెస్తున్నది.

* * *

ఇంకా తెల్లవారలేదు. ప్రకృతిని కప్పివేసిన అంధకారం ఇంకా విడిపోలేదు. రోహిత్ ప్లాట్ ఫారం మీది బెంచీపై మౌనంగా కూర్చుని రైలుకోసం ఎదురుచూస్తున్నాడు. ఈ రామ్‌నగర్ నుండి, ఇక్కడి అందమైన లోయనుండి తనను దూరంగా ... చాలా దూరంగా తీసుకొనిపోయే రైలుకోసం నిరీక్షిస్తున్నాడు. వచ్చేముందు రశ్మితో కలిసి మాట్లాడే అవకాశం దొరకలేదు. అది ఒక తీరని కోరికగా మనసును వేధిస్తూ వుండిపోయింది. మరచిపోవాలని ప్రయత్నించేకొద్దీ రశ్మి రూపం మరింత శోభాయమానంగా కళ్ల ముందు స్పష్టంగా మెదులుతూ వుంది.

సంకోచంవల్ల అతడు శాంతతో కూడా కలిసి మాట్లాడలేదు. ఆమె రశ్మి దగ్గరికి వెళ్తే తనపై వచ్చిన ఈ అపవాదు విషయం తెలుసుకొని తనను అసహ్యించు కొంటుంది అత్త,మామలకు ఈ విషయం తెలిసి తనను గురించి ఎంత నీచంగా భావిస్తారో కదా! ఒక్క క్షణంలో తన మర్యాద అంతా మంటగలిసి పోయింది.

రకరకాల ఆలోచనలతో అతని మనసు చిక్కుదారంలా అయిపోయింది. వాటినుండి తప్పించుకోవడానికి సిగరెట్టు వెలిగించి గట్టిగా దమ్ములాగి వదల సాగాడు. చటుక్కున సీటునుండి లేచి బుకింగు ఆఫీసు దగ్గరికి వెళ్ళి- "జనతా ఎక్స్‌ప్రెస్ ఎప్పుడు వస్తుంది?'' అని అడిగాడు.

బండి రెండుగంటలు లేటు అని తెలుసు కొని నిరాశపడ్డాడు. తనా చోటునుండి ఎంత త్వరగా వెళ్ళిపోవాలనుకుంటు న్నాడో పరిస్థితులు అతణ్ణి అంతగా వెనక్కు లాగుతున్నాయి.

కాలం గడపడానికి ఇంకొక సిగరెట్టు అంటించి, తన బెంచీ వైపు నడుస్తూ రెండడుగులు వేసి ఆశ్చర్యంతో తక్కున ఆగిపోయాడు. అతని దృష్టి అప్పుడే స్టేషను గేటు దాటి లోపలికి వస్తున్న రశ్మిపై పడింది.

రశ్మి కూడా రోహిత్‌ను అక్కడ చూసి చకితురాలైంది. ఇద్దరూ అపరిచితుల్లాగా ఒకర్నొకరు చూడసాగారు. రశ్మి చేతిలో వున్న బ్రీఫ్‌కేస్ ఆమె సంకల్పాన్ని వెల్లడిస్తోంది. రోహిత్ ఆమె దగ్గరికి వెళ్ళబోయి ఆగాడు. రశ్మి చిన్నగా నడిచి వచ్చి అతని ఎదుట మౌనంగా నిలబడింది. ఇద్దరి పెదాలూ ఏదో మాట్లాడాలని కది లాయి కానీ, ఒక్కరుకూడా ఏమీ మాట్లాడ లేకపోయారు. ఒకర్నొకరు తదేక దృష్టితో చూస్తూ వుండిపోయారు.

"ఎక్కడికి వెళ్తున్నారు?" రశ్మి ముందుగా పలుకరించింది.

"ఏమో....ఎక్కడికి వెళ్తానో నాకే తెలియదు"

"మీరు ఎందుకు పోతున్నారో నాకు తెలుసు. మా డాడీ, కైలాష్ కలిసి మిమ్మల్ని అన్యాయంగా అవమానించారు. చాలా ఘోరం చేశారు"

"నేను పల్లెలోని ఆడవాళ్ళను అవమానిస్తున్నాను. తప్పు చేసినవాళ్ళు శిక్ష అనుభవించక తప్పదు కదా?"

''తప్పు చేసినవాళ్ళు అనుభవించాలి. మీవంటి అమాయకులు కాదు. మీరు నిరపరాధులని నాకు బాగా తెలుసు"

"ఎలా తెలుసు?"

"నాకు మొదటినుండి ఇలాంటిదేదో జరుగుతుందని అనుమానంగా వుంది. నిన్న డాడీ, కైలాష్ మాటలవల్ల నా అనుమానం కాస్తా నిజమయ్యింది"

"ఎలా?"

"నిన్ను గ్రామస్తుల మధ్య నీచునిగా చిత్రీకరించి తమ దారికి అడ్డు తొలగించు కోవడానికి బాదల్‌కు లంచం ఇచ్చి ఈ కపట నాటకం ఆడించారు"

"నాటకం ఆడించి, నిన్ను-నన్ను వేరు చేయడంతో తమ ప్లాను నెరవేర్చు కొన్నారు"

"లేదు...పొరపాటుపడ్డారు. ఇప్పుడు నేను వాళ్ళ ఉక్కు పంజరం నుండి బయట పడాలని నిర్ణయించుకొన్నాను"

"వద్దు రశ్మీ! నువ్వు తొందరపడి ఇలాంటి నిర్ణయానికి రావద్దు. నీవు ఇల్లు దాటిన తర్వాత కైలాష్ నీ ఆస్తినంతటినీ హస్తగతం చేసుకొంటాడేమో"

"ఫరవాలేదు రోహిత్! ఈ జాగీరు కోసం నేను నా ఆశలను, ఆనందాన్ని ఎందుకు బలి చేసుకోవాలి?"

"నువ్వు జాగీరుకు అధికారిణివి. అవ సరం అయితే కోర్టు ద్వారా నీ ఆస్తి రాబట్టుకోవచ్చు"

"అందుకుగాను నేను డాడీని కోర్టుకు లాగాలి... ఆయన అన్యాయం చేశాడని చెప్పాలి. వృద్ధాప్యంలో వున్న ఆయనను కోర్టుకు లాగటంవల్ల నాకు కూడా మనశ్శాంతి వుండదు"

"కాని డబ్బు లేకుంటే జీవనం ఎలా గడుస్తుంది? ఏదో ఒక ఆధారం...సంపా దనకు ఏదైనా మార్గం వుండాలి రశ్మీ"

"మీరు నాకు ఆధారంగా వుంటారు!"

"రశ్మీ...."

"అవును రోహిత్! నీ ప్రేమే నాకు ఆధారం. దాని బలంతో నేను జీవితంలో ఎన్ని కష్టాలయినా ఎదుర్కోవడానికి సిద్ధంగా వున్నాను"

అంతలో వాళ్ళకు జీపు వస్తున్న శబ్దం వినిపించింది. అది అప్పుడే స్టేషను బయట వచ్చి ఆగింది.

రశ్మి ఉలిక్కిపడి గోడచాటున నిలబడి దూరాన కనిపిస్తున్న జీపును గమనించి చూడసాగింది.

"ఎవరూ?" రోహిత్ భయపడుతూ అడిగాడు.

"కైలాష్! పోలీసులను తీసికొని వచ్చాడు" పోలీసుల పేరు వినగానే రోహిత్ వణికిపోయాడు. కాని రశ్మి ముఖంలో భయ చిహ్నాలేవీ లేవు.

కైలాష్ ఇలాంటి హడావిడి చేస్తాడని ఆమె ముందుగానే ఊహించినట్లుంది. రశ్మి చటుక్కున రోహిత్ చేతిని పట్టు కుని పక్కనేవున్న పళ్ళ పెట్టెల చాటుకు లాక్కొని వెళ్ళింది. ఇద్దరి గుండెలూ వేగంగా కొట్టుకుంటున్నాయి. ఈ ఆపదను తప్పించుకునే ఉపాయమేదీ వాళ్ళకు వెంటనే తోచలేదు. అంతలో రశ్మి రైలు పట్టాలమీద ఆగివున్న గూడ్సు రైలుకేసి చూపింది. అప్పటికి రోహిత్‌కు కూడా భయం తగ్గింది. వాళ్లు చకచక రైలు పట్టాలు దాటి గూడ్సు పెట్టెలదగ్గరికి వెళ్ళారు. టాపులేని ఆ పెట్టెల్లో అడవి గడ్డి వుంది. రోహిత్ చెంగున పెట్టెలోనికి ఎక్కి రశ్మిని కూడా పైకి లాగాడు. కైలాష్ పోలీసులతో కలసి ప్లాట్‌ఫారం మీదకి రాకముందే ఇద్దరూ ఆ గడ్డిలో దాక్కున్నారు. అదృష్టవశాత్తు ఆ సమయంలో ప్లాట్‌ఫారంపై ఎవరూ లేక పోవడంతో వాళ్లు అక్కడవున్న సంగతి ఎవరికీ తెలియలేదు.




కైలాష్, పోలీసులు ప్లాట్‌ఫారంమీద, స్టేషన్ బయట జాగ్రత్తగా వెదికారు. రశ్మి అక్కడికి వచ్చిన సూచనలేవీ వాళ్ళకు కనిపించలేదు. గూడ్సుబండి వైపు వాళ్ళ దృష్టి పోలేదు. కొంచెం సేపటికి దీవాన్‌జీ కూడా వచ్చారు. రశ్మి కనిపించలేదని తెలిసి ఆయన ఖిన్ను లయ్యారు.

"ఇక మీరు వెళ్ళండి. పోలీసు రిపోర్టు ఇచ్చాను. వాళ్ళే వెతికి పట్టుకుంటారు" కైలాష్ దీవాన్‌గారికి ధైర్యం చెప్పాడు.

"చుట్టుపక్కల వున్న అన్ని పోలీస్ స్టేషన్లకు వాళ్ళ గుర్తులు పంపిస్తాను"

"కాని పోలీసులు ఎంతకాలం వాళ్ళ కోసం వెదుకుతారు? ఈ పిచ్చి ముదిరి రశ్మి ఆ వెధవనుగనుక సివిల్ మ్యారేజి చేసుకుంటే మన ప్రయత్నాలన్నీ మంటగలిసినట్లే"

"మీరేమీ బెంగపెట్టుకోకండి మామ గారూ! రశ్మి ఎక్కడికి పోతుంది? పోయినా నాల్గయిదు రోజుల్లో తిరిగి వస్తుంది. ఆ అమ్మాయి స్వభావం మీకు బాగా తెలుసుకదా!" మరోసారి బండికేసి చూస్తూ కైలాష్ విసుగుతో ముందుకు నడిచాడు.

రశ్మిని వెతికేపని కైలాష్‌కు అప్ప గించి దీవాన్‌గారు ఇంటికి వెళ్లారు. మూరమైపోతున్న తండ్రిని చాటునుండి చూసిన రశ్మి కళ్ళనుండి అప్రయత్నంగా కన్నీళ్ళు జలజలా రాలాయి. ఆమె తన ఉద్వేగాన్ని ఆపుకొని, బాధను బహిర్గతం కాకుండా అణచుకొంది.

కొన్ని నిమిషాలు గడిచాయి. గూడ్సు బండి కదిలిపోసాగింది. ఇద్దరూ చిన్నగా బయటికి తొంగిచూశారు. వస్తువులు, చెట్లు చిన్నగా వెనక్కి జరిగిపోతున్నాయి. కైలాష్ కదిలిపోతున్న గూడ్సురైలుకేసి నిరాశగా చూస్తూ ప్లాట్‌ఫారంపై నిలబడి వున్నాడు. క్రమంగా గూడ్సు వేగం హెచ్చింది. రోహిత్,రశ్మి ఇప్పుడు స్వేచ్ఛా వాయువులు పీల్చసాగారు. కాని గడ్డి మోపుల చాటునుండి బయటకు వచ్చే ధైర్యం చేయలేకున్నారు.

"ఏమిటి అంత దీర్ఘంగా ఆలోచిస్తు న్నావు?" రశ్మి ముఖంలో కనిపిస్తున్న వుదాసీనతను గమనించిన రోహిత అడిగాడు.

"నేను కనిపించలేదని పోలీసులు చెప్పిన తర్వాత నాన్నగారు ఏమై పోతారో?"

"కోపంతో మండిపడి మనల్ని ఇంకా తీవ్రంగా వెతికిస్తారు. ఏదో ఒకనాటికి ఆయన మనల్ని పట్టుకోవచ్చుకూడా"

"ఆ తరువాత?"

"మీ డాడీ నిన్ను ఇంటికి తీసుకొని వెళ్తారు. నిన్ను మోసంచేసి ఎత్తుకుని వెళ్ళినందుకు నాకు మూడేళ్ళ జైలు శిక్ష వేయిస్తారు"

"యూ...సిల్లీ ఫెలో! నాన్నగారు అలాంటి పని ఎప్పుడూ చేయరు"

"నీకు చట్టం సంగతులు బాగా తెలి యవు రశ్మీ!"

"బాగా తెలుసు. చట్టం మనల్ని ఏమీ చేయకుండా వుండేందుకు ఒక ఉపాయం కూడా ఆలోచించాను"

"ఏమిటది?"

"మనిద్దరం పెళ్ళి చేసుకోవడం" ఆమె నిస్సంకోచంగా, స్పష్టంగా చెప్పింది.

రోహిత్ అయోమయపరిస్థితిలో ఉండి పోయాడు. ఒక నవయువతి ఇంత నిర్భ యంగా, స్పష్టంగా తన పెళ్లి ప్రస్తావన చేస్తుందని అతడు వూహించలేదు. ఈ

మాటలు అన్న రశ్మి సిగ్గుతో తల వంచు కొంది. గడ్డిపరకను కొరుకుతూ వుండి పోయింది.

గూడ్సు పూర్తి వేగంతో ముందుకు పోతూంది. చక్రాలశబ్దం వాళ్ళ గుండెల దడదడశబ్దాన్ని వినబడకుండా చేస్తోంది. వాళ్ళు అపరిచిత గమ్యంవేపు సాగిపోతు న్నారు. అదృష్టం ఎక్కడికి తీసుకొని పోతుందో వాళ్ళకే తెలియదు. ఓసారి ఇద్దరి చూపులు కలిశాయి. భయం, బిడి యంతోపాటు ప్రేమ, అనురాగం, ఉద్వేగం వాళ్ళ దేహాల్లో వింత అనుభూతిని కలి గించాయి.

* * *

ఉన్నట్టుండి అతని కళ్ళలో పడిన కాంతికిరణం అతని కల్పనాతంతువులను తెంచివేశాయి. ఎవరో తన కళ్ళలోకి లైటు ఫోకస్ చేస్తున్నట్లు అనిపించింది. అతడు ఉత్తరపోయి అరిచాడు-"ఎవరది?"

బల్లకు రెండో వేపునవున్న భారీ మను షులు తననే ఆశ్చర్యంగా చూస్తూ వుండటం, వాళ్ల టార్చివెలుతురు తన కళ్ళ లోకి ఫోకస్ చేయటం గమనించాడు.

"క్షమించండి స్టేషన్‌మాస్టరుగారూ!" టార్చిని బల్లపై పెడుతూ ఆగంతకుల్లో ఒకడు అన్నాడు.

రోహిత్ మాట్లాడకముందే వాళ్ళలో మరో వ్యక్తి అన్నాడు-

"మీరువచ్చి చాలా సేపయింది. మీరు ఈ లోకాన్ని మరచి ఏదో తీవ్రంగా ఆలోచిస్తున్నారు"

"అదిసరే... మీరు?"

"మేము ఒక యువతిని వెదుకుతూ వచ్చాము. ఆమె ఇంట్లోనుండి పారిపోయి వచ్చింది"

"అయితే పోలీస్‌స్టేషనుకు వెళ్ళి రిపోర్టు ఇవ్వండి. ఇది రైల్వేస్టేషన్"

"మేము అక్కడినుండే వస్తున్నాము" అంటూ ఆ ఇద్దరూ తమ జేబుల్లోనుండి అయిడెంటిటీ కార్డులు తీసి చూపించారు.

రోహిత్ వాటిని చూసి చకితుడయ్యాడు. కుర్చీలో సరిగా కూర్చున్నాడు. వాళ్ళు ఇద్దరూ పోలీసు అధికారులే.

"ఓహ్! అయాం సారీ... నేను మిమ్మల్ని గుర్తించలేదు"

"ఫర్వాలేదు. మేము యూనిఫారంలో లేము కదా! నేను ఇన్‌స్పెక్టర్ తివారీని! ఈయన సిన్హాగారు" అని తన సహ చరుని చూపిస్తూ అన్నారు.

"ఆ అమ్మాయి ఈ స్టేషన్లో వుందని మీకు అనుమానం ఎలా కలిగింది?"

"ఇక్కడ వుందని కాదు... ఇక్కడికి వచ్చి రైలు ఎక్కిందని మా వూహ"

"రైల్లో ఎంతోమంది ఎక్కుతుంటారు. వాళ్ళలో ఒక అమ్మాయిని ప్రత్యేకంగా ఎలా చూస్తాము?"

"కాని ఆ అమ్మాయిలాంటివారు నూటికొక్కరు కూడా వుండరు. కొత్త ఫాషన్‌లో వున్న ఆధునిక యువతి. అందంగా వుంటుంది. అప్పుడప్పుడు సిగరెట్టు కూడా తాగుతుంది. మీరు అలాంటి అమ్మాయిని తప్పకుండా చూసి వుంటారు"

"ఓహ్! ఇప్పుడు గుర్తుకు వస్తూంది. మీరు చెప్పిన లక్షణాలున్న అమ్మాయి రాత్రి జనతా ఎక్స్‌ప్రెస్‌లో..."

"ఆర్ యూ ష్యూర్ ?" తివారీ దృఢంగా అడిగాడు.

"ఐామ్ ష్యూర్....ఆమెకు నేనే టికెట్టు ఇచ్చాను"

"ఎక్కడికి?"

"కలకత్తాకు! అహ కలకత్తాకు కాదు.





అసన్ సోల్‌కు" రోహిత్ తడబాటుతో అన్నాడు.

"వాట్ ఎ బ్యాడ్‌లక్ సిన్హా!"

"ఏమీ ఫరవాలేదు తివారీ! ఆ అమ్మాయి మనల్ని తప్పించుకొని పోలేదు" అంటూ సిన్హా లేచి నిలబడ్డాడు. తివారీ కూడా యాష్‌ట్రేలో సిగరెట్‌ను పడవేసి నిలబడ్డాడు. అతడు 'థాంక్స్' చెప్పి వెనక్కు తిరగబోతూంటే రోహిత్ అన్నాడు-

'వయసులో వున్న అమ్మాయిలు తరచూ పారిపోతూనే వుంటారు. ఎవరి నయినా ప్రేమించిందా?"

"ఊహూ! ఇది ప్రేమ వ్యవహారం

కాదు. ఆమె దొంగతనం చేసి పారిపోయింది."

"దొంగతనమా! ఏమి దొంగిలించింది?"

"ఆ అమ్మాయి అయిదు లక్షల విలువచేసే వజ్రాలు, ఆభరణాలు దొంగిలించి పారిపోయింది!"

"ఎక్కడ దొంగతనం చేసింది?"

"ఎక్కడో! మీకెందుకు?" తివారి సిన్హాను వెంటపెట్టుకుని స్టేషన్ మాస్టర్ గదినుండి బయటికి వచ్చాడు. సోనియా ఒక దొంగ అని తెలుసుకొన్న రోహిత్ కొంచెం విచారించాడు. పోలీసులకు వున్న విషయం చెబితే తాను సమస్యలలో చిక్కుకోవాల్సి వస్తుందని భయపడి అతడు అబద్ధం చెప్పాడు. ఈ అపరిచిత యువతి విషయంలో ఏమి చేయాలో తెలియని అయోమయంలో పడ్డాడు. ప్రయాణం రైల్లో ఎక్కబోతూ ఆమె గనక పట్టుబడింటే అనవసరంగా తాను కూడా చిక్కుల్లో పడాల్సి వస్తుందేమో!



7

పాట ఠక్కున ఆగిపోయింది.

ఎవరో వచ్చి తిరుగుతున్న 'టేపు' ఆపారు.

సోనియా ఉలిక్కిపడి, కళ్ళు తెరచి చూసింది.

రోహిత్ చూపులు సీరియస్‌గా 'నా పర్మిషన్ లేకుండా టేప్‌రికార్డరు ఎందుకు ఆన్ చేశావు' అన్నట్టుగా వున్నాయి.

"మీ అర్ధాంగి, మీ జీవన సహచరిణి అయిన రశ్మి...ఆమె రాసిన ఈ వాక్యం చూశారా - 'విత్ లవ్ టు రోహిత్'" సోనియా టేప్‌రికార్డరు మీద ఒక మూల రాసివున్న మాటలు చూపించింది.

సోనియా ఆ మాటలను ఎంతో ఆసక్తిగా, ప్రేమగా తన్మయురాలై అనటాన్ని రోహిత్ గమనించాడు.

"ఆమె మా వివాహ వార్షికోత్సవం రోజు దీనిని నాకు ప్రెజెంట్ చేసింది" రోహిత్ వివరించాడు.

"మీ పెళ్ళి జరిగి ఎన్ని సంవత్సరాలయింది?"

"ఒక సంవత్సరం నాలుగు నెలలు"

"మీరు కలిసి గడిపిన రోజులు చాలా హాయిగా, స్వర్గసుఖాలతో గడిచి వుంటాయని భావిస్తున్నాను...అవునా?"

"నీ ఊహ నూటికి నూరుపాళ్ళు నిజం. కాని దిష్టి పెట్టకండి" బలవంతంగా చిరునవ్వు తెచ్చిపెట్టుకొని రోహిత్ అన్నాడు.

"దిష్టి స్వంతవాళ్ళని తగులుతుంది. పరాయివాళ్ళని తగలదు"

"నీకు ఎప్పుడయినా, ఎవరివయినా దిష్టి తగిలిందా?" రోహిత్ అడిగాడు.

"ఆ... నా బాయ్‌ఫ్రెండ్ దిలీప్ నన్ను పొగడ్తలతో ఆకాశానికి ఎత్తేవాడు"

"అతడిప్పుడెక్కడ వున్నాడు?"

"అమెరికా వెళ్ళిపోయాడు"

"నిన్ను ఇక్కడ వదిలి పెట్టి వెళ్ళాడా?"

"లేదు...నేనే వదిలిపెట్టాను. అతడు పట్టి మోసగాడని తెలుసుకొన్నాను. ఒక కోటీశ్వరుని కొడుకునని నాతోచెప్పి,

ప్రేమకలాపాలు సాగించాడు. కాని తీరా నిజం బయటపడేసరికి అతను చెప్పిందంతా ఫ్రాడ్ అనీ, అతడు చాలా పేదవాడనీ తేలిపోయింది. ఆడపిల్లను ఆకర్షించడానికి అతడు గొప్ప డ్రామా వేశాడు"

"అతని మాటలుసరే. అతని ప్రేమ కూడ కపట ప్రేమేనా?" రోహిత్ ఆమె ముఖంలోకి చూస్తూ అన్నాడు.

"పోనివ్వండి. ఆ విషయాలు ఇప్పుడు జ్ఞప్తికి తెచ్చుకోవడం ఎందుకు. గతాన్ని గురించి విచారించడం నా మతం కాదు"

"కాని రేపటిని గురించి జాగ్రత్త పడటంలో నీవు చాలా తెలివైనదానివి"

"అంటే మీరు బీరువాలో దాచిన ఆభరణాలను, డబ్బును ఉద్దేశించి ఈ మాట అంటున్నారుకదూ!"

"అవును"

"వాటిపై నాకెలాంటి అధికారంలేదు''

"అయితే మరెవరికి వుంది?"

"మా అమ్మ వాటికి సర్వాధికారి"

రోహిత్ సోనియాను ఆశ్చర్యంగా చూశాడు. అతనికి ఆమె మాటలు నమ్మ శక్యంగా లేవు. తివారీ, సిన్హాల మాటలు ఇంకా అతని మనసులో మెదులు తున్నాయి.

"బహుశా నా మాటలపై మీకు నమ్మకం కుదిరినట్టు లేదు" అతని కళ్ళలో, ముఖంలో కనిపిస్తున్న సందేహాన్ని గమనించిన సోనియా అన్నది.

"నో...నో...అలాంటిదేమీ లేదు. ఇంత రాత్రివేళ, ఒంటరిగా, ఈ చిన్న స్టేషన్‌కు ఎందుకు వచ్చావా అని ఆలోచిస్తున్నాను"

"ఎలాగయినా బండి అందుకోవాలన్న పట్టుదలతో వచ్చాను"

"ఎక్కడినుండి వచ్చావు?"

"నిజం చెప్పమంటారా?"

"నీకేమీ అభ్యంతరం లేకపోతే చెప్పు"

"నేను పక్కనేవున్న అమీన్‌పూర్ రైలుస్టేషన్‌నుండి వచ్చాను"

"అక్కడ కూడా రైలు తప్పి పోయిందా?"

"లేదు. నేనే కావాలని ఎక్కలేదు"

"ఎందుకని?"

"ఇద్దరు గూండాలు నన్ను వెంబ డించారు. నేను స్టేషన్ చేరక ముందే వాళ్ళు అక్కడికి చేరి నాకోసం ఎదురు చూస్తున్నారు. ఈ సంగతి కనిపెట్టి నేను టాక్సీ తీసుకొని ఇక్కడికి వచ్చాను. గూండాల గొడవ తప్పిపోయిందను కొన్నాను, కాని రైలు మిస్ అయ్యాను''

''నువ్వు గూండాలు అని భయపడిన వాళ్ళు నిజంగా గూండాలు కాదు. వాళ్ళు సి.ఐ.డి. ఆఫీసర్లు''

''అని మీకెలా తెలుసు?"

వాళ్ళు నీ సంగతి తెలుసుకోవడానికి నాదగ్గరికి కూడా వచ్చారు''

''వాళ్ళు మీతో ఏమన్నారు?''

'''ఒక యువతి లక్షల రూపాయల విలువచేసే వజ్రాలు, ఆభరణాలు దొంగిలించి పారిపోయింది. ఆమె కోసం వచ్చాము' అన్నారు''

''మరి మీరేమన్నారు?''

"'అలాంటి అమ్మాయి ఎవరూ ఇక్కడికి రాలేదు' అని అబద్ధం చెప్పి పంపాను''

''నేను దొంగను కానని మీరెలా నమ్మారు?"

సోనియా అడిగిన ప్రశ్నకు రోహిత్ ఏమీ జవాబు చెప్పలేదు. ఆమె చూపుల్లో చూపులు కలిపి అర్థవంతంగా చూశాడు. రోహిత్ ఇలా మౌనంగా, గంభీరంగా తనను చూడటంతో అతడు తనకు చేసిన వుపకారానికి, తనపట్ల చూపుతున్న ఆదరాభిమానాలకు సోనియా ద్రవించి పోయింది. ఆమె భావోద్వేగంతో తన గాథను అతనికి చెప్పింది.

సిన్హా ఆమె సవతి అన్న. అతడు తన స్నేహితుడైన తివారీని వెంట పెట్టుకుని సోనియాను వెదకడానికి బయలుదేరాడు. ఆమె తండ్రి మరణశయ్యపై వున్నాడు. డాక్టర్లు కూడా లాభంలేదని చెప్పారు. ఈ అవకాశాన్ని చూసుకొని ఆమె సవతి తల్లి, ఆమె కొడుకు సిన్హా ఇంటి పెత్తనం హస్తగతం చేసుకొన్నారు. భర్త చని పోగానే తమకు కష్టాలు మొదలవుతాయనీ, ప్రాణాలకు కూడా ముప్పు ఏర్పడ వచ్చు ననీ సోనియా తల్లి భయపడింది. అసలు ఆమెను రెండో భార్యగా చేసుకొన్నప్పుడే ఇంటివాళ్లంతా వ్యతిరేకించారు. కనుక ముసఃలాయన చనిపోగానే ఇంట్లో అంతర్యుద్ధం మొదలవుతుందని అందరికీ తెలుసు. ఇలాంటి ఆపద రాబోతుందని ఆమె తల్లి ముందుగానే వూహించింది. భర్త మరణానంతరం తాను, తన కూతురు అనుభవించబోయే బాధలను తలపోసి భయంతో వణికిపోయేది.

అందుకే ఆమె తనవద్ద వున్న ఖరీదైన వజ్రాలను, ఆభరణాలను ముందే పుట్టింటికి తరలిస్తే మంచిదని నిర్ణయించుకొంది. ఈ ప్లానును ఆమె సవతికొడుకు సిన్హా ఎలాగో పసిగట్టాడు. అతడు వెంటనే తన స్నేహితుడైన తివారీని వెంటబెట్టుకొని రైల్వేస్టేషన్‌కు వెళ్ళి, ప్రతి కంపార్టుమెంటులో సోనియా కోసం వెదికాడు. సోనియా వాళ్లను ప్లాట్‌ఫారం బయటినుండే చూసింది. వెంటనే వెనక్కు తిరిగి టాక్సీలో దీనాపూర్ స్టేషన్‌కు వచ్చింది. కాని దురదృష్టవశాత్తు ఆమెకు ఇక్కడకూడా రైలు తప్పిపోయింది.

తన కథ అంతా చెప్పడం పూర్తయ్యే సరికి సోనియా దుఃఖం పొంగిపొర్లింది. ఆమె ఎక్కువ ఆయాసపడుతోంది. ఆమె రోహిత్ ముఖంలోని భావాలను పరిశీలించి చూడసాగింది. రోహిత్ అన్య మనస్కంగా, ఆలోచనా సముద్రంలో మునిగివున్నాడు.

బయట వేగంగా వీస్తున్న చలిగాలి రయ్‌రయ్ అని శబ్దం చేస్తూ వుంది. సోనియా నిద్రపోయింది.

రోహిత్ సోనియా దగ్గరికి వెళ్ళి ఆమె ముఖాన్ని పరిశీలనగా చూశాడు. ఆమె ముఖంలో అమాయకత్వం నిండివుంది. 'ఈ అమ్మాయి దొంగకాదు...కాలేదు' అనుకొన్నాడు. తర్వాత లైటు ఆర్పి మౌనంగా గది దాటి బయటికి వెళ్లాడు.

రోహిత్ ఆఫీసులో అడుగు పెట్టే సరికి అతని అసిస్టెంటు ద్వారక ఫోన్‌లో మాట్లాడుతున్నాడు. రోహిత్ అతనివైపు ప్రశంసాభావంతో చూశాడు.

రెండు నిమిషాలు గడిచాయి. బయటికి వెళ్ళిన ద్వారక టీస్టాలు అబ్బాయితో టీ పంపించాడు. రోహిత్ టీ తాగుతూ, అప్పుడే లోపలికి వస్తున్న ద్వారకను అడిగాడు–

"నేను బయటినుండి రాగానే టీ తాగుతాను అని ఎలా కనిపెట్టావు?"

"నాకు అపుడప్పుడు అడ్వాన్సుగా డబ్బు కావలసివస్తుందని మీరు కని పెట్టినట్లే"





అతని జవాబుకు రోహిత్ పెద్దగా నవ్వాడు. నవ్వును బలవంతం మీద ఆపుకొని అన్నాడు - "కాని ఈసారి మాత్రం నీకు అవ్వాన్సు, ఇంటికి వెళ్ళమని ఆర్డరు ఒకేసారి ఇస్తాను"

ఈ మాటలకు ద్వారక ముఖం నల్లబడింది. కాని అతడు బాధను దిగ మింగి మౌనంగా టీ తాగుతున్నాడు.

రోహిత్ చెవుల్లో ఇంకా రశ్మి పాడిన ఆ విరహ గీతమే ప్రతిధ్వనిస్తోంది. ఆ మధుర స్వరం అతని మస్తిష్కపు లోపలిపొరల్లో దాగిన జ్ఞాపకాలను మరల మనోఫలకం మీదికి తెస్తున్నాయి.

అతడు గత స్మృతుల్లో ఎంతగా మునిగి పోయాడంటే వెనుకటి ప్రణయ తీవ్రతలు, అలకలు, సంయోగ వియోగాలు, ఆనంద విషాదాలు, ఆటంకాలు, సమస్యలు, తన్మయత్వాలు... అన్నీ దృశ్యాలుగా మారి అతని మనసులో మెదలసాగాయి.

ఆనాటి సాయం సంధ్య అతనికి బాగా గుర్తుంది. ఆ దృశ్యం అతని స్మృతి పటలంపై ప్రత్యక్షమయింది. అస్తమిస్తున్న సూర్యుడు ఆకాశంపై కుంకుమ వెద జల్లాడు. రోహిత్ తన ఫ్లాటుకు వచ్చాడు. తలుపు వేసివుంది. అతడు చిన్నగా తలుపు తెరచి లోపలికి వెళ్లాడు. రశ్మి అక్కడ లేదు. కాని బాత్‌రూములో నుండి ఆమె చిన్నగా పాడుతున్న పాట అలలు అలలుగా గదిలోకి వినిపిస్తోంది. ఆ పాట దేవకన్యలు ఆకాశ మండలంలో పాడుతున్న పాటలా సమ్మోహనకరంగా వుంది. రోహిత్ మెల్లగా బాత్‌రూం దగ్గరికి వెళ్ళాడు. రశ్మిని పిలవాలనుకుని ఆగి పోయాడు. స్విచ్‌వేసి లైటు వెలిగించ బోయి వెంటనే ఏదో స్ఫురించి ఆగి పోయాడు. తాను వచ్చినట్లు తెలిసి మృదు మధురంగా వినిపిస్తున్న పాటను ఆపివేయడం అతనికి యిష్టంలేకపోయింది. చేతిలోవున్న పాకెట్టును పక్కనున్న టీపాయ్ మీద పెట్టి అతడు ఒక కుర్చీలో కూర్చున్నాడు. మంద్రస్వరంలో విని పిస్తున్న రశ్మి పాట అతనికి మనశ్శాంతిని కలిగిస్తోంది.

కొన్ని నిమిషాలు గడిచాయి. రశ్మి స్నానంచేసి గదిలోకి వచ్చింది. ఆమె పరధ్యానంగా పాడుతూ గదిలో స్విచ్ వేయబోయింది. అంతలోనే కుర్చీలో ఎవరో వున్నట్లు అనిపించి ఉలిక్కి పడింది. ఆమె శరీరం గగుర్పాటు చెందింది. వెంటనే భయంతో అరచింది.

"ఎవరు?"

ఆమె ఇంకా భయపడి కేకలు వేయక ముందే రోహిత్ లేచి లైటు వెలిగించాడు.

రోహిత్‌ను తన ఎదుట ఆకస్మాత్తుగా చూసిన ఆమె భయం మొదట సంభ్రమంగా తర్వాత సంతోషంగా మారి పోయింది. ఆమె తెచ్చిపెట్టుకొన్న కోపంతో అతన్ని చురచుర చూసింది. దడదడ కొట్టుకొంటున్న గుండెచప్పుడు, త్వరగా పీల్చి వదులుతున్న ఉచ్ఛ్వాస నిశ్వాసాలు ఆమె మనస్థితిని వ్యక్తం చేస్తున్నాయి. ఆమె ఏదో మాట్లాడాలని ప్రయత్నంచేస్తోంది. కాని మాట్లాడలేక పోతోంది. మాటలు ఆమె పెదాలు దాటి బయటికి రావడంలేదు.

భుజాలపై నల్లని పట్టుదారాల్లావున్న పొడవైన వెంట్రుకలు, నీలం రంగు నైట్ గౌను రశ్మి అందాన్ని ఇనుమ డింపజేస్తున్నాయి.

"భయపడ్డావా?" రోహిత్ ఆమె భుజంమీద చెయ్యివేసి ధైర్యం చెబుతూ



అన్నాడు.

"ఆ ... భయపడనామరి? ఇదేం తమాషా మీకు! దొంగలా ఇంట్లో దూరి చీకట్లో కూర్చున్నారు"

"అవును...దొంగలా రాబట్టే నీ పాట వినగలిగాను" రోహిత్ ఆమెకు ఇంకా దగ్గరగా జరిగి అన్నాడు.

"దొంగ.... దొంగ అని కేకలు పెట్టి వీధి వాళ్ళందరిని పిలిచివుంటే అయ్య గారికి బాగా దేహశుద్ధి జరిగివుండేది"

"ప్రేమకోసం దెబ్బలుతిన్నా ఫరవా లేదులే"

"అది సరే...ఈరోజు విశేషాలు ఏమయినా వుంటే చెప్పండి"

"నా వుద్యోగం మరో మూడు నెలలు పొడిగించబడింది"

"వెరీగుడ్! మరి జీతం?" రశ్మి అతని పై అందుకొంటూ అడిగింది.

"ఇరవై అయిదు పెంచారు. అంటే ఇకనుండి పూర్తిగా నాలుగు వందల రూపాయలు ఇస్తారు"

"ఏ...యింత పెద్ద నగరంలో, మండి పోతున్న ధరల్లో కేవలం నాలుగువందల రూపాయల జీతం.చాలా విచిత్రమైంది ఈ బొంబాయి నగరం"

"ఈ నగరంలో నేనేకాదు-నాలాంటి వేలకొలది యువకులు ఈమాత్రమైనా సంపాదన లేక రోడ్లపై పిచ్చివాళ్ళలా తిరుగుతున్నారు"

"అదలా వుండనివ్వండి...నాలుగు వందల రూపాయలతో మనం ఎలా జీవించాలి?"

"అంత నిరాశపడవద్దు రశ్మీ... జీవితం అనే యుద్ధరంగంలో మనం ఇప్పుడే ప్రవేశించాము. ధైర్యం, కార్యదీక్ష వుంటే చాలు ఆకాశాన్ని కిందికి వంచి, చుక్కలను కోసి నీ జడలో మల్లెలుగా పెట్టడం సాధ్యమే"

"సరేకాని....త్వరగా కాళ్లు ముఖం కడుక్కొని సిద్ధపడండి"

"ఎందుకంత తొందర ... ఏమిటి విశేషం?"

"పొద్దున చెప్పాను. అప్పుడే మరచి పోయారా?" రశ్మి నవ్వుతూ చిలిపిగా అతని కళ్లలోకి చూసింది.

"ఓహో...మరచేపోయాను. ఈరోజు నీ పుట్టిన రోజు కదూ!" అతని ముఖం ప్రఫుల్లమైంది.

రశ్మి అద్దం ముందు నిలబడి తల దువ్వుకొంటోంది. తన జీవితంలో ఎంతో విలువైన, సంతోషకరమైన తన జన్మ దినాన్ని గురించి ఉదయం గుర్తుచేసి నప్పటికీ, రోహిత్ మరచిపోవడం ఆమెకు నిరాశను, బాధను కలిగించింది.

రోహిత్ ఆమె వెనక నిలబడి ఆమెను, అద్దంలోని ఆమె ప్రతిబింబాన్ని మార్చి, మార్చి చూస్తున్నాడు. రెండు నిమిషాలు గడిచాయి. రోహిత్ ఆమె మృదువైన వెంటుకలను స్పృశిస్తూ అన్నాడు-

"ఎక్కడికి వెళ్లాలి?"

"ఎక్కడికీ వద్దులెండి" ఆమె స్వరంలో కోపం, నిష్ఠూరత నిండి వున్నాయి.

"కోపంలో నువ్వెంత అందంగా వున్నావో తెలుసా?"

"నాకు ఇలాంటి సినిమా డైలాగులు నచ్చవు"

"సరే, కోపంలో నీవెంత అసహ్యంగా వున్నావో అద్దంలో ఒకసారి చూసుకో" అంటూ ఆమె ముఖాన్ని రెండు చేతులతో పట్టుకొని అద్దం వైపు తిప్పాడు.




అద్దంలో ఇద్దరి ప్రతిబింబాలూ కనిపించాయి. ఇద్దరూ ఒకేసారి నవ్వారు. రోహిత్ ఆమె రెండు భుజాలను పట్టుకొని తనవైపు లాక్కున్నాడు.

రశ్మి అతని గుండెకు హత్తుకుని పోయింది.ఆమె తన్మయతతో అడిగింది–

"మీరే చెప్పండి...ఎక్కడికి వెళ్దాం?"

"ఎక్కడికయినాసరే! ఈ గదిని, ఈ నాలుగు గోడల బంధాన్ని వదిలి చిలకా గోరింకల్లా ఎక్కడికైనా ఎగిరిపోదాం. అక్కడ నీవు నీవుకాదు–నేను నేను కాదు. నీవే నేను, నేనే నువ్వు ఇద్దరం ఒకటే! ఇద్దరి శరీరాలు, భావాలు, అనుభవాలు, హృదయాలు, ఆత్మలు ఒక్కటే! అలాంటి ఏకాంత, ప్రశాంత ప్రదేశానికి వెళ్దాం"

రశ్మి గలగల నవ్వింది. అతనికి దూరంగా జరిగి అలమర దగ్గరికి వెళ్ళి తలుపు తీసి చీరల వైపు చూస్తూ రోహిత్‌ను అడిగింది–

"చెప్పండి ఏ చీర కట్టుకోమంటారు?"

"ఆ నీలం రంగు చీర కట్టుకో"

"ఊహూ...అది వద్దు" ఆమె తల అడ్డంగా తిప్పింది.

"సరే...ఆ ముదురు గ్రీన్ కలర్ చీర కట్టుకో?"

"ఊహూ...వున్నవాటిలో ఏదీ నచ్చలేదు"

"రోజ్ కలర్ చీర అయితే నీ ఒంటి రంగుకు బాగా సరిపోతుంది"

"ఇప్పుడు లేదుగా మరి. గుర్తుంచుకొని వచ్చే సంవత్సరం కట్టుకొంటాను"

"కానీ ఈ సంవత్సరమే కట్టుకోవాలని నా కోరిక'' అంటూ రోహిత్ అంత వరకూ దాచివుంచిన పాకెట్టును ఆమె ముందుంచాడు. దాంట్లో అందమైన గులాబీరంగు జారెట్ చీరచూసి రశ్మి చిన్నపిల్లలా మురిసిపోయింది. తర్వాత, రోహిత్ కళ్ళలోకి చిలిపిగా చూస్తూ నవ్వింది. "మీరు భలేవారే. ఇంతసేపూ నన్ను సస్పెన్సులో ముంచారు!"

"అవును...కావాలనే ఇలా చేశాను. చీర నచ్చిందా?"

"బాగా నచ్చింది. మీరు నా అభిరుచిని మించిన మంచి చీరను సెలెక్టు చేశారు" ఆమె చీరను, దానిపై వున్న పూలను ఆసక్తిగా చూస్తూ అన్నది.

"ఈ చీరను నువ్వు ఇష్టపడతావో లేదో అని సందేహించాను"

"సింపుల్‌గా, అందంగా వుండే ఇలాంటి బట్టలు వేసుకొంటే కలిగే తృప్తి, ఆనందం ఖరీదయిన తళుకుబెళుకుల బట్టలు వేసుకుంటే కలుగదు"

"అచ్చం సినిమా హీరోయిన్‌లా చెప్పావు ఈ డైలాగు"

"పొండి...మీకంతా హాస్యమే!" రశ్మి ప్రణయకోపం ప్రదర్శించి, చీర తీసికొని కర్టెన్ చాటుకు వెళ్ళింది.

వాళ్ళు ఆ కర్టెన్‌తో గదిలో కొంత భాగాన్ని డ్రెస్సింగ్ రూముగా మార్చివేశారు.

బొంబాయిలో వర్షాకాలం రోహిత్‌కు, రశ్మికి చాలా కొత్తగా, వింతగా, హాయిగా వుంది.

కమ్ముకొని వస్తున్న నల్లని మేఘాలు, రయ్‌రయ్‌మంటూ వేగంగా వీచే గాలులు, పొంగుతూ గర్జిస్తున్న సముద్రం, ఎగిసి పడుతున్న అలలు, అవి తీరాన్ని కబళించి వేయాలని చేస్తున్న వ్యర్థ ప్రయత్నాలు–అనీ తమాషాగా వున్నాయి. జడివాన కురుస్తుంటే బొంబాయి మహానగరం తడిసిన పిల్లి ముడుచుకొని పడుకొన్నట్లుగా

అనిపిస్తుంది.

ఆ రోజు సెలవు కావడం మూలాన ఇద్దరూ తడిసిన బొంబాయి నగరపు వింత దృశ్యాలను చూడాలని బయలు దేరారు. వర్షం కురిస్తే చటుక్కున ఎక్కడయినా దాక్కొనేవారు. వర్షం కాస్త తగ్గగానే మళ్ళీ బయలుదేరేవాళ్ళు. జుహు బీచ్ చేరేసరికి వర్షం తగ్గి మేఘాలు కూడా విడిపోయాయి. ఇద్దరూ సముద్రతీరం వెంబడి చాలా దూరం నడిచారు. వాతావరణంలోని తడి, కాళ్ళకింద అణిగి పోతూ జారిపోతున్న తడియిసుక స్పర్శ వాళ్ళకు మత్తు కలిగిస్తున్నాయి. సముద్రపు అలలు వాళ్ళ పాదాల్ని మాటి మాటికి తాకుతున్నాయి. అలా కొంత సేపు బొంబాయి మహానగరపు విసుగును, యాంత్రిక జీవితాన్ని మరచిపోయారు.

వర్షం వల్ల బీచ్‌లో ఈరోజు ప్రత్యేక కార్యక్రమం ఏదీ లేదు. అక్కడక్కడ ఒకరు లేక ఇద్దరు మాత్రం చల్లగాలిలోని విచిత్రానుభూతిని అనుభవిస్తూ కనిపిస్తున్నారు. తమను సమీపించినవాళ్ళను రశ్మి కోపంగా చూసేది. వెంటనే వాళ్ళు ఈ నవదంపతులకు దూరంగా వెళ్ళి పోయేవారు.

ఒక ఏకాంత ప్రదేశంలో వాళ్ళు ఇసుకలో కూర్చున్నారు. రోహిత్ రశ్మి ఒడిలో తలపెట్టి ఇసుకలో కాళ్లు చాచి పడుకొని ఆకాశంలో విహరించే మబ్బులను చూడసాగాడు.

"ఏమిటి చూస్తున్నారు?'' రశ్మి అతని తల వెంట్రుకల్లో వేళ్లు నిమురుతూ అన్నది.

"మనలాగా స్వేచ్ఛగా లక్ష్యం లేకుండా తిరుగుతున్న మేఘాలను చూస్తున్నాను"

"కాని నాకుమాత్రం ఈ జీవితంపట్ల విసుగు కలుగుతోంది రోహిత్?''

"ఎందుకని?"

"ఏమో..నాకే తెలియదు. కాని మనకు కూడా ఒక మంచి ఇల్లు - దాంట్లోనుండి బయటికి పోవడానికి అందమయిన కారు వుంటే బాగుండుననిపిస్తోంది''

''మనకు ఒక ఇల్లు వుందిగా...!''

"అదీ ఒక ఇల్లేనా! పైగా అది మన స్వంత ఇల్లుకాదు. మీ ఫ్రెండు బెంగుళూరు నుండి రాగానే మనం దానిని ఖాళీ చేయాలిగదా! రెండు చిన్నగదులు. ఒక రహస్యంలేదు, ఒక ప్రత్యేకత లేదు, హాయిగా వుండే వీలులేదు. ఆ ఇంట్లో వుండి వుండి బోర్ కొడుతోంది"

"అలా అనవద్దు...చిన్నదిగాని, పెద్దదిగాని అది మన ఇల్లు. దాన్ని గురించి మనం తక్కువగా భావించకూడదు" రోహిత్ గంభీరంగా అన్నాడు.

"నా వుద్దేశం అదికాదు. ఇల్లంటే నా కనుసన్నల్లో మెలిగే ఇద్దరు ముగ్గురు నౌకర్లు వుండాలి. మన ఫ్రెండ్స్ వస్తూ పోతూ ఉండాలి. సోషల్ లైఫ్‌లో వుండే హడావిడి వుండాలి. మనల్ని గురించి అందరూ గొప్పగా చెప్పుకొంటూ ఉండాలి. ఇంకా ఇంకా...." రశ్మి మాటల మధ్యలో రోహిత్‌ను చూసి అతని ముఖం వుదాసీనంగా మారిపోవడం చూసింది. వెంటనే మాట మారుస్తూ అన్నది - "అరే! మీరు వుదాసీనంగా మారిపోయారెందుకు?"

"లేదు రశ్మీ! జీవితంలో ఎన్నో కలలు కంటుంటాము ... ఎన్నో జరగాలని అభిలషిస్తుంటాము. అవన్నీ నెరవేరడం ఎంత కష్టమో కదా అని ఆలోచిస్తున్నాను. నీ ఆశలను నెరవేర్చేరోజు ఎప్పుడు వస్తుందో మరి?"







"త్వరలోనే వసుంది. జీవితం అంటే ఒకేచోట ఒకేస్థితిలో వుండిపోవడం కాదు. మనం ముందుకు సాగిపోవాలి. ఉన్నత శిఖరాలు అధిరోహించాలి. సుఖశాంతులు పొందడానికై పోరాటం జరపాలి"

"అన్నీ చేసిన తర్వాత కూడా అదృష్టం మనలను వరించకుంటే?"

"వరించకుంటే...ఫరవాలేదు. ప్రేమతో నిండిన మీ వెచ్చని ఒడిలో ఒదిగి వుంటాను" రశ్మి రోహిత్ చేతి వేళ్లను ప్రేమగా ముద్దుపెట్టుకొని, అతని కళ్ల లోకి చూసింది. ఆ చూపుల్లో దృఢ విశ్వాసం ఉంది.

ఇద్దరూ అలా చాలాసేపు మనసుల్లో రకరకాల వూహలు మెదల్తూ వుండగా, ఒకరికళ్ళలోకి ఒకరు చూస్తూండిపోయారు. రోహిత్ చూపుల్లో నిస్సహాయత వుంది. రశ్మి చూపుల్లో వుత్సాహం, సంతోషం వున్నాయి.

ఇద్దరు ఇంటికి చేరేసరికి పొద్దు గుంకింది. వర్షంలో తడిసిన ఇళ్ళు, వీధులు విద్యుద్దీపాల కాంతిలో మెరిసిపోతూ ఆకాశగంగను గుర్తుకు తెస్తున్నాయి. అంధేరి స్టేషన్ నుండి కాలినడకనే వాళ్ల ఒక వీధి చివర పెద్ద భవనంలో వున్న తమ ఫ్లాటుకు వచ్చారు.

జారుతున్న మెట్లమీద జాగ్రత్తగా నడుస్తూ వాళ్లు ముందుకు నడిచారు. దారిలో చాలాసార్లు జారి పడబోయిన రశ్మిని రోహిత్ పడకుండా పట్టుకొన్నాడు. అన్ని ఇళ్ళ తలుపులు వేసి వున్నాయి. వాళ్ళ ఫ్లాటుకు పక్కనున్న ఫ్లాటులో లైటు వెలుగుతోంది. ఆ గది కిటికీ దగ్గరకు రాగానే లోపలినుండి ఒక వ్యక్తి వాళ్ళను పిలిచి ఆపాడు. రోహిత్ పక్కకు తిరిగి చూశాడు. కిటికీలోనుండి బయటకి చూస్తూ అతడు అంటున్నాడు –

''సార్...కొంచెం ఆగండి''

రోహిత్ కిటికీ దగ్గరకి వెళ్ళాడు.

''మీరేనా రోహిత్ బాబు?'' ఆ వ్యక్తి అడిగాడు. అతడు పాంటు, బనియను మాత్రమే వేసుకొని వున్నాడు.

రోహిత్ అవునన్నట్లుగా తల వూపాడు. ఆ వ్యక్తి రశ్మివైపు దొంగచూపులు చూసి తర్వాత రోహిత్‌వైపు తిరిగి అన్నాడు –

''మీ శ్రీమతి పేరు రశ్మి కదూ?''

"ఆ...అవును. ఏమిటి విషయం?"

"వుండండి...చెప్తాను" అని వెంటనే స్టాండుకు వున్న షర్టు తీసి తొడుక్కొని తలుపు తెరచి బయటకు వచ్చాడు. బయటికి వచ్చి రోహిత్‌కు ఒక కవరు ఇస్తూ అన్నాడు–

"మీ శ్రీమతిగారికి ఈ జాబు ఇచ్చి వెళ్ళారు"

రోహిత్ ఆ యువకుని వైపు ఆశ్చర్యంగా చూశాడు. తర్వాత కవరును చూశాడు. కవరుపై రశ్మి పేరు వుంది.

"ఎవరు ఇచ్చి వెళ్ళారు?" రోహిత్ అతని వైపు ఆసక్తిగా చూస్తూ అడిగాడు.

"ఎవరో మీ కోసం వచ్చారు. ఈ వర్షంలో కూడా శ్రమ అనుకోక వచ్చి చాలా సేపు ఎదురుచూసి నిరాశతో వెళ్ళిపోయాడు"

రశ్మి భయం భయంగా రోహిత్ కేసి చూడసాగింది. రోహిత్ ఆ యువకునికి ధన్యవాదాలు చెప్పి, కవరు రశ్మికి ఇస్తూ తన ఫ్లాటువైపు నడిచాడు. అతడు తాళం తీస్తుంటే ఆ యువకుడే రెండుచేతుల్లో ఒక పళ్ళబుట్ట తీసుకొనివచ్చి పక్కన నిలబడ్డాడు. బుట్ట రోహిత్‌కు అందిస్తూ –

"ఈ పళ్ళబుట్ట కూడా మీకు ఇమ్మన్నాడు" అన్నాడు.

"ఎవరు ఇచ్చివెళ్ళింది?" రోహిత్ ఆశ్చర్యంగా అడిగాడు.

"ఆయనే .... ఈ జాబు ఇచ్చినాయన"

"ధన్యవాదాలు" రోహిత్ తలుపుతెరచి పళ్ళబుట్టను కూడా లోపలికి తీసుకొని వెళ్ళాడు. రశ్మి కవరు చేతిలో వుంచుకొని, జరుగుతున్నదంతా అయోమయంగా చూస్తూవుంది.

"నా పేరు చేతన్" ఆ వ్యక్తి తనను పరిచయంచేసుకొన్నాడు.

రోహిత్ తలుపు సగం తెరచి వాకిట్లో నిలబడి నవ్వుతూ అన్నాడు– "మా ఇద్దరి




పేర్లు మీకు ముందే తెలుసు"

"అవును... అదే... మీ అతిథి ద్వారా తెలిశాయి"

"తమాషాగాలేదూ. మనం ఆరు నెలల నుండి పొరుగున వుంటున్నాము కాని ఒకరి పేరు మరొకరికి తెలియదు"

"అవును. అదే ఈ బొంబాయి నగరపు ప్రత్యేకత" అంటూ రోహిత్ లోపలికి వెళ్ళి రశ్మినికూడా లోపలికి లాక్కొని తలుపు మూశాడు. చేతన్ అక్కడే కొంచెంసేపు నిలబడి మూసిన తలుపుల వైపు చూస్తూ వుండిపోయాడు. తర్వాత చిన్నగా నవ్వుకుని తన ఫ్లాటువైపు నడిచాడు.

రశ్మి కవరు తెరచి ఆత్రంగా చదువుతోంది. రోహిత్ పళ్ళబుట్ట ఒక మూలన పెట్టి రశ్మివైపు ప్రశ్నార్థకంగా చూస్తూ అడిగాడు- "ఎవరు రాశారు?"

"కైలాష్" రశ్మి విచార వదనంతో జవాబు చెప్పి జాబును అతనికి ఇచ్చింది.

"కైలాష్" పేరు వినగానే రోహిత్ తేలు కుట్టినవాడిలా అయిపోయాడు. నిస్సత్తువ ఆవరించినవాడిలా మెల్లగా ఆ జాబు అందుకొని బెదురుతున్న చూపులతో దానిని చదవసాగాడు. కైలాష్ ఏదో పనిమీద బొంబాయి వచ్చాడట. రెండు రోజులు తాజ్‌మహల్ హోటల్‌లో బస చేశాడట. ఉదయం వేళల్లో వీలు చూసుకొని తనను హోటల్‌లో తప్పక కలవమని జాబు రాసి ఇచ్చాడు. ఆమె కొరకు నిరీక్షిస్తుంటానని కూడా రాశాడు.

రోహిత్ జాబు చదివి రశ్మికి ఇచ్చివేశాడు. ఉదాసీనంగా వున్న రశ్మి ముఖంచూస్తే ఆమె తన ఇంటిని గురించిన జ్ఞాపకాలతో బాధపడుతోందని వ్యక్తమవుతోంది. జాబు అందుకొని ఆమె బదులు చెప్పకుండా పక్కగదిలోకి వెళ్ళి, తడిసిన వెంట్రుకలను ఆరబెట్టుకో సాగింది.

"రశ్మీ" ఆమె మనఃస్థితిని గ్రహించిన రోహిత్ దగ్గరికి వచ్చి పిలిచాడు.

"ఊ...!"

"నీవు ఒకసారి అతన్ని కలిసి మాట్లాడితే మంచిదేమో"

"వద్దు. నేను అక్కడికి వెళ్ళను. నాకు ఇష్టంలేదు"

"అలా మొండిగా మాట్లాడితే ఎలా. అతడు మీ నాన్నగారి దగ్గరినుండి ఏమయినా కబురు తెచ్చాడేమో?"

రశ్మి పక్కకు తిరిగి భర్తను చూసింది. అతడెంత వుదార హృదయంకలవాడు. కైలాష్ వలన అవమానింపబడి కూడా, అతన్ని క్షమించడానికి సిద్ధంగా వున్నాడు. ఆమె మనసు కృతజ్ఞతా భావంతో నిండిపోయింది. ఆమె మెల్లిగా రోహిత్ చేతిని తన చేతిలోనికి తీసుకొంటూ అన్నది-

"అలాగే వెళ్తాను. కాని నువ్వుకూడా నా వెంట రావాలి"

"అలాకాదు రశ్మీ... అతడు నన్ను కలవాలనుకొంటే జాబులో ఆ విషయం రాసి వుండేవాడు"

"కాని నేను...."

"కానీ గీని అనవద్దు. నా మాట విను. నీకు ఇష్టమయితే రేపు ఉదయాన్నే నా వెంటరా. ఆఫీసుకు వెళ్ళేముందు నిన్ను అక్కడ విడిచిపెట్టి వెళ్తాను"

"తెల్లవారిన తర్వాత ... అప్పుడు చూద్దాంలే" అని రశ్మి పరదా చాటుకువెళ్ళి బట్టలు మార్చుకోసాగింది.

రోహిత్ మనసును కైలాష్ చేసిన అవమానం ఇంకా కలచివేస్తూంది. కాని

తన బాధను వెల్లడిచేసి రశ్మిని దుఃఖ పెట్టటం అతనికి ఇష్టంలేదు. అందుకని ఆ బాధను తనలోనే అణచుకొన్నాడు.

మరునాడు ఉదయం రోహిత్‌తోపాటు రశ్మికూడా సిద్ధమయింది. వాళ్ళు కొంచెం ముందుగానే ఇంటినుండి బయలుదేరారు. తాజ్‌మహల్ హోటలు దగ్గరికి చేరగానే రశ్మి రోహిత్‌ను వెంట రమ్మని కోరింది. కాని రోహిత్ వెళ్ళలేదు. ఆమె మళ్ళీ బలవంతపెడితే తానామెకోసం నిరీక్షిస్తూ బయట వుంటానన్నాడు.

రశ్మి కైలాష్ రూమువైపు వెళ్ళింది. రోహిత్ వెళ్ళి హోటలులోని 'సీలాంజ్'లో కిటికీ దగ్గర కూర్చున్నాడు. కాఫీకి ఆర్డరు ఇచ్చి దూరాన కనిపిస్తున్న ఓడలవైపు చూడసాగాడు. అతని చూపులు సముద్రం వైపు వున్నాయి. కాని అతని మనసు మాత్రం రశ్మితోపాటు కైలాష్ రూముకు వెళ్ళింది.

అతని మనసులో ఎన్నో ఆలోచనలు, ఎన్నో సందేహాలు వుద్భవిస్తున్నాయి. నిరీక్షణలోని ప్రతి నిమిషం అతనికి ఒక గంటలాగా అనిపిస్తోంది. దాదాపు అరగంట గడిచిన తర్వాత రశ్మి తిరిగి వచ్చింది. రాగానే అతని ఎదుటవున్న కుర్చీలో కూర్చుంది. రోహిత్ ఆమె ముఖ కవళికలనుబట్టి జరిగినదానిని గ్రహించే ప్రయత్నం చేస్తూ వెయిటరును పిలిచాడు. రశ్మితో "నీకేం కావాలి?" అని అడిగాడు.

"కోల్డ్ కాఫీ..."

"ఎలావుంది ఈ చోటు?" రశ్మి మానసిక సంఘర్షణను తగ్గించాలని అతడు బుద్ధిపూర్వకంగానే కైలాష్‌ను గురించి ఏమీ అడగలేదు. తాను ముందు వేసిన ప్రశ్ననే మరోవిధంగా అడిగాడు -

"ఈ హోటలు, ఈ లాంజ్, ఆహ్లాదకరంగా వున్న ఈ సముద్రం..."

"నేను ఈ ప్రదేశం ఇంతకుముందే చూశాను"

"ఎప్పుడు?"

"కైలాష్ అక్కతో హనీమూన్‌కు వచ్చినప్పుడు నేను కూడా వాళ్ళ వెంట వచ్చాను"

"ఆ సంగతి నువ్వు నాకు ఈ దినం వరకు చెప్పనే లేదే!"

"ఎప్పుడో జరిగిన విషయాలను గుర్తుకు తెచ్చుకొని నేటి ఆనందాన్ని పాడుచేసుకోవడం నాకు ఇష్టంలేదు"

"జరిగిపోయినవయినా కొన్ని సంగతులు మన జీవితాలతో పెనవేసుకొని వుంటాయి. ఇంతకూ కైలాష్ ఏమంటున్నాడు?" రోహిత్ తన ఆతురతను ఎక్కువసేపు అణచివుంచలేక అడిగాడు.

"ఒక దస్తావేజు మీద నేను సంతకం చేయాలట"

"ఏమిటా దస్తావేజు?"

"నాన్నగారు నది ఒడ్డున వున్న అడవి ప్రాంతాన్ని అమ్ముతున్నారట"

"నువ్వేమన్నావు?"

"'ఆయనకు ఇష్టమయితే అమ్ముకోమను. కాని నేను మాత్రం ఎలాంటి సంతకాలు చేయను' అన్నాను"

"అతడింకా ఏమి మాట్లాడాడు?"

"నన్ను ఇంటికి రమ్మని పిలిచాడు"

"అందుకు నువ్వు ఏమన్నావు?"

"అతడు నన్ను క్షమాపణ వేడేటంత వరకు నేనా ఇంటికి గాని, ఆ వూరికి గాని రానని చెప్పాను"

"అతడేమన్నాడు?"

"మౌనం వహించాడు. నోరు విప్పి ఒక్కమాట కూడా మాట్లాడలేదు"

ఆమె జవాబు విన్న రోహిత్




మౌనంగా వుండిపోయాడు. తనపట్ల వాళ్ళ మనసుల్లో కోపం ఇంకా వుందని కైలాష్ ప్రవర్తనవల్ల అతడు వూహించాడు.

"బిల్లు ఎంత అయింది?" రోహిత్ గంభీరంగా అడిగాడు- వెయిటర్ అటు రాగానే.

"బిల్లు చెల్లించారండీ"

"ఎవరు చెల్లించారు?" రోహిత్ ఆశ్చర్యపోతూ అడిగాడు.

"నేను!" కైలాష్ కంఠస్వరం విని ఇద్దరూ ఉలిక్కిపడ్డారు. ఇద్దరూ పక్కకు తిరిగి చూశారు. కైలాష్ వాళ్ళకు అతి సమీపంలో వచ్చి నిలబడ్డాడు. భార్యాభర్తలు అతనివైపు ఆశ్చర్యంగా చూస్తూ వుండిపోయారు.

"మీరు నా అతిథులు. కాబట్టి బిల్లు నేనే ఇవ్వాలి....'' అని రశ్మివైపు చూసి అన్నాడు "రశ్మి! రోహిత్ కూడా నీవెంబడి వచ్చాడని నాకు చెప్పనేలేదే''

"నువ్వు అడిగితే కదా నేను చెప్పడానికి''

"ఓహ్...అయామ్ సారీ" కైలాష్ తన పొరపాటుకు సిగ్గుపడ్డాడు. తర్వాత జేబులోనుండి సిగరెట్ కేసు తీసి ఒక సిగరెట్టు తీసుకొని రోహిత్ వైపు చెయ్యి చాచాడు.

"నో... థాంక్స్" రోహిత్ నమ్రతగానే తిరస్కరించాడు.

"ఏం రోహిత్ .... సిగరెట్లు మానేశావా?"

"లేదు...తగ్గించాను"

"మంచిపని చేశావు. ఈ మహానగరంలో సిగరెట్లకు డబ్బు తగలెడ్తే అన్నం మానుకోవలసివస్తుంది"

"నిజం చెప్పారు. కష్టార్జితాన్ని ఎవరూ ఇలా సిగరెట్లకు తగలేయలేరు"

కైలాష్ కనుబొమ్మలు ముడిపడ్డాయి. అతడు రోహిత్‌కేసి తీక్షణంగా చూశాడు. తర్వాత రోహిత్‌ను అడిగాడు - "నీవు ప్రస్తుతం ఏమి చేస్తున్నావు?"

"ఒక ప్రయివేటు కంపెనీలో క్లర్కుగా పనిచేస్తున్నాను"

"జీతం ఎంత ఇస్తారు?"

"రెండుపూటల తినడానికి, నిశ్చింతగా వుండటానికి సరిపోయేటంత''

కైలాష్ తన కోటు జేబులోనుండి ఒక లావుపాటి కవరు బయటికి తీసి రశ్మికి అందివ్వబోయాడు. రశ్మి దానివైపు ఆశ్చర్యంగా చూస్తూ అడిగింది-

"ఏమిటిది?"

"అయిదు వేల రూపాయలు... మీ డాడీ పంపించారు. నేను రూములో నీకు ఇవ్వడం మరిచిపోయాను"

"డబ్బా...ఎందుకు పంపారు?"

"ఒక తండ్రి తాను అమితంగా ప్రేమించే కూతురుకు పంపాడు. తన గారాబు తనయ, జీవితంలోని కనీస అవసరాలకు సహితం ఇబ్బంది పడుతుందేమో అని భయపడి వుంటారు"

"థాంక్స్...నాకు దానధర్మాలు వద్దు అని చెప్పండి" ఆమె గొంతు తీవ్రంగా వుంది. ఇక 'నువ్వు వెళ్ళవచ్చు' అని చెప్పినంత కఠినంగా వుంది.

"రశ్మి! నువ్వు తీసుకోకుంటే మీ నాన్నగారు చాలా బాధపడతారు"

"ఫరవాలేదు... ఆయనకు డబ్బు వుంటే చాలు. డబ్బు ఆయన బాధలన్నింటినీ దూరం చేయగలదు" అని రశ్మి తన సీటునుండి లేచి కైలాష్‌వైపు చూడకుండానే బయటికి నడిచింది. రోహిత్ కూడా లేచి ఆమెను అనుసరించాడు.

కైలాష్ అక్కడే రాతి విగ్రహంలా నిలబడి తన చేతిలోని కవరును, గేటుదాటి పోతున్న రశ్మిని, రోహిత్‌ను మార్చి మార్చి చూస్తూ నిలబడ్డాడు.



8

రోహిత్ ఆఫీసు నుండి వస్తూనే తమ ఫ్లాటులో నుండి చిన్నగా వినిపిస్తున్న సంభాషణ విని తలుపు దగ్గరే ఆగి పోయాడు. రశ్మి గలగల నవ్వుతూ ఎవరి తోనో మాట్లాడుతోంది. అతడు ఆశ్చ ర్యంతో కొంచెంసేపు అక్కడే నిల బడ్డాడు. తర్వాత మెల్లగా తలుపు తెరచి లోపలికి వెళ్లాడు.

రశ్మి, చేతన్ తివాచీపై ఎదురెదురుగా కూర్చొని పేకాట ఆడుతున్నారు. చేతన్ తమ ఇంట్లో వుండటమేకాదు– ఎంతో పరి చయం వున్నవాడిలా రశ్మితో ఫ్రీగా మాట్లాడుతూ పేకాట ఆడటం అతనికి అమితాశ్చర్యాన్ని కలిగించింది. అయినా తన మనోభావాలను బయట పడనివ్వ కుండా రశ్మి చిరునవ్వుకు బదులుగా చిన్నగా నవ్వాడు. రశ్మి అతనికేసి ఓసారి చూసి మళ్ళీ ఆటలో లీనమైంది. చేతన్ ఓ ముక్క కింద వేయగానే ఆమె సంతో షంతో పెద్దగా అరచింది. ఆమె ఆ ముక్క అందుకొని ఆట గెలిచింది. తర్వాత రోహిత్ వైపు చూసి అన్నది–

"యూ ఆర్ వెరీ లక్కీ డియర్..."

"ఇప్పుడు గెలవగానే సరి కాదు... జూదం ఆడేవాళ్లు చివరకు చిత్తుగా ఓడి పోక తప్పదు" రోహిత్ కొంచెం తీవ్రంగా అన్నాడు.

"అలా అనవద్దు రోహిత్ బాబూ... జీవితంలో గెలుపు, ఓటమి అనేవి పక్క పక్కనే వుంటాయి" చేతన్ నవ్వుతూ అన్నాడు.

"ఏదిఏమయినా నేను మాత్రం ఎప్పుడూ గెలుస్తూనే వుంటాను. జీవితం అనే ఆట అయినా, పేకాట అయినా... నాకు రెండూ సమానమే..." రశ్మి దృఢ స్వరంతో అన్నది.

రోహిత్ భార్యతో వివాదం పెట్టుకో దలచుకోలేదు. "సరేగానీ, ఒక కప్పు టీ ఇస్తావా..." అన్నాడు.

"ఒక కప్పు కాదు...రెండు కప్పులు తయారు చేయండి" చేతన్ మరో ఆట కోసం పేకలు పంచుతూ అన్నాడు. అతడు రోహిత్‌ను కూడా ఆటలో కలవ మన్నాడు.

కాని రోహిత్ ఆడనన్నాడు. అందు కని చేతన్ తనకు, రశ్మికి మాత్రమే పేకలు పంచి, తన పేకలు రోహిత్‌కు ఇస్తూ అన్నాడు– "కొంచెంసేపు నా బదులు ఆడండి"

"మరి...మీరు?"

"నేను మీకు టీ తయారుచేసి తెస్తాను" అని వెంటనే లేచి వంట గది వైపువెళ్లాడు.

రోహిత్ అతని వైపు ఆశ్చర్యంగా చూసి, వెంటనే దృష్టిని తన చేతిలోవున్న పేకల మీదికి మరల్చాడు.

"ఈరోజు టీ ఆయనే చేశారు" రశ్మి పేకల మీది నుండి దృష్టి మరల్చి రోహిత్‌తో అన్నది.

"అతడు మన ఇంట్లో ఎలా వూడి




పడ్డాడు?"

"ఊరకనే... నాకు బోరుగా వుంటే ఆయన కూర్చోమంటే వెళ్లాను" అన్నామె ముక్కను కింద పారేస్తూ.

"పిలవకుండానే వెళ్లావా!" అతడు ముక్క అందుకొంటూ అన్నాడు.

"ఆయన కళ నన్ను ఆకర్షించింది. ఆయన ఎవరో మీకు తెలుసా?"

"ఎవరు?"

"ప్రముఖ కార్టూనిస్టు చేతన్! మనం రోజూ పత్రికల్లో కార్టూనులు చూసి మెచ్చుకొంటూనే వుంటామే... ఆ చేతన్ ఈయనే."

చేతన్ వంట గదినుండి బయటికి వస్తూనే ఒక కప్పు రోహిత్‌కు ఇచ్చి, రెండవది తన ముందుంచుకొన్నాడు.

రోహిత్, చేతన్ ఒకర్నొకరు పరీక్షగా చూసుకొన్నారు. ఇద్దరూ చిన్నగా నవ్వారు. రోహిత్ అడిగాడు— "అయితే, ఫేమస్ కార్టూనిస్టు చేతన్ మీరేనా?"

"కేవలం కార్టూనిస్టే కాదు... మంచి ఆర్టిస్టు కూడా" రశ్మి చేతన్ వైపు ప్రశంసాపూర్వకంగా చూస్తూ అన్నది.

"మిమ్మల్నిలా కలుసుకోవడం చాలా సంతోషంగా వుంది" రోహిత్ టీ తాగబోతూ అన్నాడు.

"నాకు కూడా చాలా సంతోషంగా వుంది. కళను గుర్తించి, ప్రశంసించే మంచి పొరుగువారు లభించారు" అన్నాడు చేతన్ లేస్తూ — "ఇక నేను వెళ్తాను"

"అదేమిటి? అప్పుడే...!"

"రాత్రికి ఒక పుడ్ డిజైన్ తయారు చేయాలి. అది పూర్తి కాకుంటే చాలా కష్టం" అని కప్పులో మిగిలిన టీ తాగి చేతన్ వెళ్ళిపోయాడు.

"చాలా తమాషా మనిషిలా వున్నాడు" రోహిత్ అన్నాడు.

"కార్టూనిస్టు కదా! ఆయనతో మాట్లాడుతూ వుంటే రెండు గంటల కాలం ఎలా గడిచిందో నాకే తెలియదు"

"కాని రోజూ ఇలా రమ్మీ ఆడావంటే అదో వ్యసనంగా మారిపోతుంది"

"ఊరకే కూర్చొని వుండాలంటే బోర్ కొడుతుంది. కాలం గడిపేందుకు పేకాటే మేలు. మీరేమో ఆఫీసుకు పోతారు. పని లేకుండా గోళ్లు గిల్లుకొంటూ ఇంట్లో వుండటం నాకు ఎంత కష్టంగా వుందో మీకు తెలియదు. ఆ బాధను మీరు వూహించలేరు"

"అయితే ఓ పని చెయ్యి. క్యాటరింగ్ క్లాసులో చేరి బాగా వంటలు నేర్చుకో"

"వంటలో నాకు బొత్తిగా ఆసక్తి లేదు"

"ఆసక్తి కలిగించుకొంటే అదే వస్తుంది"

"మీ తెలివితేటలకు జోహార్లు"

"పోనీ... నువ్వే చెప్పు ఏమి నేర్చుకొంటావో?"

"చెప్పమంటారా?" రశ్మి అతని షర్టు గుండీని వేళ్లతో నిమురుతూ అన్నది. "'మీ అద్భుత సౌందర్యానికి, చురుకుదనానికి తగిన పనులు కొన్నే వున్నాయి' అని చేతన్ అన్నాడు"

"కాని... అతడు నీ అందచందాలను పొగడటంలో ఏదో అర్థం వుండి వుంటుంది" రోహిత్ కనుబొమలు ముడిపడ్డాయి. సాలోచనగా ఆమె వైపు చూశాడు.

"నేను మోడలింగ్ చేస్తే మంచి సంపాదన వుంటుందట. నెలకు నాలుగైదు



ఛాన్సులు దొరికినా చాలు. ఏడెనిమిది వందలు వస్తాయట''

"నువ్వు నీ అందాన్ని వందల్లో, వేలల్లో వెలకడుతున్నావా రశ్మీ''

రోహిత్ గంభీరంగా అడిగిన ప్రశ్నకు రశ్మి బిత్తరపడి కొంచెంసేపు శిలా విగ్రహంలా అచేతనురాలైపోయింది. తర్వాత దీనంగా, మెల్లగా అన్నది–

"మీరు నన్ను తప్పుగా అర్థం చేసుకొన్నట్లుంది''

"నిన్ను కాదు...నువ్వు ఎన్నుకొన్న వృత్తిని"

"దాంట్లో ఏమి చెడు వుంది. ఈరోజుల్లో ఉన్నతకుటుంబాలకు చెందిన, విద్యావంతులయిన యువతులు సహితం మాడలింగ్ చేస్తున్నారు. వాళ్ళను ఎవరూ తప్పుగా భావించడంలేదు.

రోహిత్ మౌనంగా ఆమె వైపు చూస్తూ వుండిపోయాడు. ఆమె ఆవేశాన్ని,ఊహలను ఎలా అరికట్టాలో అతనికి అర్థం కాలేదు. తొలి పరిచయంలోనే రశ్మి మనసులో ఇలాంటి అలజడి రేపిన చేతన్‌పై కోపం వచ్చింది. వంటగదిలో నుండి కప్పుల గలగల శబ్దం వినిపిస్తోంది. రోహిత్ లేచి అక్కడికి వెళ్లాడు. రశ్మి కాఫీ కప్పులు కడుగుతోంది. అతడు ఆశ్చర్యపోతూ అన్నాడు–

"ఇదేమిటి! ఈరోజు నువ్వే కప్పులు కడుగుతున్నావు?"

"ఈరోజు పనిమనిషి సెలవు తీసుకొంది"

"అయితే అన్నం ఎవరు వండుతారు?''

"హోటలు నుండి క్యారియరు వస్తుంది. చేతన్ అన్ని ఏర్పాట్లు చేశాడు."





చేతన్ ప్రస్తావన మళ్ళీ రావడంతో రోహిత్ ముఖం కందగడ్డలా అయిపోయింది. కాని భార్య మనసును ఇంకా బాధపెట్టడం బాగుండదని కోపాన్ని అణచుకొని మౌనంగా బెడ్‌రూంవైపు నడిచాడు. మంచంపై వున్న కోటు తీసి స్టాండుకు తగిలించబోతుండగా అతని దృష్టి మంచంపై వున్న కవరుపై పడింది. దాని మీద రశ్మి పేరు, అడ్రసు వుంది. అతనికి జాబులో వున్న విషయం తెలుసుకోవాలనే కుతూహలం కలిగింది. కాని కొంచెంసేపు నిగ్రహించుకొన్నాడు. తర్వాత కవరు అందుకోబోయాడు. అంతలో రశ్మి అక్కడికి వచ్చింది.రోహిత్ దొరికిపోయిన దొంగలా వులిక్కిపడ్డాడు. రశ్మి దగ్గరికి వచ్చి ఆ జాబును బల్లమీద పెడుతూ అన్నది– "నాన్నగారు రాశారు"

"ఏమని రాశారు?"

"ఆయనకు నా మీద, నాబతుకుమీద ఎంతో జాలికలుగుతోందట. ఆయన పంపిన డబ్బు తిరస్కరించి నేను ఆయనను అవమానపరచానట"

"ఆయన నా విషయం ఏమయినా రాశారా?"

"లేదు" ఆమె సంకోచిస్తూ అన్నది.

"ఆయన తన జీవిత కాలంలో నన్ను క్షమించరేమో?"

"అలా అనవద్దు రోహిత్...నేను మా డాడీని బాగా ఎరుగుదును. ఆయన ఒకనాటికి మన నిర్దోషిత్వాన్ని తప్పక అర్థం చేసుకొంటాడు. లేకుంటే ఇంత నమ్రతగా, ప్రేమగా ఈ జాబు రాసేవారు కాదు"

"ఏమని రాశారు జాబులో?"

"ఒకసారి వూరికి వచ్చి, నన్ను చూసిపో–అని రాశారు"




"నీకు వెళ్లాలని వుంటే ఓసారి వెళ్ళిరా..." రోహిత్ గంభీరంగా అన్నాడు.

"మనసులో వెళ్లిరావాలనే వుంది... కాని వెళ్ళను" అంటూ రశ్మి ముఖాన్ని మరో వైపు తిప్పుకుంది.

"నేనేమయినా అనుకొంటాననీ, నా మనసు బాధ పడుతుందనీ నీవేమీ సంకోచించ పద్దు. పెద్దవాళ్లు పొరపాట్లు చేస్తుంటారు. అయినా వాళ్ళు పెద్దవాళ్లే. మీ నాన్నగారి ఆరోగ్యం సరిగా వుండదు...నీవు వెళ్తే ఆయన ఆరోగ్యం కాస్త కుదుటపడవచ్చు"

రశ్మి మౌనం వహించింది. ఆమె రోహిత్ కోటు, టై జాగ్రతగా మడిచి స్టాండుకు తగిలించింది.

ఆమె వెనక్కు తిరిగేసరికి ఆమె కళ్లలో నిండివున్న కన్నీటిని చూసి రోహిత్ మనసు ద్రవించిపోయింది. ఇద్దరూ కొంచెం సేపు ఒకర్నొకరు తదేకంగా చూస్తూ వుండిపోయారు. తర్వాత రశ్మి రుద్ధ కంఠంతో అన్నది. "వెళ్తాను...తప్పకుండా వెళ్తాను. ఆయన మన పేదరికాన్ని చూసి అవహేళన చేయలేని రోజున, మన స్థితి బాగు పడిన రోజున వెళ్తాను."

రశ్మి మాటలకు బదులుగా రోహిత్ ఏమీ అనలేదు. కాని ఆమె నిర్ణయం అతని మస్తిష్కంలో ఒక పజిల్ వలె అర్థం కాకుండా వుండిపోయింది. ఆర్థిక దుస్థితి, తన చుట్టూ వున్న ఆడంబర మయమైన, ఆకర్షణలతో నిండిన సమాజమూ, ఆమెను ప్రభావితం చేస్తున్నాయి.

ఈ భావన క్రమంగా రాక్షసిగా మారి తమ అనురాగమయమైన సంసారంలో, ప్రేమలో అలజడి రేపు తుందేమో అని భయపడ్డాడు. రోహిత్ మనసులో ఎన్నో భావాలు చిక్కుముడిలా పెనవేసుకునిపోయాయి.

హోటలు నుండి కారియర్ వచ్చింది. కాని తనకు ఆకలి లేదని చెప్పి రశ్మి ఏమీ తినలేదు. రోహిత్ కూడా విధిలేనట్లుగా రెండు చపాతీలు మాత్రం తిన్నాడు. అతని పరిస్థితి తీగపై నడుస్తున్నవాడిలా చాలా సున్నితంగా వుంది. తాను ఏమాత్రం పొరపాటు చేసినా అది పెద్ద ప్రమాదంగా మారి తమ దాంపత్యాన్ని కలతలపాలు చేస్తుందని భయపడు తున్నాడు. చికాకును దూరం చేసే ప్రయత్నంగా సినిమాకు వెళ్దాం అన్నాడు. కాని రశ్మి తనకు తలనొప్పిగా వుందని చెప్పింది.

ఆకాశం మేఘావృతమై వుంది. వాతావరణం చల్లగా వుంది. చీకటి కమ్మింది. రశ్మి ఎనిమిదిన్నర గంటలకే మంచంపై పడుకొంది. తలనొప్పి మాత్రలు తెస్తానని రోహిత్ బయటకి వెళ్లబోయాడు కాని రశ్మి వారించింది. ఆమె వుదాసీనత, మౌనం రోహిత్ మనసును మరింతగా బాధపెడు తున్నాయి. నిస్సహాయంగా మథన పడసాగాడు.

రోహిత్ గదిలో లైటు ఆర్పి టేబుల్ లైటు వెలిగించి వార్తాపత్రిక చదవ సాగాడు. అయినా మాటిమాటికి రశ్మి వైపు చూస్తున్నాడు. ఆమె అటువైపు తిరిగి పడుకొని వుంది. కళ్ళు మూసు కొని వున్నా నిద్ర పోవడంలేదని ఆమె ఉచ్ఛ్వాసనిశ్వాసాల వల్ల తెలిసిపోతోంది. ఆమె కళ్ళు మూసుకొని భవిష్యత్తును గురించిన కలలు కంటోంది.

వున్నట్టుండి మేఘాలు గర్జించాయి. పెనుగాలి వీచింది. ఆ గాలికి కిటికీ రెక్కలు, తలుపులు టపటప కొట్టుకొన్నాయి. మెరుపు మెరిసింది. రశ్మి భయంతో గడ గడ వణికింది. రోహిత్ రశ్మి వైపు, అందమైన శిల్పంలాంటి ఆమె శరీరపు వంపు సొంపులవైపే చూస్తున్నాడు. ఆమె తెల్లని, సుకుమారమైన పాదాలు అంద మైన పావురాల జంటలా కనిపిస్తున్నాయి. అందమైన ఆ శరీరం అతన్ని అమితంగా ఆకర్షిస్తోంది. కాని....మనసులోని చికాకు ఆ వుద్రేకాన్ని అణచివేస్తోంది.

రోహిత్‌కు నిద్ర పట్టడంలేదు. గదిలో చీకటి నిండుకొంది. ఆకాశంలోని మెరుపు లకు గదిలో ఆగిఆగి వెలుగు వ్యాపిస్తోంది. రోహిత్ కూడా మంచంపై పడు




కొన్నాడు. గదిలో వ్యాపించి వున్న మౌనంలో రెండు హృదయాలు పరస్పరం దగ్గర కావాలని తపిస్తున్నాయి. కాని, ఇద్దరిలో ఎవరూ చొరవ తీసుకోలేదు. అలా అరగంట సేపు గడచింది. తర్వాత రోహిత్ చటుక్కున పొర్లి రశ్మి వైపు తిరిగాడు.

కిటికీ బయట ఉద్రేకంలో వున్న మేఘాలు మెరుపు తీగను ఆలింగనం చేసుకోవాలని ఆరాటపడటం చూసిన రోహిత్ ఒళ్లు పులకరించింది. అతని చేతులు రశ్మి సుకుమార దేహాన్ని ప్రేమగా నిమరసాగాయి. తర్వాత మెల్లగా పలకరించాడు-"రశ్మీ..."

రశ్మి కదలలేదు, మెదలలేదు. ఏమీ బదులు పలకలేదు. రోహిత్ కొంచెం సేపు మౌనంగా రశ్మి ఉచ్వాస నిశ్వాసాల సవ్వడి విన్నాడు. తర్వాత రశ్మిని మళ్లీ ప్రేమగా తాకుతూ పిలిచాడు -

"నిద్ర రావడం లేదా?"

"ఊఁ..." ఆమె చిన్నగా జవాబు ఇచ్చింది.

"నాకు కూడా నిద్ర పట్టడం లేదు"

"ఎందుకని? నాకయితే తలనొప్పిగా వుండి నిద్ర పట్టలేదు"

"నన్ను కూడా ఏదో కనిపించని వేదన బాధపెడుతోంది" అని రోహిత్ ఓ నిమిషం ఆగాడు. తర్వాత మెల్లగా అన్నాడు- "నేను చేసిన పని మంచిది కాదేమో అని నాలో నేను అప్పుడప్పుడు మధనపడుతుంటాను"

"ఏమిటా పని?"

"హాయిగా తిరుగుతూ, స్వేచ్ఛగా ఎగురుతూ వుండే కోయిలను తెచ్చి పంజరంలో బంధించాను"

"ఇందులో మీ తప్పేం వుంది? నేనే బుద్ధిపూర్వకంగా వచ్చి ఈ పంజరంలో కూర్చున్నాను"

"అయితే ఓ పని చెయ్యి"

"ఏమిటది?"

"ఈ పంజరపు కడ్డీలను పటాపంచలు చేసి, ఈ బంధాలు తెంచుకొని పారిపో"

"ఎందుకు వెళ్లాలి?" ఆమె ఆశ్చర్యపోతూ వెల్లకిలా తిరిగి పడుకొంది.

బయట పెద్ద మెరుపు మెరిసింది. ఆ వెలుగులో ఇద్దరి చూపులు కలిశాయి. రశ్మి కంపిస్తున్న స్వరంతో మళ్ళీ అడిగింది- "మీరెందుకు ఇలాంటి మాట అన్నారు?"

రోహిత్ సమాధానం ఇవ్వలేకపోయాడు. అతనికి రశ్మి బాధ, మేఘాల మధ్య బందీగా వుండి మండిపోతున్న మెరుపుతీగ బాధ ఒకటిగా కనిపించాయి. రశ్మి మళ్లీ అటువేపు తిరిగి పడుకొంది. బయట సన్నగా జల్లుపడుతోంది. ఆ జల్లు మేఘాలు గుసగుసలాడుకొంటున్న శబ్దంలా వింతగా వుంది. కొంచెం సేపటికి వర్షపు జోరు హెచ్చింది. గదిలో భయంకరమయిన నిశ్శబ్దం నిండిపోయింది.

* * *

బాంకు పని పూర్తిచేసుకొని రోహిత్ ఆఫీసుకు తిరిగి వచ్చాడు. ఆఫీసు ముందు రాధ నిలబడి వుంది. ఆమె మోడల్ పనికి ప్రయత్నిస్తోంది.

రోహిత్ మాట్లాడుతూ వుండగానే ఓ నౌకరు వచ్చి రాధతో అన్నాడు-

"సేఠ్‌గారు మిమ్మల్ని పిలుస్తున్నారు"

రాధ దుస్తులు సవరించుకొంది. పర్సులో నుండి చిన్న అద్దం తీసి దానిలో ముఖం చూసుకొంది...లిప్‌స్టిక్ సరిచేసుకొని, వయ్యారంగా నడుస్తూ లోపలికి

వెళ్ళింది. రోహిత్ చెయ్యి వూపుతూ "విష్‌యూ గుడ్ లక్" అని తన సీటు దగ్గరికి వెళ్లాడు.

అతని కళ్ళు ఫైలును చూస్తున్నా మనసులో మాత్రం రాధ రూపమే మెదులు తోంది. అతనికి తన కళ్ల ముందుగా రశ్మి నడిచి సేఠ్‌జీ గదిలోకి వెళ్ళి నట్లు అనిపించింది. తన భార్య నిజంగానే ఎంతో అదృష్టవంతురాలు... ఆమె మొదటి ఇంటర్వ్యూలోనే సెలెక్టు అయింది. చేతన్ సిఫారసుతో ఆమెకు చాలా ఛాన్సులు కూడా దొరుకుతాయి. ఆమె ఒక మంచి మోడల్ గర్ల్‌గా పేరు ప్రఖ్యాతులు పొందుతుంది.

రశ్మిని గురించిన ఆలోచనలు రాగానే ఉదయం ఆఫీసుకు రాబోయేముందు రశ్మి చేయించిన ప్రమాణం గుర్తుకు వచ్చింది. సాయంత్రం ఇంగ్లీషు సినిమా చూడాలి. తర్వాత హోటలులో డిన్నర్... ఈ సంగతి గుర్తురాగానే అతడు అటెం డరును పిలిచి, డబ్బులిచ్చి స్టెర్లింగ్ థియే టరుకు వెళ్ళి మూడు టిక్కెట్లు తెమ్మని చెప్పి పంపాడు. డిన్నర్ చేతన్ ఇప్పిం చాలనీ, సినిమా రోహిత్ చూపించాలనీ ముందే అనుకొన్నారు. చేతన్ ఇప్పుడు ఒక పొరుగువానిలాకాక ఇంట్లో వ్యక్తిలా, ఆప్తునిలా మెలుగుతున్నాడు.

కొంచెంసేపయిన తర్వాత రాధ చిరునవ్వుతో బయటికి వచ్చింది.

రోహిత్ ఆమె దగ్గరికి వెళ్ళి అడి గాడు–"ఏమయింది మీ ఇంటర్వ్యూ?"

"ఒక వారం తర్వాత పిలిపిస్తా మన్నారు" అని రాధ బయటికి వెళ్ళింది.

అతడామెను ఇంకేమో అడగాలను కుంటుండగా సేఠ్‌గారి నుండి పిలుపు రావడంతో ఆయన గదికి వెళ్లాడు.

సేఠ్ మురారీలాల్ పక్కనేవున్న టేబిల్ సొరుగు తెరచి కొన్ని ఫొటోలు బయటికి తీశాడు. వాటిని వరుసగా బల్లపై పేర్చాడు. వాటిని రోహిత్ అలాగే బిత్తరపోయి చూస్తూ వుండి పోయాడు. అవన్నీ వివిధ భంగిమల్లో వున్న రశ్మి ఫొటోలు.

అతడు వణకుతున్న చేతులతో ఒక్కొక్క ఫొటోను తీసుకొని చూడ సాగాడు.

"ఈ మెరుపు తీగను చూసి నీ కళ్ళు జిగేలుమన్నాయా లేదా? పర్‌ఫెక్ట్ బ్యూటీ అంటే...అద్భుత సౌందర్యం అంటే, ఇలా వుండాలి''

"యస్ సర్" అతని మనసులో ఉవ్వెత్తున లేచిన భావతరంగాలు పెదాలు దాటి మాటలై బయటకి రాలేక పోయాయి.

అతడు వెంటనేతనను తాను సంబాళించు కొన్నాడు. ఆ అతిలోక సౌందర్యవతి తన భార్య అని బాస్‌కు తెలియనివ్వ కుండా జాగ్రతపడ్డాడు.

''మన ప్రొడక్టును ప్రచారం చేయ డానికి ఈ అమ్మాయిలాంటి అందగత్తె దొరకడమే మహాభాగ్యం. ప్రపంచంలో మన కంపెనీ పేరు మారుమోగుతుంది"

"ఈ ఫొటోలు మీకు ఎవరు ఇచ్చారు?''

"నేషనల్ పబ్లిసిటీ బ్యూరో వాళ్లు పంపారు. ఎలావుంది నా సెలక్షన్?"

"నేను మీ సెలక్షన్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను''

"అయితే వెంటనే ఓ పనిచెయ్యి" సేఠ్ మురారీలాల్ ఫొటోలతో పాటు వచ్చిన జాబును రోహిత్‌కు ఇస్తూ అన్నాడు–"ఫొటోలోనిఅమ్మాయి మాకు





చాలా నచ్చిందనీ, ఆమెతో ప్రకటనలు ఇప్పించడానికి చాలా ఇంటరెస్టుగా వున్నామనీ ఈరోజే బ్యూరోకు జాబు రాయి"

"అలాగే సర్!"

"అంటే, నా వుద్దేశం అర్థమయిందా! మనం ఇకముందు చేయబోయే పబ్లిసిటీ అంతటికీ ఈ అమ్మాయినే మోడల్‌గా ఇవ్వాలనుకొంటున్నాను"

"ఓకే సర్!" రోహిత్ బయటికి వెళ్ళబోయాడు.

"మరో విషయం!" రోహిత్ ఆగాడు. "ఆమె కేవలం మనకి మాత్రమే అడ్వర్టయిజ్‌మెంట్స్ ఇవ్వడానికి సుముఖంగా వుంటే అందుకు ఆవసరం అయిన విషయాలు చర్చించడానికి రమ్మనీ ఉత్తరం రాయి"

రోహిత్ తన సీటుకు వచ్చి నేషనల్ పబ్లిసిటీ బ్యూరోవాళ్లు రాసిన జాబు చదువసాగాడు. అతడు చాలా విచిత్రమయిన పరిస్థితిలో వుండిపోయాడు.

అతడు ఆఫీసునుండి వచ్చేసరికి రశ్మి ఇంట్లో లేదు. రోహిత్ చాలా నిరాశపడ్డాడు. అతని మనసును వుదాసీనత, కారణం తెలియని బాధ ఆవరించాయి. గదిని నాలుగు వైపులా పరిశీలించి చూసాడు. ఇల్లు ఇప్పుడు కొత్త అందాలతో కొత్త ఫర్నిచరుతో చాలా అందంగా, ఆకర్షణీయంగా వుంది. గదిలో కొత్త డ్రస్సింగ్ టేబిలు, దానిమీద మేకప్ సామాగ్రి. అలమరలో అయిదారు ఖరీదైన చీరెలు. వాటితోపాటు రశ్మి తన ఆదాయంతో రోహిత్‌కు కొని తెచ్చిన ఒక మంచి సూటు వున్నాయి. ఇంత అందమయిన అలంకరణ, ఖరీదైన వస్తువులు చుట్టూవున్నా రశ్మి లేని ఆ ఇల్లు బాగా అలంకరించబడిన సమాధిలా వుందతనికి.

అద్దంలో తన ప్రతిబింబం చూసుకొన్నాడు. విచారంగా వున్న ముఖం, చెదరిన తల వెంట్రుకలు, అలసినట్లున్న కళ్లు...ఎక్కువసేపు ఒంటరిగా గదిలో వుండలేక బయటికి వెళ్లబోయాడు. అంతలో కాలింగ్ బెల్ మోగింది. బహుశా రశ్మి వచ్చి వుంటుందని అతడు తలుపు దగ్గరికి నడిచాడు. కాని తలుపు తెరచి చూసి సిగ్గుపడ్డాడు. బయట చేతన్ నౌకరు తాళం చెవులు పట్టుకొని నిలబడి వున్నాడు. రశ్మి అతనికి ఆ తాళంచెవి ఇచ్చి వెళ్ళింది.

"రామూ.... అమ్మగారు ఎక్కడికి వెళ్ళారు?''

రోహిత్ తాళం చెవి తీసుకొంటూ అడిగాడు.

"చేతన్ బాబుతో కలిసి ఎక్కడికో వెళ్లారు. ఏడుగంటలకు వస్తామని చెప్పమన్నారు"

"వాళ్లు ఎన్నిగంటలకు వెళ్లారు?"

"మధ్యాహ్నం రెండు గంటలకు"

రోహిత్‌కు తనను ఎవరో లావుపాటి కర్రతో తలపై కొట్టినట్లు, ఆ దెబ్బకు తలంతా మొద్దుబారిపోయినట్లు అనిపించింది. శక్తి లేనివాడిలా తలుపు పక్కనేవున్న కుర్చీలో కూలబడిపోయాడు. రశ్మి తన కొత్త ఉద్యోగంలో ఎంతగా లీనమైపోయిందంటే - ఆమెకు రోహిత్ విషయాలు చూసి, అతనితో మాట్లాడే తీరిక కూడా దొరకడంలేదు.

రోహిత్ చాలా ఒంటరితనం ఫీలయ్యాడు. జేబులోని మూడు సినిమా టికెట్లను బయటికి తీసి వేళ్ళతో కసిగా నలుపుతున్నాడు.

మూడుటిక్కెట్లు...ముగ్గురువ్యక్తులు.. రశ్మి, చేతన్, రోహిత్...చాలా విచిత్రమయిన త్రిమూర్తులు. రూపాలు వేరు; ఆలోచనలు వేరు; దృష్టికోణాలు వేరు... అయినా కలిసి ఉంటున్నారు. అతనికి ఉన్నట్టుండి తన బాస్ అన్న మాటలు గుర్తుకు వచ్చాయి– "పర్ఫెక్ట్ బ్యూటీ అంటే ఇదే. ఈమెను పూర్తిగా మన ప్రకటనలకే వినియోగించుకొనే వీలుంటుందేమో రాసి కనుక్కో"

ఉఫ్! తనతోనే తన భార్యను గురించి ఇలాంటి వర్ణనలు, వ్యాఖ్యానాలు.

రోహిత్ ముఖంలో అయిష్టతను ప్రస్ఫుటింపజేసే వింత నవ్వు కనిపించింది తర్వాత ఏమనుకొన్నాడో గాని ఆ టికెట్లను ముక్కలుగా చించి కిటికీలోనుండి బయట పారవేశాడు. కిటికీ దగ్గర నిలబడి చిందరవందరగా గాలిలో తేలుతున్న కాగితపు ముక్కలను చూస్తూండగా అతని దృష్టి వీధి చివర్న ఆగిన ఒక టాక్సీపై పడింది.

రశ్మి, చేతన్ టాక్సీలో నుండి దిగుతున్నారు. చేతన్ డిక్కీలో వున్న రశ్మి బ్యాగు అందుకొన్నాడు. రశ్మి చేతిలో అతని కెమేరా ఉంది.

రోహిత్ చటుక్కున కిటికీ రెక్క మూసి వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. నెక్ పై వదులు చేసి దగ్గరేవున్న ట్రాన్సిస్టరును ఆన్ చేశాడు. తాను మదిలో విసుగుపడుతూ కూర్చున్నట్లు రశ్మి భావించకుండా అతడాపని చేశాడు.

తలుపు తెరచుకొని ఇద్దరూ లోపలికి వచ్చారు. రోహిత్ అలాగే రేడియోలో వినిపిస్తున్న మ్యూజిక్ వింటున్నాడు. భర్తను చూసి ఓ క్షణంపాటు సిగ్గుపడింది. కాని వెంటనే ముఖంపై చిరునవ్వు పులుముకొని దగ్గరికి వచ్చింది.

"హల్లో....డార్లింగ్! నువ్వు వచ్చి ఎంత సేపయింది?"

"కొంచెంసేపయింది" రోహిత్ జవాబు చెప్తూ రేడియో ఆఫ్ చేశాడు.

"నేను చెప్పిన విషయం రాము నీతో చెప్పాడా?"

"ఊ..." రోహిత్ ఓరగా చేతన్ వైపు చూశాడు. అతడు చేతిలో రశ్మి బ్యాగు పట్టుకొని వున్నాడు.

"మీరింకా బట్టలు కూడా మార్చుకోలేదే!"

"అంతతొందర ఏమొచ్చింది?"

"పిక్చరు ఎన్ని గంటలకు మొదలవుతుంది?"

"పది గంటలకు" రోహిత్‌కు బదులు చేతన్ సమాధానం ఇచ్చాడు.

"కాని ఈరోజు సినిమాకు వెళ్లేము" రోహిత్ చిన్నగా అన్నాడు.

"ఎందుకని?"

"హౌస్‌ఫుల్ అయింది. టికెట్లు దొరకలేదు"

"అయితే మరీ మంచిది. ఈరోజు నాకు మూడ్ బాగాలేదు"

"ఏం...ఎందుకు బాగాలేదు?" రోహిత్ భార్యవైపు ప్రశ్నార్థకంగా చూస్తూ అన్నాడు.

"రెండు గంటలనుండి షాపింగ్ చేశాము. ఇక రాత్రంతా సిద్ధపడాలి"

"సిద్ధపడటమా! ఎందుకు?"

"ఫాషన్‌షో కోసం రేపు రిహార్సలు వుంది" రోహిత్ ప్రశ్నకు చేతన్ జవాబిచ్చాడు.

"యస్ డార్లింగ్! మన ఈ ఫర్మ్ నెలాఖరులో ఫాషన్‌షో నిర్వహిస్తుంది"

"ఓహ్...అలాగా! దాంట్లో నువ్వేం





చేయాల్సి వుంటుంది?" రోహిత్ అర్థంకాని వాడిలా ముఖంపెట్టి అడిగాడు.

"ఫాషన్ పెరేడ్‌లో పాల్గొనాలి. ఢిల్లీ, కలకత్తా, బెంగుళూరు, మద్రాసు నగరాలనుండి మోడల్‌గర్ల్సవచ్చి పోటీలో పాల్గొంటారు" రశ్మి ఎంతో ఉత్సాహంగా అన్నది.

"బాంబే బ్యూటీగా రశ్మి సెలెక్టు అయింది రోహిత్" చేతన్ అసలు విషయం బయటపెట్టాడు.

రోహిత్ భావగర్భితంగా చేతన్‌వైపు చూశాడు. తర్వాత ఓ చిరునవ్వు నవ్వి రశ్మిని చూశాడు. రశ్మి చేతన్ చేతిలో వున్న తన బేగు అందుకొంది. అందులో నుండి రకరకాల అందమైన డిజైన్లువున్న బట్టలు తీసి రోహిత్‌కు చూపించింది. అవన్నీ కంపెనీ డబ్బుతో కొన్నానని చెప్పింది.

ఆ బట్టలకు సరిపోయే ఆభరణాలు కొనడంలోనే సాయంత్రం అంతా గడిపానని చెప్పింది. తర్వాత ఆమె ఒక చిన్న బాక్సు తెరచి రోహిత్ ఎదుట వుంచి చాలా వుత్సాహంగా అడిగింది- "చెప్పండి.... ఎలావుంది నా సెలక్షన్?"

"బ్యూటిఫుల్! నీ టేస్టు సుపర్బ్‌గా వుంది. ఫాషన్‌షోలో క్వీన్ ఆఫ్ ది ఇయర్‌గా తప్పకుండా నువ్వే సెలెక్ట్ అవుతావు"

"పొండి..మీరు నన్ను మరీ ఆకాశానికి ఎత్తుతున్నారు"

"ఇందులో పొగడ్త ఏమీలేదు. రాధ గనక నిన్ను చూసిందంటే కుళ్లతో కుమిలిపోతుంది"

"రాధ ఎవరు?"

"నీకు తెలీదా? సినీతార కావాలను కుని అవలేక మోడల్‌గా మారింది"

"ఈసారి కనిపిస్తే మీరు క్లోజ్‌గా మాట్లాడకండి"

"ఏం...ఎందుకని?"

"ఆమె ప్రవర్తన మంచిది కాదు"

"నీకెలా తెలుసు?"

"నేనామె సంగతులు బాగా ఎరుగుదును"

రోహిత్ ఆమె ముఖంలో మారుతున్న రంగులను చూస్తున్నాడు. రెండు నిమిషాలు మౌనంగా వుండి, మంచంపై వున్న బట్టలలో నుండి గులాబీరంగు డ్రస్ తీసి ఆమెకు ఇస్తూ అన్నాడు- "ఐ లైక్ దిస్ వెరీమచ్...దిసీజ్ మై ఫేవరెట్ కలర్"

"అందుకే తెచ్చాను..."

"ఒకసారి వేసుకొని చూపించు" వాతావరణంలోని గాంభీర్యాన్ని తగ్గించాలని అతడు అన్నాడు.

"ఈరోజు కాదు...రేపు. దీనికి ఇంకా కొన్ని మార్పులు చేయాలి"

"రశ్మి...ఒకవేళ నువ్వు నిజంగానే షో అంతటికి క్వీన్‌గా సెలెక్ట్ అయితే నాకేం ఇస్తావు?"

"నా గౌరవం మీ గౌరవం కాదా...?"

"మీకు తెలియదా రోహిత్ బాబూ... రశ్మి గనక సెలెక్ట్ అయితే పదివేల రూపాయల రొక్కం ఇవ్వడమే కాక ప్రపంచంలోని ముఖ్య పట్టణాలు చూసి రావడానికి ప్రయాణ, భోజన, వసతి సౌకర్యాలు ఇస్తారు"

"ఓహో...అలా అయితే నేను చాలా ఇబ్బందిలో పడ్డానన్నమాటే!"

"ఎందుకని?" రశ్మి అడిగింది.

"నువ్వు ప్రపంచయాత్రకు బయలుదేరితే నీ వియోగంలో నేను దేవదాసుగా మారి పరలోక యాత్రకు బయలుదేరుతా

నేమో!"

"మీకలాంటి పరిస్థితి రానివ్వను లెండి"

"ఎలా?"

"మిమ్మల్ని నా సెక్రెటరీగా అపాయింటు చేసుకొని నా వెంట తీసుకొని వెళ్తాను" రశ్మి తన కిందిపెదవిని పై పండ్లతో నొక్కుతూ అన్నది. తర్వాత ఎంతో స్టైయిల్‌గా బ్యేగ్ అందుకొని పక్కగదిలోకి వెళ్ళింది.

రోహిత్, చేతన్ ఒకరి ముఖాన్నొకరు చూసుకొన్నారు. ఇద్దరి మనసుల్లోనూ ఓవిధమయిన సంకోచం వుంది. ముందు ఎవరు మాట్లాడాలో ఎవరికీ తోచడం లేదు. కొన్ని నిమిషాలు మౌనంగా గడిచాయి. చివరకు మౌనాన్ని భంగపరుస్తూ చేతన్ అన్నాడు – "టీ తాగుతారా ... రోహిత్ బాబూ?"

"తాగుదాం ... నువ్వు తయారు చేస్తావా?"

"నేను కాదు...రామూ" అని తన గదివైపు నడచాడు. రోహిత్ కొంచెం సేపు అతని కేసి చూశాడు. తర్వాత అతన్ని పిలిచి ఆపాడు. అతడేం చెప్తాడో వినాలని చేతన్ ఆసక్తిగా నిలబడ్డాడు.

"చేతన్ ... నాకొక విషయంలో భయంగా వుంది" రోహిత్ నెమ్మదిగా అన్నాడు.

"ఏ విషయంలో?." చేతన్ సంకోచిస్తూ అడిగాడు.

"నన్ను గురించి నాకే భయంగా వుంది...ఈ కొత్త జీవిత విధానం మనల్ని చాలా మార్చివేసింది"

"మీకీ మార్పు ఇష్టం లేదా?"

"ఇష్టమే...కాని, జీవితంలోని ఈ మార్పు మన స్వభావాలను మారుస్తుందేమో అని నాకు భయంగా వుంది"

"మీరు భలేవారే...దుస్తులు మారినంతమాత్రాన మనసులు మారతాయా!" చేతన్ నవ్వుతూ అన్నాడు.

"ఎవరి మనసు మారుతుంది చేతన్ బాబూ?"

అకస్మాత్తుగా రశ్మి వేసిన ప్రశ్నకు ఇద్దరూ వులిక్కిపడ్డారు. ఇద్దరూ ఆమె వైపు చూశారు. అలాగే రెప్ప వాల్చకుండా చూస్తూవుండిపోయారు. గులాబీ రంగు డ్రెస్‌లో ఆమె రాజకుమార్తెలా కనిపిస్తోంది. కళకళలాడే ముఖవర్చస్సు, గులాబీరంగు చీర కాంతిలో ఆమె చెక్కిళ్లు మరింత ప్రకాశవంతంగా కనిపిస్తూ సాయంకాలపు ఆకాశాన్ని గుర్తుకు తెస్తున్నాయి. రోహిత్ రోజూ తన భార్యను చూస్తున్నా, ఖరీదయిన ఈ డ్రెస్‌లో ఆమె అతిలోక సౌందర్యాన్ని చూసి బిత్తరపోయాడు. రశ్మి చిరునవ్వు నవ్వుతోంది.

కనులు మిరుమిట్లుగొలుపుతున్న అద్భుత సౌందర్యం ఆ గదిలోని గంభీర వాతావరణాన్ని ఉల్లాసమయంచేసింది. రోహిత్ చేతన్ వైపు చూశాడు కాని అప్పటికే అతడు భార్యాభర్తలను గదిలో వదిలిపెట్టి వెళ్లిపోయాడు.

"నాకు ఈ డ్రెస్ ఎలావుంది? మీకిష్టమయిన రోజా కలర్ బట్టల్లో నేనెలా కనిపిస్తున్నాను?" రశ్మి అతన్ని అడిగింది.

"దివి నుండి భువికి దిగివచ్చిన అప్సరసలా వున్నావు"

"అయితే ఈ అప్సరసతోపాటు ప్రపంచయాత్ర చేయడం మీకు ఇష్టమేనా?"

"ఇష్టమేనండీ మేడమ్‌గారూ ... మీ సెక్రెటరీ మీ వెంటరాక తప్పదుకదా!" అతడు వినయం నటిస్తూ అన్నాడు.

"పొండి...మీరు మరీను. నా మాటను





నిజంగా భావించి ఎగతాళి చేస్తున్నారు"

"ఎగతాళి కాదు రశ్మీ... ఆ బాస్‌గాడికి చేసే బండచాకిరీకంటే ఈ ఉద్యోగం చాలా మెరుగు"

"అయితే వెంటనే ఓ పని చెయ్యండి"

"ఏం చేయాలి?"

"కొత్త ఫాషన్లో వెంటనే ఓ సూటు కుట్టించుకోండి"

"ఎందుకు?"

"మీరు కూడా మీ అప్సరస వెంట ఫాషన్‌షోకు రారా?"

"నేను అక్కడికి ఎందుకులే రశ్మీ..."

"అలా అనకండి. సూటుకు డబ్బు నేను ఇస్తాను....సరేనా"



"కాని నేనక్కడికీ రావడం బాగుండదు...చూసేవాళ్లు వేరుగా భావిస్తారు" రోహిత్ సంకోచిస్తూ అన్నాడు.

"ఏమనుకొంటారు! నేను మీ భార్యనని, మీరు నా భర్తనీ అంటారు...అంతేనా?"

రోహిత్ ఏమీ అనలేకపోయాడు. ఇంతలో రామూ టీ తెచ్చాడు. రోహిత్ కప్పు అందుకొంటూ అడిగాడు-

"చేతన్ బాబు ఏం చేస్తున్నాడు?"

"ఏవో కాగితాలు చూస్తున్నారు..." రాము రెండవ కప్పు రశ్మికి ఇస్తూ అన్నాడు-

"పిక్చరు ప్రోగ్రాం కాన్సిల్ అయింది. కాని భోజనం మాత్రం మాతో కలిసి చేయాలి అని చెప్పు మీ బాబుగారితో"

రాము వెళ్లిపోయాడు.

రశ్మి ప్రసన్నవదనంతో రోహిత్‌ను చూసింది.

ఇప్పుడతని ముఖంలో అప్రసన్నత, చికాకు లేశమైనా లేవు.

వేడి వేడి టీ అతని అలసటను, చికాకును పోగొట్టింది. రశ్మి పట్ల వున్న కోపాన్ని తరిమివేసింది.



## 9

రోహిత్ వూహ నిజమయింది. ఫాషన్‌తోటి రశ్మి 'ఫాషన్ క్వీన్'గా ఎన్నిక అయింది. ఆమె అవయవాల పొందిక, అందమైన ముఖం, కనులు మిరుమిట్లుగొలిపే అందం, యవ్వన శోభతో కాంతులీనుతున్న శరీరం, అంద చందాలకు అతికిన గులాబీ రంగు దుస్తులు ఆమెకు ఈ అదృష్టాన్ని కల్గించాయి. అడ్వర్టయిజింగ్ ప్రపంచంలో ఆమె ఓ గొప్ప అలజడి రేపింది. హోటల్లో దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న రంగు రంగుల దీపకాంతులతో, దేశంలో వివిధ నగరాలనుండి వచ్చిన సుందరీమణులతో ఆ రాత్రి ఓ మధురస్వప్నంగా మారి పోయింది.

రశ్మి ముందు తక్కిన సుందరీమణులు చంద్రుని ముందు నక్షత్రాల్లా అయి పోయారు.

ఫాషన్ షో పూర్తయిన తర్వాత నేషనల్ అడ్వర్టయిజింగ్ కంపెనీవాళ్ళు గొప్ప కాక్‌టెయిల్ పార్టీ ఏర్పాటుచేశారు. దానికి నగరంలోని ప్రసిద్ధ వ్యాపార వేత్తలు, ఎడ్వర్టయిజింగ్ కంపెనీల అధికారులు, ప్రెస్ రిపోర్టర్లు, ఇతర ప్రముఖులు హాజరయ్యారు.

అతిథులందరూ రశ్మిని నాలుగువైపుల చుట్టుకొన్నారు. ప్రెస్ రిపోర్టర్లు ఆమెపై ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. ఆమె చిరునవ్వుతో ఎంతో తెలివిగా సమాధానాలు ఇస్తోంది. ఈ దినం ప్రోగ్రాంలో అందర్నీ ఆకర్షించిన ఏకైక వ్యక్తి రశ్మి, కనుక అందరి దృష్టి ఆమె మీదే వుంది. ఆమెను గుంపు నుండి దూరంగా తీసుకొనివెళ్ళి, కొంచెం విశ్రాంతి కల్పించాలని చేతన్ ప్రయత్నిస్తున్నాడు కాని జనం ఆమెను వదలడం లేదు.

గుంపులో వున్న రోహిత్ కూడా ఆమె దగ్గరికి వెళ్ళాలని ప్రయత్నం చేస్తున్నా పోలేకపోతున్నాడు. గుంపు అటుయిటూ




నెట్టడంలో అతని చేతుల్లోని పూలగుత్తి నలిగిపోతూంది. తన భార్యకు ఇంతటి కీర్తి ప్రతిష్ఠలు లభించడం అతనికి చాలా సంతోషాన్ని కలిగించింది.

గుంపును నెట్టుకొని ముందుకు పోతున్న రోహిత్ తక్కున ఆగిపోయాడు. తన కంపెనీ యజమాని రశ్మికి ఒక పూల గుచ్ఛం ప్రెజెంట్ చేస్తూ, ఆమెతో కలిసి నవ్వుతూ, కరచాలనం చేస్తున్నాడు. ఆ దృశ్యం చూసి రోహిత్ మనసు చేదుమందు మింగినవానిలా ముడుచుకొనిపోయింది. ఓ క్షణం ఆలోచించి చటుక్కున వెనుకకు తిరిగాడు.

అంతలో చేతన్ అక్కడికి వచ్చి రోహిత్‌ను అభినందిస్తూ అన్నాడు - "అరే! ఇదేమిటి...ఇంత సంతోషకరమైన సమయంలో మీ చెయ్యి ఖాళీగా వుండటం నాకేమీ నచ్చలేదు"

"నేను హాట్ డ్రింక్స్ తాగను"

"ఎప్పుడయినా..కంపెనీ కోసమయినా రుచి చూడలేదా?"నిషాలో మునిగి వున్న చేతన్ అడిగాడు.

"చాలా సంవత్సరాల క్రితం... కాలేజీలో చదివే రోజుల్లో ఒకటి రెండు సార్లుకొద్దిగా తాగాను"

"అయితే ఇప్పుడు కూడా రెండు గుక్కలు తాగు. నీకోసం కాదు... నీ బ్యూటీ క్వీన్ కోసం. మన అంచనాలను నిజంచేసిన స్వప్నసుందరి కోసం" అంటూనే చేతన్ ఇంకో పెగ్ అందుకొన్నాడు.

"వద్దు చేతన్... నేను తాగనని చెప్పాగా"

"నీ రశ్మి మీద ఒట్టు...రెండు గుక్కలు తాగు" అతడు గ్లాసును రోహిత్ చేతిలో బలవంతంగా పెట్టాడు.

రోహిత్ విస్తరపోయి అతన్నే చూస్తూ వుండిపోయాడు. గ్లాసు చేతితో పట్టుకొని అటు ఇటు బెరుకుగా చూడసాగాడు. చేతన్ తన గ్లాసు,అతని గ్లాసుకు తగిలించి అన్నాడు- "ఫర్ ది బెస్ట్ హెల్త్ ఆఫ్ రశ్మి, ది ఫాషన్ క్వీన్" చేతన్ నాలుగయిదు గుక్కలు తాగాడు. రోహిత్ కూడా జంకుతూ రెండు గుక్కలు తాగాడు.

"బెస్ట్ ఆఫ్ లక్...నాలుగు గుక్కలు తాగితే దీనిలోని మజా నువ్వే తెలుసుకొంటావు. నీ శరీరంలో వేడి, వుత్సాహం పరుగులు తీస్తాయి"

రోహిత్ శరీరంలో చిన్నగా వణుకు మొదలయింది. అతడు నిలబడలేకపోతున్నాడు. చేతన్ మరోసారి అతని గ్లాసుకు తనగ్లాసును అనిస్తూ అన్నాడు- "తాగు మిత్రమా...బాగా తాగు. తర్వాత చూడు ఆనందడోలికల్లో వూగిపోతావు" అంటూ అతని చేయి పట్టుకొని మిగిలిన మద్యం అంతా బలవంతంగా తాగించాడు.

తాగిన తర్వాత రోహిత్‌లో చురుకుదనం ఎక్కువయింది. అతడు గుంపును చీల్చుకొంటూ రశ్మి వైపు నడిచాడు. అతని బాస్ ఇంకా రశ్మి పక్కనే నిలబడి పెద్ద పెద్ద వ్యాపారస్తులకు ఆమెను పరిచయం చేస్తున్నాడు. అతడు రశ్మిని పర్మనెంటుగా తమ కంపెనీకి పబ్లిసిటి గర్ల్‌గా ఒప్పించుకోవాలని తాపత్రయపడుతున్నాడు. ప్రముఖులను పరిచయంచేస్తున్న అతడు అకస్మాత్తుగా రోహిత్‌ను చూశాడు. చూడగానే అతని ముఖం ఎర్రగా మారిపోయింది. రోహిత్ రశ్మికి పూలగుచ్ఛం ఇచ్చి శుభాకాంక్షలు తెలిపాడు. రశ్మి ముఖం ఆనందంతో విప్పారింది. ఆమె నవ్వుతూ రోహిత్‌కు షేక్ హేండ్

ఇచ్చింది.

తన దగ్గర పనిచేస్తున్న ఓ మామూలు గుమస్తా ఇంత ధైర్యంచేయడం సేఠ్ మురారీలాల్‌కు కోపం తెప్పించింది. అతడు జేబురుమాలు బయటికి తీసి దానితో తన బట్టతల తుడుచుకొన్నాడు. తర్వాత రశ్మి ఎవరో అభిమానితో కలసి ఫొటో తీయించుకొన్నది. సేఠ్ కొంచెం పక్కకు వచ్చి రోహిత్‌తో చిన్నగా అన్నాడు-

"నువ్వు ఇక్కడికి రాకూడదు"

"ఎందుకని సార్....?"

"ఎందుకేమిటి? డిసిప్లిన్...ఐ మీన్.. ప్రొప్రయిటరు, గుమస్తా ఒకే చోట... పక్క పక్కనే వుండవచ్చునా! నీకెలా చెప్పాలో తెలియడంలేదు. ఇంగితజ్ఞానం కొంచెమైనా వుండాలి"

"నాకు అర్థమయింది సార్.... కాని ఏం చేయమంటారు? ఆహ్వానాన్ని కాదనలేక వచ్చాను."

"నువ్వు ఎవరి గెస్టువి?"

"నేను... నేను...!" ఆ గుంపులో అతని చూపులు రశ్మి కోసం వెదికాయి.

సేఠ్ మురారీలాల్ ఇంకా నొక్కి నొక్కి అడిగేవాడే కాని అంతలో రశ్మి అక్కడికి వచ్చింది. సేఠ్ వెంటనే ఆమె వైపు తిరిగి నవ్వుతూ అన్నాడు-

"నేను మా సెక్రటరీతో మాట్లాడుతున్నాను...మిమ్మల్ని గురించే"

"ఎవరు మీ సెక్రటరీ....?" రశ్మి రోహిత్ వైపు చూస్తూ అడిగింది.

"మిస్టర్ రోహిత్...చాలా హుషారయిన యువకుడు. ఇతన్ని అడగండి. నేను మీ ఫొటోను చూసీచూడగానే ఏమన్నానో.."

"సేఠ్‌జీ ఏమన్నారు మీతో?" రోహిత్‌ను భావగర్భితంగా చూస్తూ రశ్మి అడిగింది.

"మీ వంటి సౌందర్యరాశి... యవ్వన శోభతో ప్రకాశిస్తున్న యువతి ఎడ్వర్టయిజింగ్ ప్రపంచంలో సభూతో సభవిష్యతి అన్నారు"

"థాంక్యూ...." రశ్మి సిగ్గుపడుతూ అన్నది. తర్వాత రోహిత్‌ను అడిగింది- "మీ అభిప్రాయం చెప్పండి?"

"ఎదుట కనిపించే సౌందర్య దేవతను ఇన్నిదినాలు నా కళ్ళు ఎందుకు కనిపెట్టలేకపోయాయా అని ఆశ్చర్యపోతున్నాను"

"ఇప్పటికయినా వాస్తవాన్ని గుర్తించారు... అంతే చాలు''

"మీ ఇద్దరికి ఇంతకు పూర్వమే పరిచయం వుందా?" సేఠ్ మురారీలాల్ ఆశ్చర్యంగా అడిగాడు.

"నేను ఈవిడగారి గెస్టునే సార్"

"యస్..." రశ్మి చిరునవ్వుతో, మధురంగా జవాబిచ్చింది.

అంతలో చేతన్ కొంతమందిని రశ్మి దగ్గరికి తెచ్చి ఫాషన్ క్వీన్‌కు వాళ్ళను పరిచయం చేయసాగాడు. రోహిత్ పక్కగా నిలబడి తన బాస్ ముఖంలో మారుతున్న రంగులు గమనిస్తున్నాడు.

రోహిత్ చేతన్‌కు సైగచేశాడు. అతడు రశ్మిని పిలుచుకొని మరోవైపు వెళ్ళాడు. సేఠ్ మురారీలాల్ అతిముఖ్యమయిన వస్తువేదో పోగొట్టుకొన్నవాడిలా అయిపోయాడు. అతని మనస్థితిని గమనించిన రోహిత్ ట్రేలో వున్న రెండు గ్లాసులు అందుకొని ఒకటి సేఠ్‌కు ఇచ్చి మరొకటి తాను వుంచుకొన్నాడు.

"నువ్వు మద్యం సేవిస్తావా?" గ్లాసు అందుకొంటూ సేఠ్ అడిగాడు.

"ఈరోజు మొదటిసారిగా తాగు




తున్నాను. రశ్మి గెలుపొందిన ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకొని"

"నువ్వు రశ్మిని ఎప్పటి నుండి ఎరుగుదువు?"

"నిజం చెప్పమంటారా... ఆమె నా జీవితాన్నే మార్చివేసింది..శిలను శిల్పంగా మలిచింది."

అతని జవాబు సేథ్‌జీకి కోపం తెప్పించింది.

బ్యాండు ఇంగ్లీషు మ్యూజిక్ విని పిస్తోంది. మెత్తగా, ఎర్రగా పరచి వున్న తివాచీపై ఎన్నో జతల కాళ్లు క్రమంగా స్టెప్పు వేస్తున్నాయి. రశ్మి కూడా ఎవరో అభిమానితో కలిసి మ్యూజిక్‌కు అను గుణంగా డాన్సు చేస్తోంది.

రోహిత్‌కు నిషా ఎక్కింది. అతనికి ఏమిచేయాలో పాలుపోవడంలేదు. తన బ్రతుకుకు అర్థం ఏమిటో, లక్ష్యం ఏమిటో తెలియడంలేదు. అ త ని కి డాన్సులో పాల్గొనాలనిపించలేదు. మెల్లగా హాలు దాటి బయటికి నడిచాడు.

కొంత దూరం నడిచి వెళ్ళి కాంపౌండు గోడకు చెయ్యి ఆనించి నిలబడ్డాడు. బేండు శబ్దం సన్నగా వినిపిస్తోంది. అతడు తన ఎదుట అనంతంగా వ్యాపించి వున్న సముద్రాన్ని, వెన్నెలలో తళ తళ మెరుస్తున్న అలలను చూస్తున్నాడు. అలలు సముద్రంపై నాట్యం చేస్తున్న నర్తకీమణుల్లా కనిపిస్తున్నాయి. రోహిత్ మనసులో కూడా భా వ త రం గా లు ఉవ్వెత్తున లేచి, వెంటనే విరిగి పడు తున్నాయి. అంతలో అతని ముఖం చుట్టూ సిగరెట్టు పొగ కమ్ముకొంది.

అతడు బిత్తరపోయి, వెం ట నే తేరుకొని పక్కకు తిరిగి చూశాడు. రాధ ఎదురుగా నిలబడి ఉంది. ఆమె చేతిలో కాలుతున్న సిగరెట్టు ఉంది. ఆమె రోహిత్‌ను తనవైపు ఆకర్షించాలని పొగ వదిలింది.

"నీ ప్రియమైన రశ్మి..ఒక రాత్రిలోనే నీ బతుకును ఇలా భారంగా మార్చి వేసిందే అని ఆలోచిస్తున్నావుకదూ?" అని ఓక్షణం ఆగి మళ్ళీ తానే అన్నది-

"భవిష్యత్తులో ఇంకా ఎన్ని బాధలు అనుభవించాలో, ఎన్ని రాత్రులు ఇలా వంటరిగా నిట్టూర్పులతో గడపాలో..."

అంతలో హాల్లో పెద్ద గోల వినిపిం చింది. రోహిత్ తక్కున ఆగి, ఎదురుగా తెరచి వున్న ద్వారం వైపు చూశాడు. బేండు శబ్దం వున్నట్టుండి ఆగిపోయింది. రోహిత్ భయపడ్డాడు. హాల్లో ఏదో గొడవ జరిగి వుంటుందని అతనికి అని పించింది. తన రశ్మికి ఏదయినా ప్రమాదం జరిగిందేమో!

పరుగులాంటి నడకతో హాల్లోకి వచ్చాడు.

రశ్మి డాన్సు చేస్తూ మధ్యలో కింద పడిపోయింది. అందరూ ఆమెచుట్టూ మూగి వున్నారు. ఆమె స్పృహతప్పి పడి పోయింది.

"ఏమయింది?" అతడు గుంపులోకి వెళ్లి అడిగాడు. రశ్మిని చూసి అతను తన శరీరంలోని రక్తమంతా ఘనీభవించి పోయినట్లుగా ఫీలయ్యాడు. అతడు భయం భయంగా ఆమెను చూస్తున్నాడు. డాక్టరు వచ్చాడు. రశ్మికి స్మారకం తెప్పించే ప్రయత్నం చేస్తున్నాడు. "డాన్సు చేస్తూ కళ్లు తిరిగి పడి పోయింది. కొంచెంసేపట్లో స్పృహ వస్తుంది. భయపడాల్సిన పనిలేదు" రోహిత్ ప్రశ్నకు జవాబుగా చేతన్ అన్నాడు.

కొంచెంసేపటికి రశ్మికి స్పృహ

వచ్చింది. డాక్టరు గుంపును దూరంగా పొమ్మని చెబుతున్నాడు. రోహిత్ రశ్మి దగ్గరికి వెళ్ళి కిందికి వంగి అడిగాడు –
"ఇప్పుడెలా వుంది?"

రశ్మి సైగచేసి తనకేమీ ప్రమాదం లేదనీ, కోలుకొన్నాననీ చెప్పింది. రశ్మి మీదికి వంగివున్న రోహిత్‌ను చూసి డాక్టరు అడిగాడు–"ఎవరు మీరు?"

"ఈమె భర్తను"

ఈ మాట విన్న వారందరూ ఆశ్చర్యంగా రోహిత్‌ను చూడసాగారు.

"ఈమెకు విశ్రాంతి అవసరం. మాట్లాడించకండి" ఆమెను లేవనెత్తుతూ డాక్టరు అన్నాడు –

"అవును రోహిత్. ఈమెను వెంటనే ఇంటికి తీసుకొని వెళ్లు" సేఠ్ మురారీ లాల్ ముందుకు వెళ్ళి ఆమె భుజం పట్టుకొని తెచ్చి సోఫాలో కూర్చోబెడుతూ అన్నాడు.

"నా కారు తీసుకొనివెళ్లు"

"మీరు ఎక్కడ వుంటున్నారు?" డాక్టరు అడిగాడు.

"అంధేరీలో"

"అయితే నా వెంట రండి" డాక్టరు ఓ మూలకు వెళ్ళి తన బేగ్‌నుండి కాగితం తీసి మందుచీటి రాశాడు. చీటీని రోహిత్‌కు ఇస్తూ అన్నాడు–"ఈ మందు తెప్పించి, అరగంటకోసారి, రెండు స్పూన్లు నీళ్లలో కలిపి ఇవ్వండి"

"డాక్టర్! ప్రమాదం ఏమీ లేదు కదా?"

"బొత్తిగా లేదు. ఆమె ఏడెనిమిది నెలల్లో తల్లికాబోతోంది అని నా సందేహం" డాక్టరు మెల్లగా అతని చెవిలో చెప్పాడు.

ఈ మాట విన్న రోహిత్ ఆనందంతో ఉక్కిరిబిక్కిరి అయ్యాడు. అతని మనసు పున్నమినాటి సముద్రంలా పొంగిపోయింది.

* * *

"ఇప్పుడు రశ్మి ఆరోగ్యం ఎలా వుంది?" రోహిత్‌ను చూడగానే మురారీలాల్ అడిగాడు.

"చాలావరకు మెరుగుపడింది" రోహిత్ పోస్టులో వచ్చిన ఉత్తరాలు అతనిముందు పెడుతూ అన్నాడు.

"నువ్వు చాలా తమాషా మనిషివోయ్. ఆమె నీ భార్య అని నాకు ఇన్నిరోజులు చెప్పనే లేదే?"

"అవసరం రాలేదు సార్"

"ఆదినం ... ఫాషన్‌షోలో ఆమెకు ఎవరిదో దృష్టి తగిలివుంటుంది"

"దృష్టి స్వంతవాళ్లదే తగులుతుంది సార్...పరాయివాళ్లది అంత హాని కలిగించదు"

"ఓహ్. ... అయ్‌సీ" సేఠ్‌జీ నవ్వి రోహిత్ వైపు భావగర్భితంగా చూసి అన్నాడు–"అయితే ఆమెకు తప్పకుండా నీ దృష్టే తగిలి వుంటుంది"

ఈ మాటలకు రోహిత్ ఉలిక్కిపడ్డాడు. ఫైలును చూస్తున్న ఆయన ముఖాన్నే పరిశీలనగా చూడసాగాడు. ఆయన ముఖంలో కనిపిస్తున్న కృత్రిమ పరిహాసం మనసులోని పాపిష్టి ఆలోచనలను కప్పివేయాలని వ్యర్థ ప్రయత్నం చేస్తుంది.

రోహిత్ నాలుగు దినాల తర్వాత ఈరోజు ఆఫీసుకు వచ్చాడు. రశ్మి అనారోగ్యంగా వున్నందుకు అతడు సెలవుపెట్టాడు. ఈ దినం ముందుగా వచ్చి నాలుగురోజుల పెండింగు పని పూర్తి చేశాడు.

ఫోస్టులోని ఉత్తరాలలో రోహిత్ సెలవు చీటీ కూడా వుంది. దాన్ని చూసిన వెంటనే సేఠ్‌జీ రోహిత్‌ను పిలిచి అన్నాడు – "ఫోన్ చేశావుకదా! మళ్లీ అప్లికేషను పెట్టావెందుకు?"

"ఆఫీసు రికార్డు కోసం రాశాను సార్"

"ఓహ్ ... అదా సంగతి! నువ్వు రాకున్నా నీ జీతం తగ్గదు లేవయ్యా బాబూ!" అని రోహిత్ అర్జీని చెత్త బుట్టలో వేశాడు. తక్కిన కాగితాలపై సంతకాలు చేసి రోహిత్‌కు ఇచ్చివేశాడు.

"థాంక్యూ సర్!" రోహిత ఫైలు అందుకొని వెళ్లడానికి సిద్ధం అయ్యాడు.

"మరో విషయం..."

"సర్" రోహిత్ ఆగాడు.

"ఈరోజు నుండి నీ ఉద్యోగం పర్మనెంటు చేస్తున్నాను. నీ జీతం కూడా రెండువందలు పెంచుతున్నాను"

"అయామ్ గ్రేట్‌ఫుల్ టు యూ సర్ బట్..." రోహిత కొంచెం సందేహిస్తూ అన్నాడు – "వున్నట్టుండి నాపై ఇంత దయ ఎందుకు చూపుతున్నారో తెలుసుకోవచ్చా?"

"ఎందుకేమిటి! నువ్వు రశ్మి భర్తవు కనుక. నువ్వు అందరిలాంటి వ్యక్తివి కాదు. రశ్మి హోదాకు తగిన విధంగా నీ జీవన విధానం కూడా మారిపోవాలి... సామాజిక ధర్మం ఇదే..."

"సారీ సర్... దయా దాక్షిణ్యాలతో మీరు చేసే సహాయం తీసుకోవడం నాకు ఇష్టంలేదు" రోహిత్ ఆవేశంగా అన్నాడు.

"ఆర్ యు ఎ ఫూల్....యు ఆర్ రెఫ్యూజింగ్ మై ఆఫర్" సేఠ్‌జీ కోపంగా అన్నాడు.

"నో సర్...మీరు నా యోగ్యతను, నా కార్య కుశలతను చూసి జీతం పెంచారనుకొన్నాను. నాలో ఆత్మగౌరవం వుంది. నా యోగ్యతకు,నా పనితనానికి మెచ్చి ఇచ్చేదానిని నిజమైన గౌరవంగా భావించి స్వీకరిస్తాను. అలాంటి గౌరవం పొందినందుకు గర్విస్తాను. కాని... నా భార్యవలన వచ్చే గౌరవం నాకు వద్దు" అని రోహిత్ గిరుక్కున తిరిగివెళ్లి తన గదిలో కూర్చున్నాడు.

సేఠ్‌జీ మాటలు రోహిత్‌కు సంతోషాన్ని కలిగించే బదులు అతని హృదయాన్ని పిండివేస్తున్నాయి. మనసును దహించి వేస్తున్నాయి. ఈ మహానగరంలో తనకు నిజంగా అస్తిత్వం లేదా? ఒక అందమయిన మోడల్ గర్ల్‌కు భర్తగా మాత్రమే తనకు మర్యాద లభిస్తోందా? ఆమె అందచందాలు ప్రకటనలకు అమ్ముడుపోయే సాధనాలు మాత్రమేనా? ప్రజలందరి దృష్టి తన భార్యయొక్క కోమలమైన, పుష్టికరమైన, అందమైన శరీరం మీదే కేంద్రీకరింపబడి వుంటుంది. తనకేమీ ప్రత్యేకత లేదు. తానొక శూన్యం... సున్నాతో సమానం.

ఈ న్యూనతాభావం అతని మనసును కలిచివేసింది. అతడు పక్కకు తిరిగి చూశాడు. రాధ కొంచెం దూరంలో నవ్వుతూ కనిపించింది. అకస్మాత్తుగా తన ఎదుట రాధను చూసిన రోహిత్ కొంచెం సిగ్గుపడ్డాడు.

"ఈ సర్టిఫికెట్ మీద మీ బాస్ సంతకం కావాలి" అంటూ రాధ బల్లమీద ఒక కాగితం పెట్టింది.

"ఎందుకు?"

"నేను ఎయిర్‌హోస్టెస్ వుద్యోగానికి

అప్లయి చేయాలనుకొంటున్నాను. ఎవ రయినా పెద్దమనిషి సర్టిఫికెట్ ఇవ్వాలి"

"నిన్ను బాగా ఎరిగిన పెద్దమనిషి ఇస్తే బాగుంటుంది"

"మీ బాస్‌తో నాకు బాగా పరిచయం వుంది"

"కానీ...నువ్వు?"

"ఆయనకు నేను వచ్చానని చెప్పండి చాలు. ఆయనే నన్ను పిలిపిస్తారు"

రోహిత్ ఏమీ అనకుండా వెంటనే ఫోన్ అందుకొని మురారీలాల్‌కు రాధ రాకను గురించి చెప్పాడు. ఆయన వెంటనే ఆమెను లోపలికి పంపమని చెప్పాడు.

సేఠ్‌జీ శీలాన్ని గురించి, స్వభావాన్ని గురించి రోహిత్‌కు వున్న సందేహాలు ఇప్పుడు ఋజువయ్యాయి. సేఠ్‌జీ నెలనెలా ఎందరో అమ్మాయిలకు డబ్బు ఇస్తుంటాడు. వాళ్ళకు ఆ డబ్బు ఎందుకు ఇస్తున్నాడో రోహిత్‌కు అర్థం అయ్యేదికాదు. వాళ్ళలో చాలామందిని అతడు ఒకసారికూడా చూసి ఎరుగడు. అందువల్లే రాధకు, సేఠ్‌జీకి కలిగిన ఈ గాఢ పరిచయం అతనికి ఆశ్చర్యాన్ని కలిగించలేదు. నిన్న మొన్నటివరకు గడ్డిపోచలా తృణీకరించ బడిన రాధ ఈరోజు బంగారుతీగలా గౌరవించబడుతోంది.

అంతలో గణగణ మోగిన టెలిఫోన్ అతని ఊహలకు అంతరాయం కలిగిం చింది.

రోహిత్ టెలిఫోన్ అందుకొన్నాడు. అవతలవైపు సేఠ్‌జీ మాట్లాడాడు. "మిస్టర్ రోహిత్...రాధకు పబ్లిసిటీ ఎకౌంటు నుండి అయిదువేల రూపాయలకు చెక్కు ఇవ్వు"

రోహిత్ ఫోను కిందపెట్టేసరికి ఎదు రుగా రాధ వచ్చి నిలబడివుంది. ఆమెను కూర్చోమని చెప్పి అతడు చెక్కు రాస్తు న్నాడు.

"సర్టిఫికెట్ మీద సంతకం చేశాడా?" చెక్కు చించి రోహిత్ అడిగాడు.

"చేశాడు"

"వుద్యోగం ఎప్పటికి దొరుకుతుంది?"

"రెండు నెలల్లో దొరకవచ్చు"

"అక్కడ రికమెండేషన్లు కూడా పని చేస్తాయా?" అతడు అటెండరుకోసం బెల్ కొట్టాడు.

"మీ బాస్‌గారి మాట బాగా పని చేస్తుంది"

"మరి ఈ డబ్బు ఎందుకు? లంచం ఇవ్వడానికా??" అతడు నవ్వుతూ అడి గాడు.

"కాదు..నాకే!ఒక ప్లాటుకు అడ్వాన్సు ఇవ్వాలి" అంతలో అటెండరు వచ్చి చెక్కు తీసుకొని బాస్ సంతకం కోసం తీసుకొని వెళ్ళాడు.

రోహిత్ ఏవో కాగితాలు చూస్తు న్నాడు. రాధ మౌనంగా అతని ముఖంలో మారుతున్న భావాలను గమనిస్తోంది.

"మీకు నాపై కోపంవచ్చిందా?" చాలా సేపు మౌనంగా వున్న రాధ అడిగింది.

"లేదు. నీపై కోపం ఎందుకు?" ఆమె కేసి చూడకుండానే రోహిత్ అన్నాడు.

"ఆరోజు పార్టీలో నేను తాగి ఏమేమో వాగాను"

రోహిత్ ఆమెను పరిశీలనగా చూసి అన్నాడు—"నువ్వలా బ్రాందీ తాగుతూ మైకంలో తూలడం నాకు నచ్చలేదు"

"ఒకవేళ రేపు రశ్మి కూడా తాగితే?" అని రాధ గలగల నవ్వింది.

రాధ మాటలు రోహిత్ గుండెల్లో వాడి కత్తిలా దూసుకొనిపోయాయి.




అతడు కొంచెంసేపటివరకు ఆమెను చుర చుర చూస్తూ వుండిపోయాడు.

"డోంట్ థింక్ అదర్‌వైజ్! మొదట్లో నేను కూడా బ్రాందీ, విస్కీలంటే చాలా అసహ్యించుకొనేదాన్ని" నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ రాధ అన్నది.

"రాధకు, రశ్మికి చాలా భేదముం అన్న విషయం గుర్తుంచుకో" రోహి సీరియస్‌గా అన్నాడు.

"నిన్నటివరకు నేనూ మీలాగే అనుకొన్నాను. కాని ఈదినం డాక్టర్ వాసు క్లినిక్‌లో ఆమెను చూసిన తర్వాత నాకు మా ఇద్దరిలోనూ పెద్ద తేడా కనిపించలేదు. ఎందుకంటే..." ఆమె మధ్యలోనే



ఆగిపోయింది.

"ఎందుకు?"

"ఆమె అక్కడికి ఎందుకు వెళ్ళిందో మీకు తెలుసా? బహుశా తెలియక పోవచ్చు...కాని నాకు తెలుసు. అబార్షన్ చేయించుకోవడంకోసం వెళ్ళింది" ఆమె తమాషాగా నవ్వి అతనివైపు చూసింది

"యూ ఆర్ టాకింగ్...నాన్సెన్స్'

రోహిత్ ఆమెను నాలుగు తిట్టి బయ టికి పంపేవాడే కాని బలవంతంగా కోపాన్ని అణచుకొన్నాడు.

అటెండరు చెక్కు తెచ్చి ఇచ్చాడు. రోహిత్ వణకుతున్న చేతితో చెక్కును ఆమెకు ఇచ్చాడు. రాధ అతనివైపు భావయుక్తంగా చూస్తూ వాకిలి దగ్గరకు వెళ్ళింది. వెనక్కు తిరిగి చెయ్యి వూపుతూ బైబై చెప్పి గది దాటి వెళ్ళిపోయింది. రోహిత్ తన సీట్లో స్థాణువులా కూర్చుండిపోయాడు.

రోహిత్ రాధ మాటలు నమ్మలేకున్నాడు.

రాధ రశ్మిపై వున్న అసూయతో నిర్మలమైన ఆమె జీవితంపై కళంకపు బురద చల్లాలని ఇలా చెప్పివుంటుంది. లేదా తమ ఇద్దరి మధ్యా అనుమాన బీజాలు చల్లి, బతుకులను నరకప్రాయంగా చేయాలని ఇలా అబద్ధం చెప్పి వుంటుంది. రశ్మి డాక్టరు వాసు క్లినిక్‌కు వెళ్ళిందని రాధ చెప్పిన మాట అతన్ని కలచివేస్తుంది. అతని ఒళ్లంతా చెమట పట్టింది అతనికి తన జీవిత నావ సుడిగుండంలో చిక్కుకొన్నట్లు అనిపించింది.

* * *

ఆరోజు రోహిత్ ఇంటికి ముందుగా వచ్చాడు. ఇంట్లో రశ్మి లేకపోవడంతో అతని చికాకు ఎక్కువయింది. ఒంటరితనం, విసుగు, నిస్సత్తువ అతన్ని క్రుంగదీశాయి. వ్యాకులచిత్తుడై గదిలో మంచంపై పడుకొన్నాడు. అతని మనసులో రాధ అన్న మాటలే మెదులుతున్నాయి.

ఎదురుగా టీపాయ్ మీద ఆరోజు వచ్చిన జాబులు వున్నాయి. ఒక కవరు మీద తన అడ్రసు వుంది. అది ప్రభుత్వ కార్యాలయపు ముద్రతో వుంది. రెండవది రశ్మికి వచ్చిన కవరు. రశ్మికి వచ్చిన కవరు తెరచివుంది. రోహిత్ ముందు ఆ కవరు తెరచాడు. అతని వేళ్లు వణుకుతున్నాయి. ఆ జాబును నేషనల్ ఎడ్వర్టయిజింగ్ బ్యూరోవాళ్ళు రాశారు. రశ్మి పోటీలో గెలిచినందుకు అభినందనలు, ఆమె వాళ్ళ కంపెనీకి ఇస్తున్న ప్రోత్సాహానికి కృతజ్ఞతలు తెలుపుతూ పదివేల రూపాయల చెక్కు కూడా పంపారు. చెక్కును రశ్మి తీసి దాచిపెట్టినట్లుంది.

కవర్లో జాబు మాత్రం వున్నది. ప్రపంచ యాత్రకుగాను ఫ్రీ టికెట్ ఇస్తామన్న తమ కండిషన్‌ను గురించి కూడా వారు రాశారు. పాస్‌పోర్టు లభించగానే టికెట్ కూడా ఇస్తామని రాశారు.

రోహిత్ జాబును మళ్లీ కవర్లో పెట్టి టీపాయ్ మీద పెట్టాడు. అతని శరీరంలో వింత అనుభూతి నిండుకొంది. అది సంతోషమో, బాధో అతనికే తెలియదు.

తర్వాత అతను తన జాబు తెరచి చదివాడు. చదవగానే అతని నరాల్లో రక్తం పొంగినట్లయింది. వాటిల్లో వింత శక్తి నిండుకొంది. కాంతి విహీనం అయిన కళ్ళలో కాంతి నిండుకొంది. స్టేషన్ మాస్టరు ఉద్యోగానికి రైల్వేబోర్డువారు

 

అపాయింటుమెంటు ఆర్డరు పంపించారు.

తానిప్పుడు మురారీలాల్ దగ్గర బాధను భరిస్తూ, అవమానాలు సహిస్తూ, ఆవేదన అనుభవిస్తూ వుద్యోగం చేయాల్సిన అవసరం లేదు. ఈ కృత్రిమమైన, ఆడంబరమయమయిన జీవితం నుండి రశ్మిని దూరంగా తీసుకొని పోవడానికి తనకొక ఆధారం దొరికింది.

అంతలో తలుపుదగ్గర చప్పుడుతో పాటు గాజుల గలగల శబ్దం వినిపించింది. రోహిత్ చటుక్కున తన జాబు జేబులో పెట్టుకొని లేచి నిలబడ్డాడు. అప్పుడే రశ్మి లోపలికి వచ్చింది. చేతన్ వాకిలి దగ్గరే నిలబడిపోయాడు. గదిలో, వేళకాని వేళలో రోహిత్‌ను చూసిన రశ్మి బిత్తర పోయింది. కొంచెంసేపు ఇద్దరూ ఒకర్నొకరు చూసుకొన్నారు.

"ఈరోజు ఆఫీసు నుండి త్వరగా వచ్చేశారే?''

"అవును ... నాలుగురోజుల సెలవు తర్వాత ఆఫీసులో పని చెయ్యబుద్ధి కాలేదు"

ఆమె చిన్నగా నవ్వి అన్నది – "ఆరోగ్యం సరిగాలేదా?"

రోహిత్ ఏమీ జవాబుచెప్పలేదు.

"ఏమయింది మీవారికి?" చేతన్ లోపలికి వస్తూ అన్నాడు.

"స్నేహితుల దృష్టి తగిలింది" రోహిత్ చేతన్‌వైపుచూస్తూ వ్యంగ్యంగా అన్నాడు.

అతని జవాబుకు చేతన్ ముఖం కళావిహీనం అయిపోయింది. భార్యాభర్తలు సీరియస్‌గా వుండటం గమనించిన అతడు కూడా మౌనంగా నిలబడ్డాడు. అతడు అప్పుడే కూలివాడు తెచ్చిన సామాన్లను దింపి జాగ్రత్తగా గదిలో ఒకవైపు పెట్టి వెళ్ళిపోయాడు. ఆ వస్తువుల్లో రశ్మి కొనితెచ్చిన టేప్ రికార్డరు కూడా వుంది.

రశ్మి భర్తవైపు నిర్లక్ష్యంగా ఒకసారి చూసి ఏమీ మాట్లాడకుండానే టేప్ రికార్డరును అట్టపెట్టెలోనుండి తీసి బయట పెడుతోంది.

"కొత్తది కొన్నావా?" మౌనాన్ని భంగపరుస్తూ రోహిత్ అడిగాడు.

"ఆ...కాని మీ సీరియస్‌నెస్ నాసంతోషాన్ని పాడుచేసింది...నా వుత్సాహాన్ని నిరుత్సాహపరచింది" రశ్మి నిష్ఠూరంగా అన్నది.

"నేనేం చేశాను?"

"ఆరోగ్యం బాగున్నా, లేకున్నా పరాయివాళ్ళతో నవ్వుతూ మర్యాదగా మాట్లాడాలి"

"కాని చేతన్ పరాయివాడు కాడుగా?"

రశ్మి ఓ క్షణంపాటు ఏమీ జవాబు చెప్పలేక బిత్తరచూపులతో భర్తను చూసింది. తర్వాత కింది పెదవి పైపంటితో నొక్కి పట్టింది.

ఓ క్షణం ఆగి భర్తతో అన్నది– "ఇంతకుముందు మీరు ఎప్పుడూ ఇలా ఎదుటివాళ్ళను సూటిపోటి మాటలు అనలేదు"

"ఇంతకుముందు నువ్వు కూడా నాతో ఎప్పుడూ అబద్ధం చెప్పలేదు"

"అబద్ధమా.... నేనేం అబద్ధం చెప్పాను? మిమ్మల్ని ఎవరో నా మీదకి పురిగొల్పుతున్నారు"

"ఎవరూ పురిగొల్పడంలేదు. ఒక ప్రశ్న అడుగుతాను– జవాబు చెప్పాలు. నువ్వు డాక్టర్ వాసు క్లినిక్‌కు ఎందుకు వెళ్ళావు?"

ఈ ప్రశ్న వినగానే రశ్మి ముఖం కళావిహీనం అయింది. తెల్లగా పాలి

పోయింది. పెదాలు ఎండిపోయాయి. కళ్ళు కాంతివిహీనం అయ్యాయి. ఆమె వెంటనే ఏమీ జవాబు చెప్పలేకపోయింది. ఆమె మౌనమే ఆమె ఆ పని చేసిందని తెలియ జేస్తోంది.

రోహిత్ అదే ప్రశ్నను మళ్లీ అడిగాడు. ఆమె కొంచెం విసుగ్గా అన్నది– "నేను చేసే ప్రతి చిన్న పనీ మీకు ముందుగా చెప్పి చేయాలా?"

"అవును...ప్రేమ ఎక్కడ వుంటుందో అక్కడ నమ్మకం కూడా వుండాలి. ప్రేమలో కపటానికి, అబద్ధానికి తావుంచ కూడదు" రోహిత్ మాటల్లో తీవ్రత కొంచెం తగ్గింది.

"అయితే వినండి. నేను కొంతకాలం వరకు తల్లిని కాకూడదని నిర్ణయించు కొన్నాను" రశ్మి నిస్సంకోచంగా అన్నది.

రోహిత్‌కు తన తలపై ఎవరో సమ్మెటతో కొట్టినట్లు అనిపించింది. అతడు అవాక్కయిపోయాడు. కోపంతో పెదాలు బిగించాడు. భార్య కళ్ళలోకి కోపంగాచూస్తూ అన్నాడు – "నీకు అలాంటి నిర్ణయం స్వయంగా తీసుకొనే అధికారం లేదు"

"ఎందుకు లేదు?"

"మనం హక్కులను, బాధ్యతలను కలిసి పంచుకోవాలన్న విషయం నువ్వు మరచిపోయినట్టుంది"

"మరచిపోలేదు... కాని ఈ బరువు భరించి నా ఉజ్వల భవిష్యత్తును, నా ఆకాంక్షలను నాశనం చేసుకోలేను. నా సౌందర్యానికి హాని కల్గించుకోలేను"

"ఏమిటా వుజ్వల భవిష్యత్తు... ఆకాంక్షలు?" అతడు సీరియస్‌గా అడిగాడు.

రశ్మి కొంచెంసేపు అతని వైపు చూస్తూ వుండిపోయింది. తర్వాత దృఢ మైన స్వరంతో అన్నది–"నేను ప్రపంచ యాత్రకు వెళ్ళబోతున్నాననే విషయం మీకు తెలియదా? ఇలాంటి గొప్ప అవకాశం జీవితంలో మాటిమాటికి వచ్చేది కాదు. ఈ సదవకాశాన్ని వదులు కోవడం నాకు ఇష్టంలేదు"

"తల్లివి కాబోయే సువర్ణావకాశాన్ని కూడా భగవంతుడు నీకు మొదటిసారిగా ఇచ్చాడు. నీవా అవకాశాన్ని తిరస్క రించడం మంచిదా?"

"అలాంటి అవకాశాలు జీవితంలో ఎన్నోసార్లు వస్తాయి"

"అనుకోవడం నీ భ్రమ"

"మీ మనసు స్వార్థంతో, ఈర్ష్యతో ముడుచుకొనిపోయి ప్రతి విషయాన్ని వక్రంగా చూస్తోంది. మీరు ఈ సాకుతో నన్ను ఈ ఇరుకు గదిలో, మీ పరిధిలో బంధించి వుంచాలనుకొంటున్నారు. మీ ఆలోచన చాలా భయంకరమైంది"

"అలా భావించడం నీ పొరపాటు. ప్రేమకు మరోపేరు అనుబంధం. ప్రేమికులు తమమధ్య వున్న అనుబంధం వల్ల పరస్పరం బందీలే"

"మీకు నా ప్రేమలో ఏదయినా లోపం కనిపిస్తే చెప్పండి. మీరొక్కసారి బాగా ఆలోచించండి. మీ కోసం నేను చేయని త్యాగం ఏముంది? ఇంటిని, తండ్రిని, జాగీరును, స్నేహితులను, బంధువులను, జీవితంలోని భోగభాగ్యా లను, సమస్త కోరికలను, ఆశలను వదులుకోలేదా?"

"అయితే ఇప్పుడు నీ గర్భంలో పెరుగుతున్న శిశువును నిర్మూలించేసి, నీ ఆనందాలను, విలాసాలను సఫలం చేసుకోవాలనుకొంటున్నావా?"




"మీ భావుకత నా దృఢ నిశ్చయాన్ని మార్చలేదు"

"నేను కూడా నిన్ని పాపకార్యం చేయ నివ్వను"

"నేను మీ పెంకితనానికి లొంగక పోతే?"

"నేను బతికి వున్నంత కాలం నిన్ను క్షమించలేను" రోహిత్ ఆమె ముందుకు వచ్చి తీవ్రస్వరంతో అన్నాడు.

"మీరు నన్ను బెదిరిస్తున్నారా?"

"బెదిరించడంలేదు. కాని...రాబోయే ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తు న్నాను..."

"అయితే నేను చెప్పేది బాగా వినండి. మీరు ఎప్పుడో వస్తుందని పూహిస్తున్న ప్రళయం వచ్చిపోయింది. ప్రళయం తర్వాత వుండే ప్రశాంతత ఇప్పుడు వుంది" రశ్మి దృఢ స్వరంతో అన్నది.

"ఏమిటి నువ్వంటున్నది?" రోహిత్ పెద్దగా అరవబోయాడు. కాని అరవలేక పోయాడు. అతని గొంతులో ఎన్నో మాటలు మెదిలాయి. కాని ఒక్కటి కూడా బయటికి వినిపించలేదు. అతడు చటుక్కున రశ్మి చెయ్యి పట్టుకొని, ఆమె ముఖంలోకి తీవ్రంగా చూస్తూ అన్నాడు—

"నేను నమ్మను...అలా జరిగే వీల్లేదు. రశ్మి ... ఇప్పుడు నీవు చెప్పిందంతా అబద్ధం అని చెప్పు. నన్ను వుడికించా లని అబద్ధం చెబుతున్నావు....కదూ?"

రశ్మి కళ్లు కిందికి వాల్చింది. తన చేతిని విడిపించుకొని కొంచెం పక్కకు జరిగి అన్నది—

"అబద్ధం కాదు....నిజమే!"

ఈ మాటలు విన్న రోహిత్ తనను తాను సంబాళించుకోలేకపోయాడు.

కోపంతో ఊగిపోతూ ఆమె చెంపపై ఛెళ్లున కొట్టాడు.

ఆ దెబ్బకు రశ్మి గడగడ వణికింది. ఆమె కళ్లలో నీళ్లు గిర్రున తిరిగాయి. ఆమె అసహ్యం,కోపం నిండిన చూపులతో భర్తను చూసింది. తన బాధను తనలోనే అణచుకొని పరుగున పడకగదివైపు వెళ్ళింది ... గదిలోదూరి తలుపువేసి గడియపెట్టింది.

రోహిత్ ఆవేశంతో మూసిన తలుపు కేసి చూస్తూ వుండిపోయాడు. తర్వాత సోఫాలో కూర్చున్నాడు.

గదిలో నిశ్శబ్దం వ్యాపించింది. ఇద్దరు మనుషులు వున్నప్పటికీ ఎవరూలేని ఇల్లులా మూగవోయి వుంది. చికాకు, బాధ, చిక్కు సమస్యల మూలంగా రోహిత్ మెదడు మొద్దుబారిపోయింది. అతనికి తెలియకుండానే నిద్రపట్టింది. చాలా సేపటికి చటుక్కున మెలకువ వచ్చింది. కళ్లు తెరిచి చూస్తే గదిలో చీకటి దట్టంగా, భయంకరంగా వ్యాపించివుంది.

రోహిత్ రిస్టువాచీలో టైము చూశాడు. రెండు గంటలు! ఇప్పుడు అతని మనసు కొంచెం తేలికపడింది. బెడ్‌రూము వైపు చూశాడు. మూసివున్న తలుపులు అతనికి జరిగిన విషయాలు గుర్తుచేశాయి.

మనసులో చాలా బాధపడ్డాడు. రశ్మిపై చేయిచేసుకొన్నందుకు పశ్చాత్తాప పడ సాగాడు. తన తొందరపాటుకు రశ్మిని క్షమాపణ అడగాలనుకొన్నాడు.

అనుకున్నదే తడవుగా లేచి పడక గది తలుపు దగ్గరికి వెళ్ళాడు. తలుపు కొంచెం తెరచి వుంది.

బహుశా రశ్మి తనకు నచ్చజెప్పాలని తన దగ్గరికి వచ్చి వెళ్ళిందేమో, తనకొరకు నిరీక్షిస్తూ అలాగే మంచంపై నిద్రపోయిం

దేమో!

మెల్లగా నడిచి రశ్మి మంచం దగ్గరికి వెళ్ళాడు. ఆమెను ఏమని పలకరించాలా అని ఆలోచిస్తున్నాడు. ఆమె కోపాన్ని ప్రేమగా మార్చగలిగే మాటలకోసం ఆలోచిస్తున్నాడు.

మంచంమీదికి వంగి ఆమెను తట్టి లేపబోయాడు.

అంతే!

"రశ్మి" అని పెద్దగా అరచాడు.

వెంటనే గదిలో లైటు వెలిగించాడు.

రశ్మి మంచంమీద లేదు. దుప్పటి మడతలు ఆమె మంచంమీద చాలా సేపు ఇటూ అటూ పొర్లిందని తెలుపుతున్నాయి. బాత్ రూంలోకి చూశాడు. అక్కడాలేదు. వంట గదిలోనూ, బయట కూడా లేదు. చివరకు నిరాశగా వచ్చి సోఫా మీద కూర్చున్నాడు.

అతనికి బల్లమీద మడిచివున్న ఒక కాగితం కనిపించింది. వణుకుతున్న చేతితో జాబు తీసి చదివాడు.

"రోహిత్‌గారూ!

నేను మీ ప్రశాంత జీవితాన్ని అశాంతిమయం చేశానని ఈరోజే తెలుసుకొన్నాను. ఈ సంఘటన తర్వాత మనం కలిసి వుండలేము. అందుకే నేను శాశ్వతంగా మీకు దూరంగా వెళ్ళిపోతున్నాను— రశ్మి"

జాబులోని సంబోధనలోనే రశ్మికి, రోహిత్‌కు మధ్య దూరం ఎక్కువైందని తెలిసిపోయింది.

రోహిత్ గుడ్లప్పగించి ఆ జాబునే చూస్తున్నాడు. దాన్ని నాలుగైదుసార్లు చదివాడు. అతని మెదడు రంగుల రాట్నంలా గిరగిర తిరుగుతోంది.

* * *

చేతన్ తలుపుతెరిచి వాకిట్లో నిలబడ్డాడు. అతనిని చూసిన రోహిత్‌కు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది. అతని ముఖం కాంతివంతమయింది. అతన్ని లోపలికి ఆహ్వానిస్తూ రోహిత్ అన్నాడు—

"రా చేతన్...ఇలా కూర్చో"

"మీరు నన్ను పిలిచారా?"

"అవును"

"ఎక్కడికి ప్రయాణం?" గదిలో ప్యాక్ చేయబడివున్న వస్తువులను చూసి చేతన్ అడిగాడు.

"దీనాపూర్ వెళ్తున్నాను. స్టేషన్ మాస్టరుగా పోస్టింగ్స్ అక్కడికే ఇచ్చారు. ఈరోజే వెళ్తున్నాను"

"రశ్మి కోసం ఎదురు చూడరా?"

"వెళ్ళి ఒక నెల గడిచిపోయింది. వచ్చేటట్లయితే ఈపాటికి వచ్చివుండేది"

"మీరు వెళ్ళి బతిమాలితే రావాలన్న పంతంతో వాళ్ళ నాన్నగారి దగ్గర వుండిపోయిందేమో!"

"నేను అక్కడికి వెళ్ళనని ఆమెకు బాగా తెలుసు"

"మీరు జాబు అయినా రాశారా?"

"ఒకటి రెండు కాదు... నాలుగు జాబులు రాశాను. ఒక్కదానికి కూడా జవాబు లేదు"

"నాదొక చిన్న సలహా"

"ఏమిటది?"

"మీరు పరిస్థితులను అర్థం చేసుకొని ముందడుగు వేయండి. మీరు ఒక్కపర్యాయం స్వయంగా ఆమె దగ్గరికి వెళ్ళండి. ఆమె స్వాభిమానం, పంతం పటాపంచలై, కోపం కాస్తా మంచులా కరిగిపోతుంది"

"నాకు నమ్మకంలేదు చేతన్...అహం

కారి అయిన తండ్రి, స్వార్థపరుడైన బావ ఆమెను నా దగ్గరికి రానివ్వరేమో?"

"ప్రయత్నం చేయండి. ఒకసారి ప్రయత్నిస్తే ఆమె అభిప్రాయాలు కూడా తెలిసిపోతాయి"

"వాళ్ళందరి ఎదుట రశ్మి కనుక నా దగ్గరకు రానని అంటే నా జీవితం దుర్భరం ఔతుంది"

"మీ ఇద్దరి మొండితనమే మిమ్మల్ని దూరం చేస్తుంది"

"అందుకే ఈ నగరం వదలిపెట్టి దూరంగా పోతున్నాను. ఇక్కడి హడావిడికి, ఆడంబర జీవితానికి దూరంగా వుండి మనసును కొత్త వుద్యోగంలో నిమగ్నం చేయాలనుకొంటున్నాను. పరిసరాలు మారితే ఎంత గొప్ప బాధ అయినా తగ్గిపోతుంది"

"ఈ మార్పువల్ల మీ మనోవేదన మాసిపోతుందని మీరు పూర్తిగా నమ్ముతున్నారా?"

రోహిత్ మౌనం వహించాడు. అతడు చేతన్ వైపు నిస్పృహగా చూశాడు. చేతన్ కళ్ళలో రోహిత్ పట్ల పూర్తి సానుభూతి వుంది. కాని అతని సమస్యకు జవాబు లేదు. ప్రసంగం మారుస్తూ రోహిత్ అన్నాడు–

"మీతో ఒక చిన్న పని వుండి పిలిపించాను"

"ఏమిటా పని?"

"నేను నాకు అవసరమైన సామాన్లు మాత్రమే తీసుకొని పోతున్నాను... మిగిలినవి మీ దగ్గర వుంచి వెళ్తాను"

"ఎందుకని?"

"రశ్మి వస్తే ఆమెకు ఇచ్చేయండి. వుంచిపోయే వస్తువుల్లో చాలా భాగం ఆమెవే"

"రోహిత్ ... ప్రేమను ఇలా పంపకాలు చేయవద్దు. ఒకనాటికి ఆమె తప్పకుండా నీ దగ్గరికి వస్తుందని నాకు పూర్తి విశ్వాసం వుంది"

"పూలతోట పాడయిపోయిన తర్వాత వసంతం వచ్చినా ఏమి లాభం చేతన్ బాబూ? అప్పటికి నేను ఎక్కడ వుంటానో,ఎలా వుంటానో! ఈ లోకాన్నే వదిలి పోతానేమో...ఎలా చెప్పగలను?" రోహిత్ నిరాశగా గోడవైపు చూస్తూ వేదాంతిలా అన్నాడు.

"అలా నిరాశగా మాట్లాడవద్దు రోహిత్...గోడకు వున్న ఆ పెయింటింగును చూశావా? రశ్మి దానిని నీ పుట్టిన రోజుకు ప్రెజెంట్ చేయాలని ఎంతో శ్రద్ధగా, ఎన్నో గంటలు శ్రమపడి వేసింది ... అంతేకాదు – ఈ టేప్ రికార్డరును..."

"ఏ సందర్భంలో కొన్నది?"

"తెలుసుకోవాలనుకొంటున్నావా?"

"ఊ..." రోహిత్ తలవూపాడు.

చేతన్ నాలుగడుగులు ముందుకువేసి తెచ్చిన విధంగానే వున్న టేప్‌రికార్డరును అట్టపెట్టెలో నుండి బయటికి తీశాడు. దాని వెనకవైపు గుండ్రంగా రాయబడి వున్న అక్షరాలను చూపిస్తూ అన్నాడు –

"ఇక్కడ ఏమి రాసివుందో చదువు."

రోహిత్ వెళ్ళి దానిమీద రాసి వున్న మాటలు చదివాడు–

"అత్యంత ప్రీతిపాత్రుడైన నా రోహిత్‌కు ప్రథమ వివాహ వార్షికోత్సవ సందర్భమున ప్రేమతో...రశ్మి"

ఆ వాక్యాలు చదివిన రోహిత్ మనసు విపరీతమైన బాధతో విలవిలలాడింది. అతని ధమనుల్లో రక్తం పొంగి ప్రవహించినట్లయింది. గుండె అతి వేగంగా

కొట్టుకోసాగింది అతడు కళ్లు మూసుకొని శక్తి లేనివాడిలా సోఫాలో కూలబడ్డాడు.




ఎన్నో మధురమైన, చేదైన అనుభవాలను జ్ఞాపకాలుగా మార్చుకొని రోహిత్ దీనాపూర్ వెళ్ళాడు. ఏకాంత, ప్రశాంత వాతావరణంలో కొండల మధ్య లోయలో వున్న ఆ రైలు స్టేషన్‌కు రోహిత్ స్టేషన్ మాస్టరుగా వెళ్ళాడు. తన బాధను, తన గాథను ఎవరితోనూ చెప్పుకోలేదు.

రశ్మిని గురించిన మధుర స్మృతులతో, ఆమెతో గడిపిన దినాలను, ఆమె సద్గుణాలను, నిర్మల ప్రేమను స్మరిస్తూ అజ్ఞాతంగా, పరిచితులకు దూరంగా రోజులు గడపాలని అతడు నిర్ణయించుకొన్నాడు. రాత్రింబవళ్ళు ఏదో ఒక పనిలో నిమగ్నమై వుండేవాడు. డ్యూటీ పూర్తయిన తర్వాత కూడా ఏదయినా ఆఫీసు పని చేస్తూ కాలం గడిపేవాడు. డ్యూటీ పట్ల అతడు చూపించే శ్రద్ధ, క్రమశిక్షణ అధికారుల ప్రశంసలు పొందాయి. ఎప్పుడైనా తీరిక దొరికితే అతడు ఇంట్లో నాలుగు గోడల మధ్య వుండటం సంభవిస్తే రశ్మిని గురించిన జ్ఞాపకాలు అతని మనసులో నిండిపోయేవి. ఆ జ్ఞాపకాలే ఇప్పుడతనికి మానసికానందాన్ని, తృప్తిని కలిగించే నిధులయ్యాయి.. ఆ జ్ఞాపకాలే రశ్మిలేనిలోటును తీర్చే సాధనాలయ్యాయి. రశ్మియొక్క ప్రతి వస్తువులోనూ ఆమె నిర్మల ప్రేమే కనిపిస్తోంది. వాటిని చూస్తుంటే రశ్మి లేని లోటు అతనికి తీరని వేదనను కలిగిస్తోంది. ఆమెతో గడిపిన ప్రతిక్షణం అతని కన్నుల ఎదుట చెరగని చిత్రంగా నిలిచిపోతోంది.

చలికాలపు ప్రాతఃకాలం. పూర్వాకాశం క్షణక్షణం రంగులు మార్చుకొంటోంది. ఇంకా తెల్లవారలేదు. టెలిఫోన్ గంట మోగడంతో రోహిత్ నిద్ర వదిలిపోయింది. అతడు హడావిడిగా మంచంపైనుండి లేచి టెలిఫోన్ రిసీవర్ అందుకున్నాడు. సిగ్నల్‌మాన్ ఫోన్ చేస్తూ ఎవరో పెద్ద రైల్వే అధికారి వచ్చారనీ ఆయన పేరు ఖన్నా అనీ చెప్పాడు. ఖన్నాగారు ఇలా అకస్మాత్తుగా రావడంతో రోహిత్ కొంత ఆందోళన పడ్డాడు. ఆయన ఇంతకు ముందెప్పుడూ ఇలా ముందు తెలపకుండా రాలేదు.

అతడు చకచకా ముఖం, కాళ్ళు, చేతులు కడుక్కొని, డ్రెస్ వేసుకొని స్టేషన్‌కి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. చెప్పులు తొడుక్కొని, బయటికి రాబోతోంటే తలుపు తట్టిన శబ్దం అయింది. రోహిత్ వెంటనే వెళ్ళితలుపు తీశాడు. ఎదురుగా ఖన్నాగారిని చూసి ఆశ్చర్యపోయాడు. ఒక కూలీవాడు సామాన్లు తెచ్చి లోపల పెట్టాడు. నౌకరు చేతిలో ప్రభుత్వ కాగితాలున్న సంచి వుంది.

ఖన్నాగారు పొడవయిన కోటు, తలకు తెల్లని బొచ్చుటోపీ ధరించి వున్నారు. ఆయన భుజానికి ఒక తుపాకి వేలాడుతోంది. 'గుడ్‌మార్నింగ్' బిత్తరపోయి తనను చూస్తున్న రోహిత్‌ను ఖన్నాగారే ముందుగా పలకరించారు.



"గుడ్‌మార్నింగ్ సర్... మీరు ఇలా అకస్మాత్తుగా... ఉదయాన్నే..." అతను ఆగి ఆగి అడిగాడు.

"డోంట్ ఫియర్ మై బోయ్! నేను ఇన్‌స్పెక్షన్ చేయడానికి రాలేదు. మీకు గెస్ట్‌గా వచ్చాను"

"అది నా అదృష్టం... రండి రండి! లోపలికి రండి" అన్నాగారు లోపలికి వచ్చారు. నౌకరు ఆయన సామాన్లు ఒక మూలన సర్ది పెట్టాడు. అన్నాగారు తుపాకిని నౌకరుకు అందించి ఈజీ చెయిర్‌లో కూర్చుంటూ అన్నారు—

"సుందర్ బాన్స్‌లో వేటకని వెళ్ళాను. దారిలో జీపు చెడిపోయింది. దీనాపూర్ నుండి పాట్నా ఎక్స్‌ప్రెస్‌లో వెళ్దామని వచ్చాను"

"అది మధ్యాహ్నం వస్తుంది సార్! కాని ఇక్కడ ఆగదే?"

"ఇక్కడ ఆగే ఏర్పాటు చేశాను. పాట్నా స్టేషనుకు ఫోన్‌చేసి చెప్పాను"

"అయితే ఫరవాలేదు. మీకేమి కావాలో చెప్పండి తెప్పిస్తాను."

"ముందు ఒక కప్పు టీ కావాలి."

"వుంచండి... రెండు నిముషాల్లోచేసి తెస్తాను"

"నువ్వు శ్రమపడవద్దులే...రఫీ!'' ఆయన పక్కకుతిరిగి నౌకరును పిలిచాడు.

రోహిత్ రఫీకి వంటగదిలోని వస్తువు లన్నీ చూపించి తర్వాత ఖన్నాగారి దగ్గరకు వచ్చి కూర్చున్నాడు. ఖన్నా సాహెబ్ ఇంటిని పరిశీలనగా చూస్తూ అడిగాడు—

"ఇంకా భార్యా పిల్లలను పిలుచుకొని రాలేదా?''

''లేదుసార్.భార్య పుట్టింటికి వెళ్ళింది. పిల్లలు ఇంకా పుట్టలేదు.''

"ఓహ్....అదాసంగతి. మీరు ఇప్పటి నుండే ఫామిలీప్లానింగ్ పాటిస్తున్నారన్న మాట''

జవాబుగా రోహిత్ చిన్నగా నవ్వాడు.

ఇంతలో రఫీ ట్రేలో టీ తెచ్చి వాళ్లకు అందించాడు. ఇద్దరూ కప్పులు అందుకొని వేడి వేడి టీ తాగుతున్నారు. ఖన్నాగారు స్నానానికి నీళ్లు కాయమని రఫీకి చెప్పారు.

"మీరు ఏమేమి వేటాడారు?" రోహిత్ ఒక గుక్క టీ తాగి అడిగాడు.

"రెండు కుందేళ్ళు, ఒక నక్క, ఒక జింక"

"అంతేనా! చిరుత పులులు, పెద్ద పులులు వేటాడలేదా?"

"ఒక చిరుతపులిని వేటాడాము.



దాన్ని నా స్నేహితుడు చంపాడు"

"మీ స్నేహితుడా?"

"అవును. అడవిలో ఒంటరిగా ఎప్పుడూ వేటాడకూడదు. చాలాకాలం తర్వాత నా బాల్య స్నేహితుడొకడు ఆహ్వానించాడు. ఒకవారం సెలవుపెట్టి అతనితో కలిసి హాయిగా కాలం గడిపాను. అతని సహచరులు ఇంకా అడవి లోనే వున్నారు''

''ఎక్కడ వున్నారు?''

"ఇక్కడికి ఇరవై మైళ్ళ దూరంలో వున్నారు. నా బాల్య మిత్రుడెవరోకాదు- కాశీపూర్ జమీందారు దీవాన్ సర్దారీ లాల్"

''దీవాన్ సర్దారీలాలా! కాశీపూర్ జమీందారా?'' రోహిత్ ఆశ్చర్యంగా ఆయనవైపు చూస్తూ అన్నాడు.

''ఆ...అతనే! నీకు తెలుసా?''

''తెలియదు. కాని ఆయన పేరు విన్నాను'' అతడు కలవరపడ్డాడు. కొన్ని క్షణాలాగి అన్నాడు – "మా మామ కూతురు, ఆయన కూతురు క్లాస్‌మేట్సు"

"నువ్వు చెప్పేది రశ్మిని గురించా?''

"ఆ....అమ్మాయి మీకు తెలుసా?''

"బాగా తెల్సు. నేను చిన్నప్పటినుండి ఆ అమ్మాయిని ఎరుగుదును. కాని నా స్నేహితునికి సంతానం వలన సుఖం లేదు''

''ఎందుకని?''

''పెద్దమ్మాయికి పెళ్ళి చేస్తే పెళ్లి అయిన రెండేళ్ళకే చనిపోయింది. చిన్న మ్మాయి...'' అంటూ అర్ధాంతరంగా ఆగి పోయారు.

''ఏమయింది రశ్మికి?''

''తండ్రి ఇష్టానికి విరుద్ధంగా ఎవడినో పెళ్ళి చేసుకొందట. తర్వాత విచారిస్తే వాడు వట్టి వెధవ అని తెలిసింది. వట్టి

వెధవేకాదు- తాగుబోతు, జూదగాడు, జులాయి కూడా''

''అని మీతో ఎవరన్నారు?"

"దీవాన్‌గారు"

''ఇప్పుడు రశ్మి ఎక్కడ వుంది?''

''భర్తను వదిలిపెట్టి వచ్చి తండ్రి ఇంట్లో వుంటోంది. ఆ అమ్మాయి ఆరోగ్యం కూడా పాడయిపోయింది"

''ఇప్పుడెలా వుంది?"

"కొంచెం బాగుంది. ఆమెకు వుల్లాసం కలిగించే వుద్దేశంతోనే దీవాన్‌గారు ఈ వేట ప్రోగ్రాం ఏర్పాటుచేశారు. ఆమెకు మానసిక విశ్రాంతి, పరిసరాల మార్పు అవసరం అని డాక్టర్లు చెప్పారు''

"మార్పు..ఆమెకు మానసిక విశ్రాంతి కలుగజేయగలిగిన వ్యక్తి ఆమె భర్త ఒక్కడేనేమో" రోహిత్ అన్నాడు.

''ఆ దుర్మార్గుని పేరు వింటేచాలు ఆమె మండిపడుతోంది. దీవాన్‌గారు అతన్ని పిలిపించారు. కాని రాలేదు. పైగా దీవాన్‌జీని బ్లాక్‌మెయిల్ చేయసాగాడు. ఆయన జాగీరులో భాగం కావాలని డిమాండు చేస్తున్నాడు''

''నేను నమ్మను!"

''ఎందుకు నమ్మవు?"

''కారణం చెప్పలేను....కాని నమ్మను. అతని తప్పేమీ వుండదనీ, మోసంతో ఆమె మనసు విరిచారనీ నాకు అనిపిస్తోంది. అదలా వుండనివ్వండి. మీరేం సలహా ఇచ్చారు?'' రోహిత్ గంభీరంగా అడిగాడు.

"ఇవ్వదగిన సలహాయే ఇచ్చాను. విడాకులు తీసుకోవడం మంచిదని చెప్పాను"

''విడాకులా...విడాకులు తీసుకోవడం అంత సులభంకాదే" రోహిత్ ఒళ్ళంతా చెమట పట్టింది.

"డబ్బున్నవాళ్ళకు అన్నీ సులభమే" ఆయన నవ్వుతూ అన్నారు.

రఫీ వచ్చి వేడినీళ్ళు సిద్ధంగా వున్నాయని చెప్పాడు.

ఖన్నాగారు స్నానానికి వెళ్ళారు. రోహిత్ మరో ప్రపంచంలో తన వునికినే మరచి విహరిస్తున్నాడు. అతనికి తానొక సుడిగుండంలో చిక్కుకుని గిరగిర తిరుగుతున్నట్లుగా వుంది. ఖన్నాగారి మాటల ద్వారా తన జీవితంలో సంభవించబోయే తుఫాను ఎలా ఉండేదీ తెలిసిపోయింది.

ఖన్నాగారు మధ్యాహ్నం రైలులో వెళ్ళిపోయారు. రశ్మి ఆరోగ్యం సరిగా లేదన్న వార్త రోహిత్‌ను మాటిమాటికీ కలతపెడ్తోంది. రశ్మిని చూడాలనీ, ఆమెను పరామర్శించాలనీ తొందర పడుతున్నాడు. దీవాన్‌గారు కైలాష్ సహకారంతో రశ్మిని మభ్యపెట్టి తనకు విరోధిగా మారుస్తారనీ, తనపట్ల ఆమె మనసులో ద్వేషభావం పెంచుతారనీ భయపడుతున్నాడు. వాళ్ళ నిర్ణయాలు తన జీవితాన్ని నిలువునా దహించివేస్తాయి. రశ్మి మౌనం వెనక ఆమె తండ్రి, బావల కుట్ర తప్పక వుంటుందని కూడా అతడు అనుమానిస్తున్నాడు. తాను రాసిన జాబులు రశ్మికి చేరివుండవు. ఆమె రాసిన జాబులు కూడా పోస్టాఫీసును చేరివుండవు. వాటిని మధ్యలోనే చించివేసి వుంటారు. ఇలాంటి రకరకాల ఆలోచనలు రోహిత్ మనసును చికాకు పరుస్తున్నాయి.

సుందరవనం అక్కడికి ఇరవైమైళ్ళ దూరంలో వుంది. రశ్మిని ఒకసారి కలిసి మాట్లాడాలనే కోరిక రోహిత్‌లో క్షణ క్షణానికి అధికం కాసాగింది. ఆమెను స్వయంగా కలిసి ఆమె వుద్దేశం ఏమిటో,

ఆమె నిర్ణయం ఏమిటో ఆమె నోటి గుండా చెవితే వినాలనుకొంటున్నాడు. రశ్మి తనను తప్పుగా అర్థం చేసుకొని తనకు శాశ్వతంగా దూరం అయిపోతే తన జీవితం చాలా దుర్భరం అయిపో తుంది. అలా జరగనివ్వకూడదు. అయితే రశ్మి స్వయంగా తమ ప్రేమ బంధాన్ని తెంచివేసి మరొకరిని వివాహం చేసుకోవాలని నిర్ణయించుకుంటే ఆమెను ఆ నిర్ణయంనుండి ఎవరు మార్చగలరు? దీవాన్‌గారు కుట్రపన్ని తమ మధ్య అయిష్టతను పెద్ద అడ్డుగోడగా కట్టారు. ఆ గోడ రశ్మిని తనకు శాశ్వతంగా దూరం చేస్తుందేమో ... రోహిత్ గంటలకొలది ఇలా ఆలోచిస్తూ గడిపేవాడు ... కాని ఒక నిర్ణయానికి రాలేకపోయేవాడు.

ఆ సాయంత్రమే ఖన్నాగారు ఫోన్ చేశారు. జీపుకు అవసరమైన స్పేర్ పార్టును గూడ్సు డ్రయివర్ ద్వారా పంపుతున్నాననీ, దానిని ఎవరిద్వారా నయినా సుందరవనంలో వున్న తన జీపు డ్రయివర్‌కు పంపమనీ చెప్పారు.

రెండుగంటల తర్వాత రోహిత్‌కు ఆ స్పేర్ పార్టు అందింది. దానిని టాక్సీలో ఎవరిద్వారా పంపాలా అని ఆలోచిస్తున్నాడు. అంతలో అతనికి ఒక ఆలోచన వచ్చింది. తానే స్వయంగా ఆ స్పేర్ పార్టును తీసికొని వెళితే....? ఖన్నాగారి పని జరిగినట్లవుతుంది. తాను రశ్మిని కలిసి మాట్లాడి రావచ్చు.

అతడు వెంటనే సుందరవనానికి ప్రయాణ మయ్యాడు.

అతడు సుందరవనం చేరేసరికి అర్థరాత్రి కావస్తూంది. దీవాన్‌గారి అనుచరులు నిజంగానే అడవిని చిన్న గ్రామంగా మార్చివేశారు.

చుట్టూ డేరాలు వేయబడి ఉన్నాయి. వాటి మధ్యలో పెద్ద మంట. ఆ చలి మంట చలిగాలిని పారదోలుతూ, అక్కడి మనుషులకు వెచ్చదనాన్ని కలిగిస్తోంది. అడవిలో ఉంటున్న లంబాడీలు అతిథుల వినోదం కోసం ఢోలక్ వాయిస్తూ, నృత్యం చేస్తున్నారు. చుట్టూ ఐశ్వర్యంతో కూడిన వాతావరణం కనిపిస్తోంది. అందరూ పాటలు వింటూ నాట్యం తిలకిస్తున్నారు.

రోహిత్ ఒక డేరాను ఆనుకొని నిల బడ్డాడు. ఢోలక్ శబ్దం, కాలి గజ్జెల శబ్దం కలిసి అక్కడి వాతావరణంలో వింత అనుభూతి నిండుకొంది. బిజిలీ బాగా తాగి ఒళ్లు తెలియకుండా నాట్యం చేస్తోంది. ఆమె శరీరం మంట వెలుగులో మెరిసి పోతూంది. ఆమె అర్ధనగ్న శరీరంపై చెమట బిందువులు ముత్యాల్లా మెరుస్తు న్నాయి. రోహిత్ మెల్లగా నడిచి రశ్మి బాగా కనిపించే ప్రదేశంలో వెళ్ళి నిల బడ్డాడు. రశ్మి దీవాన్‌గారికి, కైలాష్‌కు మధ్య కూర్చుని నాట్యాన్ని ఎంతో ఆసక్తిగా చూస్తోంది. ఆమె ముఖం చూస్తుంటే ఆమెలో గత జీవితపు విషాద ఛాయలు బొత్తిగా లేనట్లు, ఇప్పటి ఐశ్వర్యంవల్ల కలిగిన సుఖసంతోషాలకు ఆమె పూర్తిగా వశమయినట్లు అనిపిస్తోంది.

రశ్మి భుజాల మీదవున్న శాలువ కింద పడింది. కైలాష్ దాన్ని తీసి రశ్మికి అందించాడు. రశ్మి అతనివైపు చూసి కృతజ్ఞతాపూర్వకంగా చిన్నగా నవ్వింది. కైలాష్ దగ్గర్లోనే ఉన్న గ్లాసు అందుకొని అందులోని ద్రవం రెండు గుక్కలు తాగాడు. తాగుతూ రశ్మిని కూడా తాగమన్నట్లుగా గ్లాసు ఆమె నోటి దగ్గరికి తెచ్చాడు. ఆమె తిరస్కార

సూచకంగా తల, చెయ్యి వూపింది. తర్వాత అతని చేతిలో ఉన్న గ్లాసు లాక్కుని మిగిలిన ద్రవం కింద పార బోసింది. కైలాష్ ఆమెను వారించలేదు. ఆమె వైపు చూసి చిన్నగా నవ్వాడు. కైలాష్ రశ్మిల మధ్య పెరుగు తున్న ఈ స్నేహాన్ని, అనుబంధాన్ని చూసిన రోహిత్ తాను మంటలో కాలి పోతున్నట్లుగా ఫీలయ్యాడు. గుండెల్లో ఎవరో వాడి కత్తి గుచ్చినట్లుగా బాధ పడ్డాడు. సంతోషపు ఘడియలు ఎంత అల్పమైనవో, విషాదపు ఘడియలు ఎంత దీర్ఘమైనవో అతనికి అనుభవపూర్వకంగా తెలిసింది. అతనికి టేప్‌లో రికార్డు చేసిన పాట మనసులో మెదిలింది.

బిజిలీ నాట్యం అయిపోయింది. అతిథులు తమ తమ డేరాలకు, పల్లె వాసులు తమ గుడిసెలకు వెళ్ళారు. మంట ఆరిపోయి ఎర్రని నిప్పులు మాత్రం మిగిలాయి. రశ్మి ఇంకా అక్కడే కూర్చుని రగులుతున్న నిప్పు కణాలను చూస్తోంది. దీవాన్‌జీ, కైలాష్ ఏదో విషయంపై చిన్నగా మాట్లాడు కొంటున్నారు. రశ్మి అక్కడి మసక వెలుగులో చాలా అందంగా కనిపిస్తోంది. దీవాన్‌గారు ఆమెను డేరాలోకి వెళ్ళమని చెప్పారు.

"నాకు నిద్ర రావడం లేదు. కొంచెం సేపు కూర్చుని మీతోపాటు వస్తాను"

అయిదు నిముషాలు గడిచాయి. కైలాష్ దీవాన్‌గారిని చిన్నగా నడిపించు కొని డేరాలోకి తీసుకొని వెళ్లాడు. రశ్మి తాను కూర్చున్న చోటునుండి లేచి ఇనుప కడ్డీతో నిప్పులను కదిలిస్తోంది.

అప్పటికి రోహిత్ మనసులో ఆత్మ విశ్వాసం కలిగింది. భయం తగ్గి కొంత ధైర్యం వచ్చింది. అతడు మెల్లగా నడిచి మంట దగ్గరికి వెళ్ళాడు. తన వెనుక అడుగుల శబ్దం విని రశ్మి అడిగింది–"నాన్నగారు నిద్రపోయారా?"

రోహిత్ మౌనంగా ఉన్నాడు. ఆమె తన వెనక కైలాష్ ఉన్నాడనుకొని ఈ ప్రశ్న అడిగింది అని అతడు గ్రహిం చాడు. తన ప్రశ్నకు జవాబు లేక పోవడంతో ఆమె వెనక్కి తిరిగి చూసింది.

ఎదురుగా రోహిత్‌ను చూసి అవాక్కయి బిత్తర చూపులు చూసింది. తర్వాత రెప్పలు టపటపలాడించి నమ్మ లేనిదానిలా తాను చూస్తున్నది కలయో నిజమో తెలియనిదానిలా అయోమయంగా చూసింది.

"రశ్మి..." రోహిత్ ఆమెను ఈ లోకంలోకి తేవాలని ప్రయత్నిస్తూ పిలిచాడు.

"మీరా ... మీరిక్కడికి ఎందుకు వచ్చారు?'' రశ్మి చికాకు పడుతూ అడిగింది.

"నిన్ను చూడాలని"

"నన్ను చూడటం ఎందుకు?"

''నేనెవరో, నువ్వెవరో, మన ఇద్దరికీ వున్న సంబంధం ఏమిటో నేను మళ్ళీ చెప్పాలా?"

"ఆ బంధం తెగిపోయింది"

"నేను తెగిన బంధాన్ని మళ్ళీ కలపా లనే వచ్చాను''

"ఒకసారి చేసిన పొరపాటు నేను మళ్ళీ చేయదల్చుకోలేదు"

"నేను చేసిన ఒక చిన్న పొరపాటుకు నువ్వు ఇంత పెద్ద శిక్ష విధిస్తున్నావా?"

"అవును....నిష్కారణంగా మీరు ఇతరులకు శిక్షలు విధించకుండా వుండా లనే ఇలా చేశాను" ఆమె కంపిస్తున్న

స్వరంతో ఈ మాటలు అని తల విదిలించి డేరాలోపలికి వెళ్ళింది.

ఆమెను పిలుస్తూ వెంబడి వెళ్ళిన రోహిత్ డేరాలోపలి దృశ్యం చూసి తక్షణ ఆగి పోయాడు. దీవాన్‌గారు నోట్ల కట్టను కైలాష్‌కు ఇస్తున్నారు.

ఎదురుగా రోహిత్‌ను చూసి ఇద్దరూ సిగ్గుపడ్డారు. రశ్మి డేరాలోపలి భాగం లోకి వెళ్ళింది. దీవాన్‌జీని, కైలాష్‌ను చూసిన రోహిత్ మొదట కొంత భయపడ్డాడు గాని వెంటనే సంబాళించుకొన్నాడు. తనకు ఎదురయ్యే ఏ పరిస్థితినైనా ఎదుర్కొవడానికి అతడు సిద్ధంగా వున్నాడు.

"నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు?'' దీవాన్‌జీ కటువుగా అడిగారు.

"ఖన్నాగారి జీపుకోసం స్పేర్ పార్టు తెచ్చాను"

"మోటార్ మెకానిక్ పని చేస్తున్నావా...?" దీవాన్‌గారి ప్రశ్నలో వ్యంగ్యం వుంది;

"లేదు...దీనాపూర్ రైల్వే స్టేషన్ మాస్టరుగా పనిచేస్తున్నాను"

"నువ్వు రశ్మికి ఈ విషయం జాబు అయినా రాయలేదే!"

"నాలుగు జాబులు రాశాను. కాని ఒక్కటి కూడా ఆమెకు అందినట్టు లేదు"

ఈ మాటలకు దీవాన్‌గారు, కైలాష్ ఒకరి ముఖాన్నొకరు చూడసాగారు.

"నువ్వు ఎందుకు వచ్చావు? నీకేం కావాలి??'' దీవాన్‌గారు నిర్లక్ష్యభావంతో అడిగారు.

"నేను రశ్మిని తీసుకొనిపోవాలని వచ్చాను'' అతడు రశ్మి వెళ్ళినవైపు చూస్తూ అన్నాడు.

"ఆమె నీ వెంట రాదు"

"ఎందుకు రాదు?"

"నేను నా చేతులతో నా కుమార్తె బతుకు పాడుచేయలేను"

"నేను మీ కుమార్తె విషయంకాదు-నా భార్య విషయం మాట్లాడుతున్నాను"

"నువ్వు మమ్మల్ని ఇబ్బంది పెట్టాలని వచ్చావా?"

"కాదు....మీరే నా పట్ల అయిష్టత పెంచుకొని పెంచిపెట్టుకొని, మీ కుమార్తె జీవితాన్ని నాశనంచేయదలుచుకొన్నారు''

"ఈ నిర్ణయం నేను చేసింది కాదు... రశ్మి స్వయంగా చేసింది"

"ఏమిటా నిర్ణయం?"

"ఆమె నీ నుండి విడాకులు తీసుకోవాలనుకుంటోంది" దీవాన్‌గారు చాలా కోపంగా అన్నారు.

"అయితే మీరేమనుకొంటున్నారు?"

"నా కూతురు భవిష్యత్తును, సుఖాన్ని కోరి నేను కూడా ఆ పనే చేయడానికి ఇష్టపడుతున్నాను"

"మీకు మీ కూతురు యొక్క మంచి భవిష్యత్తు, సుఖ సంతోషాల కంటే ధనవంతుడైన అల్లుడు కావాలనే కోరిక ఎక్కువగా వున్నట్లుంది" కైలాష్ వైపు చూస్తూ రోహిత్ అన్నాడు.

"యూ...షటప్" కైలాష్ కోపంతో కేక వేశాడు.

"మాటలు జాగ్రత్తగా రానీయండి కైలాష్ బాబూ! ఆరోజులు గతించి పోయాయి. నేను మీ దగ్గర పనిచేస్తున్నపుడు నా పైన నేరం ఆరోపించి నన్ను హంటరుతో కొట్టారు. కాని ఇప్పుడు మీ బెదిరింపులకు భయపడను"

కైలాష్ ఆవేశంతో ఒకపక్కన తగిలించి వున్న హంటరును అందుకున్నాడు. కాని రోహిత్ చురుకుగా

ముందుకు దూకి అతని చేతిలోని హంటర్ లాక్కొన్నాడు. దీవాన్‌గారు బిత్తర పోయి అటు ఇటు చూడసాగారు. అంతలో రశ్మి వాళ్ళ మధ్యకు వచ్చింది. ఆమె పెద్దగా అరచింది- ''ముందు ఆ హంటర్ పారవెయ్యి.''

రోహిత్ నిర్లక్ష్యంగా హంటరును ఒక వేపుకు విసిరేశాడు. కైలాష్ అవమానంతో అక్కడినుండి వెళ్ళిపోయాడు. అక్కడ కొంచెంసేపు నిస్తబ్దత వ్యాపించింది.

రోహిత్ రశ్మి ముఖాన్ని పరిశీలనగా చూస్తూ ఆమె మనసును గ్రహించే ప్రయత్నం చేస్తున్నాడు. ఆమె ముఖంలో ఆ నిముషంలోనే ఎన్నో రంగులు మారాయి.

"మీకు సుఖశాంతులతో జీవించడం ఇష్టం లేదా?" అక్కడి నిశ్శబ్దాన్ని ఛేదిస్తూ రశ్మి అడిగింది.

"ఇష్టమే... కాని అందుకు నీ సహకారం కావాలి''

''మీరు, నేను ఇకపై కలిసి వుండటం జరగని పని.''

"ఇంకొక్క అవకాశం ఇవ్వు...నీ స్వేచ్ఛకు నేను ఏ విధంగానూ అడ్డురాను. నీవు ఏం చేయదలచుకుంటే ఆ పని చేయవచ్చు, వద్దనుకొంటే మానవచ్చు"

''కాని నేను కేవలం వూహలనే జీవిత పరమావధిగా పెట్టుకొని నిజజీవితాన్ని, దుర్భరం చేసుకోదలచుకోలేదు''

"అలా అనకు రశ్మీ! నా అభ్యర్థనను తిరస్కరించవద్దు. నా ఆశను అడియాస చేయవద్దు"

''నా ఆశలను గురించి మీరు ఎప్పుడయినా ఆలోచించారా? నేను మీ కోసం ఇంటిని, బంధువులను, ఆస్తిని, గౌరవ మర్యాదలను వదలుకొన్నాను. కానీ మీరు మాత్రం..."

''నువ్విప్పుడు ప్రేమను డబ్బుతో తూకంవేయడం ప్రారంభించావు''రోహిత్ రశ్మిని మధ్యలోనే ఆపుతూ అన్నాడు.

''ఆ మాటే నిజం అనుకోండి" ఆమె విసుగ్గా అంది.

"అయితే నేను మూల్యం చెల్లించి అయినా నిన్ను తీసుకొనిపోతాను'' రోహిత్ భావావేశంలో ముందువెనుకలు ఆలోచించకుండా అనేశాడు.

''మీరు నేను కోరినవన్నీ ఇవ్వగలరా? ఈ సుఖం, ఈ విశ్రాంతి. పెద్ద ఇల్లు, నౌకర్లు, కారు ఇంకా...ఇంకా..." ఆమె స్వరం కంపించి తక్కిన మాటలు చెప్పలేకపోయింది.

రోహిత్ వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు. అతడు నిస్సహాయుడయి పోయాడు. కోపంతో వూగిపోతున్న రశ్మిని చూసి ఆశ్చర్యపోయాడు. కొద్ది నెలల్లోనే రశ్మి ఎంతగా మారిపోయింది!

అతడు ఏమి జవాబు ఇవ్వాలా అని ఆలోచిస్తుండగానే లోపలికి వెళ్ళిన దీవాన్ గారు వాళ్ళ మధ్యకు వచ్చి అన్నారు- నీవు రశ్మిని వదులుకొని, ఆమెను ప్రశాంతంగా వుండనివ్వడం మంచిది''

"అంటే విడాకులివ్వమని చెబుతున్నారా!"రోహిత్ కంపిస్తున్న స్వరంతో అడిగాడు.

'అవును ....'అదే మంచిదని మా నిర్ణయం. ఒక నెల లోపల నీవు నీ అంగీకారం తెలపకుంటే కోర్టుద్వారా నయినా విడాకులు తీసుకొంటాము" దీవాన్‌గారు తమ నిర్ణయంతెలిపారు.

రోహిత్ ఆయనకు ఏమీ సమాధానం చెప్పకుండా రశ్మివేపు చూశాడు. ఆమె

తల వంచుకొని వుంది. తలెత్తి అతని ముఖంలోకి చూడలేకపోయింది. ఆ మౌనం ఆమె కూడ తన తండ్రినే సమర్థిస్తోందని తెలుపుతోంది.

రోహిత్ నిరాశగా డేరా దాటి బయటికి వచ్చాడు. అతనికి తన చుట్టు వ్యాపించి ఉన్న చీకటి, నిస్తబ్దత ఎంతో భయానకంగాకనిపించాయి. రగులుతున్న నిప్పులు ఆరిపోయి బూడిదగా మారుతున్నాయి.

అప్పుడే దూరాన అడవిలో పెద్దగా కూతవేస్తూ సాగిపోతున్న రైలు శబ్దం అతని ఆలోచనలకు బ్రేక్ వేసింది. ఇప్పటి వరకు అతనిలోమిణుకుమిణుకుమంటున్న కొద్దిపాటి ఆశ కూడా అక్కడి నిప్పుల్లాగానే ఆరిపోయి బూడిద అయ్యింది. అతడు గతం నుండి వర్తమానంలోకి వచ్చాడు. వర్తమానం కఠోరంగా, చేదుగా,బరువుగా, భయానకంగా వుంది. అది గతంలోని ఆనందాలను, సుఖాలను సమూల నాశనం చేసింది. గతించిన జ్ఞాపకాలు ఇప్పుడు అవశేషాలు అయ్యాయి. వాటిలో జీవం లేదు....అందం అసలే లేదు.

రోహిత్ చుట్టూ ఒకసారి పరిశీలనగా చూశాడు. అదే దీనాపూర్ స్టేషను.... అదే గది....అదే యంత్రాలు..వాటి గర్ గర్ శబ్దాలు....!అతడు ఒక్కసారి తల విదిలించాడు. తానింతవరకు ఎక్కడ వున్నాడు...?ఇప్పుడు ఎక్కడికి తిరిగి వచ్చాడు....??

అతని మనసును నిరాశ అంధకారంలా కమ్ముకొంది.

* * *

ఏదో ఒకరోజు రశ్మి తన దగ్గరికి తప్పకుండా వస్తుందనే ఆశ రోహిత్ మనసులో ఆరని దీపంలా వుంది. కాని క్రమక్రమంగా ఆ ఆశ సన్నగిల్లుతోంది. ఆశ నిరాశగా మారి సందేహంగా మిగిలిపోయింది. నెల అయిపోవస్తోంది. కాని రశ్మి వచ్చే సూచనలేవీ కనిపించలేదు. ఎదురు చూసి చూసి రోహిత్ కన్నులు అలిసిపోయాయి.

"తప్పంతా నాదేనా? ఇందులో రశ్మి తప్పు లేశమైనా లేదా?" రశ్మిని గురించి ఆలోచించి ఆలోచించి రోహిత్ మెదడు మొద్దుబారిపోయింది. ఆమె తండ్రి ఇచ్చిన గడువులో ఇంక ఒక్కరోజు మాత్రమే మిగిలి ఉంది. రేపటి లోపల తాను గనుక అంగీకారం తెలుపకుంటే వాళ్ళే కోర్టుకు వెళ్ళడానికి సిద్ధంగా వున్నారు.

ఇప్పటివరకు కేవలం రెండు కుటుంబాల సమస్యగా గుట్టుగా వున్న విషయం రేపటి నుండి అందరికీ తెలిసిపోయి చెడ్డ పేరు తెస్తుంది.

తన ప్రేమ ఇలా బజారుపాలు కావడం, అందరూ తన పరాజయాన్ని చూసి పరిహసించడం రోహిత్‌కు భరించలేని విషయంగా వుంది. ఇది అతని జీవితంలోని అతి గొప్ప పరాభవం.దాన్ని భరించడానికి అతడు సిద్ధంగా లేడు. రకరకాల ఆలోచనలు అతని మస్తిష్కాన్ని చికాకు పరుస్తున్నాయి. ఏమీ నిర్ణయించలేని, ఏమీ చేయలేని అయోమయ పరిస్థితిలో వుండిపోయాడు.

దీవాన్ సర్దారీలాల్‌గారి మాటలు అతని చెవుల్లో మారుమోగుతున్నాయి. సింహగర్జనలాంటి ఆయన కఠోర స్వరం అతని మనసును కలచి వేస్తోంది.

"చెప్పు...నువ్వు నా కుమార్తెకు సుఖాన్ని ఇవ్వగలవా? నౌకర్లు...దాసీలు.. కారు ...నేను తగిన సమయం కోసం ఎదురుచూస్తూ నా కూతురి జీవితాన్ని

 

ఆమె ఆశలను నాశనం చేయలేను. నువ్వు రశ్మిని స్వతంత్రురాలిని చెయ్యి. నువ్వు ఆమెకు విడాకులు ఇవ్వక తప్పదు...."



'వీల్లేదు...వీల్లేదు...' రోహిత్ పెద్దగా అరిచాడు. అతని కేక క్షణం పాటు వాతావరణంలో మారు మోగింది. తర్వాత కొంచెంసేపు ఆ గదిలో మౌనం రాజ్యం చేసింది. ఆ మౌనంలో వేదన నిండి వుంది. భయం గొలిపే నిస్తబ్దత అక్కడ వ్యాపించి వుంది.

* * *

రోహిత్ ఆ గదిలో ఎంతో విసుగు ఫీలయ్యాడు. అక్కడ తనకు చాలినంత గాలి లేనట్లు అనిపించింది. బయటికి

చూశాడు. ద్వారం దగ్గర సిగ్నల్‌మాన్ కంబళి కప్పుకొని హాయిగా గురకపెట్టి నిద్ర పోతున్నాడు.

అతడు యుద్ధంలో ఓడిపోయిన వీరు నిలా చాలా సేపటి వరకు శూన్యంలోకి చూస్తూ వుండిపోయాడు. బయట ప్లాట్ ఫారం మీద శ్మశానంలో వుండే నిస్తబ్దత వ్యాపించి వుంది. అంతలో దూరాన ఏడుస్తున్న ఒక కుక్క స్వరం విని అతని ఒళ్ళు అతనికి తెలియకుండానే జలదరించింది. ఉన్నట్లుండి అతని చూపులు తన చేతిలో నుండి జారి కింద పడిన తాళంచెవుల గుత్తిపై పడ్డాయి.

రోహిత్ వంగి ఆ గుత్తిని అందు కున్నాడు. ఒకసారి తాళంచెవులను తర్వాత గదిలోని బీరువాను చూశాడు. ఆ బీరువాలోనే సోనియా ఇచ్చిన బ్రీఫ్ కేసు వుంది. ఆమె దాచి ఉంచమని ఇచ్చిన ఆ పెట్టెలో కనీసం ఏడెనిమిది లక్షల విలువైన డబ్బు, నగలు ఉన్నాయి. అతని కళ్ల ముందు ఆ ఆభరణాలు ధగధగ మెరవసాగాయి. ఈ డబ్బుకు మనిషిని మరో మనిషి నుండి వేరుచేసే బలవత్తరమైన శక్తి ఎలా వచ్చింది?

భార్యను తన భర్తనుండి, చెల్లెల్ని అన్ననుండి, కూతుర్ని తన తండ్రి నుండి వేరు చేసే శక్తి దానికుంది. డబ్బు కోసమే సోనియా తన తండ్రికి, బంధు వులకు దూరంగా పారిపోతోంది. తనకు, రశ్మికి వున్న అనుబంధం తెగిపోవడానికి కారణం డబ్బే. డబ్బులేని జీవితం ఎంత నిస్సారంగా, అస్తిత్వం లేనిదిగా మారి పోతూంది! డబ్బులేకపోవడం వలన కలిగే అనర్థాలు రోహిత్‌కు ఇప్పుడు అనుభవం లోకి వస్తున్నాయి.



రశ్మి తండ్రి తనతో అన్నమాటలు సింహగర్జనల్లాగా అతన్ని భయపెడు తున్నాయి.

ఆయన చెప్పింది కూడా నిజమే. తాను రశ్మికి ప్రేమను తప్పించి, ఇంకేం సుఖం ఇవ్వగలిగాడు? ఆయన తనను నిలదీసి అడగడంలో కొంత అర్థం లేకపోలేదు.

అతని మెదడులో చటుక్కున ఓ మెరుపులాంటి ఆలోచన తట్టింది.

రశ్మిని దూరం చేసుకొని తాను జీవించలేడు. తాను ఓటమిని అంగీకరించి మనలేడు. ఈ ఆలోచనతో అతని మనసు లోని చీకటి పొరల్లో దాగివున్న కోరికలు విజృంభించి, అతని అంతరాత్మను పీక నొక్కివేశాయి.

సోనియా తన దగ్గర దాచిన డబ్బును అపహరిస్తే అన్న భయంకరమయిన ఆలోచన అతని మంచితనాన్ని, మాన వత్వాన్ని, వివేచనను కబళించివేసింది.

తన సుఖం కోసం, రశ్మిని తన దానిగా చేసుకోవడం కోసం ఏ పనైనా, అదెంత చెడ్డపని అయినా, అక్రమమైనా చేయాలనే నిర్ణయానికి వచ్చాడు.

అతిథిగా వచ్చిన ఆ ఆగంతకురాలు ఎవరో, ఏ వూరికి చెందినదో అక్కడ ఎవరికీ తెలియదు. ఏకాంతంగా వున్న ఆ స్టేషనుకు ఆమె ఎప్పుడు వచ్చిందో, ఎప్పుడు వెళ్ళిందో, ఎక్కడికి వెళ్ళిందో ఎవరూ తెలుసుకోలేరు.

ఈ రహస్యాన్ని రహస్యంగానేవుంచి తన కోరిక నెరవేర్చుకోవాలంటే ఒకే ఒక మార్గం వుంది.

ఈ నిర్ణయానికి రాగానే రోహిత్ గది దాటి బయటికి వచ్చాడు. ఉదయం దాకా రైలుబండ్లు ఏవీ రావు అన్న ధైర్యంతో వర్కర్సందరూ గాఢంగా నిద్రపోతున్నారు. నిశ్శబ్దంగా ఉన్న

రాత్రికి పొగమంచు తన తెల్లటి దుప్పటి కప్పింది.

రోహిత్ ఆ పొగమంచులో ఎవరి కంటా పడకుండా దొంగవలె తన క్వార్టరు దగ్గరికి వెళ్లాడు. తలుపు దగ్గరికి వెళ్ళి మెల్లగా తాళం తీశాడు. చప్పుడుకాకుండా తలుపు తెరిచి ఇంట్లోకి వెళ్ళాడు. లోపల చీకటిగా ఉంది. కొన్ని క్షణాలు నిలబడి కళ్లు బాగా తెరిచి పరిశీలనగా చూశాడు. తర్వాత సోనియా పడుకొని వున్న సోఫాకేసి చూశాడు. సోనియా గాఢ నిద్రలో ఉంది.

అతడు పిల్లిలా శబ్దం కాకుండా నడిచి ఆమె దగ్గరికి వెళ్లాడు. కొంచెం సేపు తన గుండె దడ తగ్గేంతవరకు పక్కన నిలబడ్డాడు. తర్వాత తన అంతరాత్మ ప్రబోధాన్ని హృదయాంత రాళాల్లో సమాధి చేశాడు.

అతడు చివాలున గోడ దగ్గరికి వెళ్ళాడు. గుంజకు వున్న తాడును తీసుకొని వుచ్చులా మడిచాడు. ఆ తర్వాత మృగంపై దుముకుతున్న పులిలా వెళ్ళి సోనియా మెడకు తాడు వేసి గట్టిగా నొక్కాడు. సోనియా నిద్ర మేల్కొని అరవకుండా ఆమె నోరు, ముక్కు ఒక చేతితో గట్టిగా మూశాడు. ఆమె నిద్రలోనే మూల్గి ఉక్కిరిబిక్కిరై ప్రాణం వదిలింది.

ఆమె చనిపోయిందని నిర్ధారించుకో గానే రోహిత్ తృప్తిగా గాలి వదిలాడు. అటు ఇటు చూశాడు. చుట్టూ అదే నల్లని చీకటి, రయ్‌మంటూ వీస్తున్న చలిగాలి తప్ప వాతావరణంలో మార్పు ఏమీ లేదు.

సోనియా మరణించినందుకు అతనికి రవంతైనా బాధగాని, పశ్చాత్తాపం గాని కలుగలేదు. పైగా చిన్నగా నవ్వాడు. చటుక్కున ఏదో నిర్ణయానికి వచ్చిన వాడిలా ఒక గోనెసంచి తెచ్చి సోనియా శరీరాన్ని అందులో వేశాడు. ఆమె చెప్పు లను, స్టాండుపై వున్న బట్టలను కూడా సంచిలో వేశాడు.

తర్వాత దాని మూతిని బాగా తాడుతో కట్టి, బస్తాను ఈడ్చుకొని దొడ్డి వాకిలి దగ్గరకు వెళ్ళాడు. తలుపు తెరచి బస్తాను తలుపు బయట పెట్టాడు. అతని దొడ్డి వాకిలికి దగ్గర్లోనే రైలు పట్టాలున్నాయి. బయట చలిగాలి తీవ్రంగా వీస్తోంది పొగ మంచు వల్ల ఇళ్ళు, చెట్లు కూడా కనిపిం చడం లేదు. రోహిత్‌కు ఇవన్నీ పట్టలేదు. ఒక చిన్న పొద చాటున బస్తా పెట్టి మళ్ళీ ఇంట్లోకి వచ్చాడు.

కొన్ని నిముషాల తర్వాత ఆటో మేటిక్ ట్రాలీ ఒకటి రైలుపట్టాల మీద వేగంగా సాగిపోయింది. దానిపై కూర్చుని వున్న రోహిత్ పట్టాలు సరిగా వున్నదీ లేనిదీ గమనిస్తూ పోతున్నాడు. అతని సీటు కింద మూటలా కట్టివున్న ఒక బస్తావుంది. దానిలో సోనియా మృతదేహం వుంది. అతడా మృత శరీరాన్ని దూరంగా తీసుకొని వెళ్ళి దానిని నామరూపాలు లేకుండా చేయాలనే వుద్దేశంతో వెళ్తున్నాడు.

దట్టంగా వ్యాపించి వున్న పొగమంచు మూలంగా తననెవరూ చూడలేరనీ, చూసినా గుర్తించలేరనీ రోహిత్ విశ్వ సించాడు. తన ముఖంలో ఎలాంటి భయాందోళనలు కన్పించకుండా జాగ్రత్త పడ్డాడు.

సిగ్నల్ క్యాబిన్ పక్కగా ట్రాలీ పోతున్నప్పుడు డ్యూటీలోవున్న సిగ్నల్ మాన్ కిటికీలో నుండి తొంగి చూసి,

రోహిత్ అని గుర్తించి నమస్కారంచేసి చలికి వణుకుతున్న కంఠంతో ఆగి ఆగి అన్నాడు–"మాస్టరుగారూ...మనంచేసేది నౌకరీ మాత్రమే. మీరిలా ప్రాణాలకు తెగించి డ్యూటీ చేయడం ఎందుకు? మీరు ఎంత కష్టపడినా గవర్నమెంటు పది రూపాయలు కూడా ఎక్కువ ఇవ్వదు" అంటూ పెద్దగా నవ్వాడు.

"డ్యూటీ ఈజ్ డ్యూటీ" అంటూ రోహిత్ ముందుకు సాగిపోయాడు. ఆ చలిరాత్రిలో సిగ్నల్‌మాన్ నవ్వు చాలా దూరం వరకు అతన్ని వెంబడిస్తూనేవుంది.

కొంచెంసేపటికి అతడు ఔటర్ సిగ్నల్ దాటి సొరంగం దగ్గరికి వెళ్లాడు. ఆ సొరంగం దాటగానే పెద్ద అడవి మొదలవుతుంది.

రోహిత్ ట్రాలీతో సొరంగంలో ప్రవేశించాడు.

నాలుగు నిమిషాల తర్వాత ట్రాలీ బయటికి వచ్చింది.

ఇప్పుడు రోహిత్ సీటుకింద ఏమీలేదు.

అతడు సోనియా మృతదేహాన్ని ఆ సొరంగంలో రైలు పట్టాలమీద పెట్టి వచ్చాడు.

తన ఆఫీసులోని సేఫ్‌లో వున్న అపార ధనరాశికి ఏకైక హక్కుదారిణి, తనను అడగగలిగిన ఒకేఒక వ్యక్తి అయిన సోనియాను మంచుతో తడిసిన రాత్రిలో, మరెన్నడూ తిరిగిరాలేని లోకానికి పంపించి ఏమీ ఎరుగనివానిలా ట్రాలీని వేగంగా నడుపుతూ తన యధాస్థానానికి వస్తున్నాడు.ఇప్పుడతని నరాల్లో రక్తం వేడిగా, వేగంగా ప్రవహిస్తోంది. ఆరిపోయిన అతని ఆశలు ఇప్పుడు కొత్త మలుపు తిరిగి తారాజువ్వల్లా వెలుగుతున్నాయి.

అతడు ట్రాలీ వేగం పెంచాడు.

స్టేషన్లో ఇప్పుడు కొంచెం చీకటి కమ్ముకొని వుంది. అంతటా వెనుకటి వలెనే నిశ్శబ్దం, మంచు వ్యాపించి వున్నాయి. కాని...రోహిత్ హృదయంలో మాత్రం అంతులేని ఆనందం కోటి దీపాల కాంతివలె నిండిపోయింది. ఆ చీకటి చాటున దాగిన ఆశాజ్యోతి అతనికి అపరిమితమైన ఆనందాన్ని, వుత్తేజాన్ని కలిగిస్తోంది.

ఆ జ్యోతి అతని బాధలను, వేదనను పోగొట్టి నవ వసంతాన్ని తిరిగి తేగల సమర్థత కలిగివుంది.

కాలం నెమ్మదిగా జరిగిపోతోంది. కలకత్తా వెళ్ళే రైలు వచ్చే సమయం అయింది. రోహిత్ రైలు రావడానికి అవసరమయిన ఏర్పాట్లు చేస్తున్నాడు. ఫోన్‌లో మాట్లాడి ముందు స్టేషనో బండి బయలుదేరిందని తెలుసుకొన్నాడు. మధ్య మధ్య మూసివున్న బీరువాకేసి చూస్తున్నాడు. దాంట్లోనే సోనియాదాచిన డబ్బు రూపంలో అతని అదృష్టం దాగివుంది.

ఆ బ్రీఫ్‌కేసు ఒక్కరోజులోనే తన జీవితాన్ని మార్చివేయనున్నది. ఇహ తాను సుఖంగా, వైభవోపేతంగా రోజులు గడపవచ్చు. దీవాన్ సాహెబ్‌గారి గౌరవాన్ని, రశ్మి అనురాగాన్ని పొందవచ్చు. రశ్మికి ఆమె ఇష్టపడే జీవితాన్ని ఇవ్వవచ్చు. బహుశా తాను పూర్వజన్మలో చేసుకొన్న ఏదో పుణ్యం సోనియా రూపంలో ప్రత్యక్షమై వుంటుంది. అందుకే ఆమె తనకు అపారసంపదను అందించి అందుకోసం తన ప్రాణాలుకూడా అర్పించింది అనుకొన్నాడు.

సిగ్నల్ ఇవ్వగానే, ప్లాట్‌ఫారంమీద

రైలు వస్తున్నందుకు సూచనగా గంట గణగణ మోగింది. అతడు త్వరత్వరగా టేబులుమీద వున్న జెండాను అందుకొని ప్లాటుఫారం మీదకు వెళ్ళబోయాడు.

"స్టేషన్‌మాస్టరుగారూ!"

ఓ తీయటి కంఠం తనను పిలిచిన శబ్దం విని అతడు ఉలిక్కిపడ్డాడు. చివాలున తల పక్కకు తిప్పి అటువేపు చూశాడు.

ఎదురుగా ద్వారంలో చిరునవ్వులు చిందిస్తూ సోనియా నిలబడి వుంది. ఆమెను చూడగానే రోహిత్‌కు తన కాళ్ళ కింది భూమి గిరగిర తిరుగుతున్నట్లు, కృంగిపోతున్నట్లు అనిపించింది.

ఎవరి మృతదేహాన్నయితే తాను స్వయంగా రెండుగంటల క్రితం తీసుకొని వెళ్ళి టన్నెల్‌లో పట్టాలమీద పెట్టి వచ్చాడో, ఆమే...తన కళ్ళ ఎదుట నవ్వుతూ...సజీవంగా నిలబడి ఉండటం చూసి బిత్తరపోయాడు. అతని శరీరం భయంతో గడగడ వణుకుతోంది.

సోనియా కొద్దిక్షణాలు రోహిత్‌ను చూస్తూ వుండిపోయింది. తర్వాత అన్నది:-

"నా బ్రీఫ్‌కేస్ ఇలా ఇవ్వండి స్టేషన్ మాస్టరుగారూ!" ఆమె వయ్యారంగా తన చెయ్యి ముందుకు చాపింది.

"సోనియా! నీవు...నీవు..." వణుకుతున్న రోహిత్ పెదాలు అంతకంటే ఎక్కువ మాట్లాడలేకపోయాయి.

"నేనే స్టేషన్‌మాస్టరుగారూ...మీరు భలేవారే, నేను మిమ్మల్ని పూర్తిగా నమ్మివుంటే ఈ రైలుకూడా తప్పిపోయేది" ఆమె రెండడుగులు ముందుకు వేసి అన్నది.

"మీరు నన్ను నిద్ర లేపాలన్న విషయం మరచిపోయారు కదూ?"

"ఓహ్...కాదు...అవును...నేను... నేను బొత్తిగా మరచిపోయాను" రోహిత్ తడబడుతూ అన్నాడు.

"కాని నేను మరచిపోలేదు. నాకు రైలు దొరకాలని, మీకు ఇంకా ఇబ్బంది కలిగించకుండా త్వరగా నా గమ్యస్థానం చేరాలనే దేవుడు రాసిపెట్టాడు. అందుకే నాకు సరియైన సమయానికి మెలకువ వచ్చింది" అని ఓ క్షణం ఆగి అన్నది—

"కాని, మీరు నాతో అబద్ధం చెప్పారే?"

"అబద్ధమా...అబద్ధం ఏం చెప్పాను?" రోహిత్ మాటల్లో, అతని ప్రశ్నలో ఏదో నిగూఢ రహస్యం దాగివుందని సోనియా గ్రహించింది. కాని అతనితో ఎక్కువసేపు మాట్లాడి వివరాలు తెలుసుకోవడానికి తగిన సమయం ఆమెకు లేదు.

"అదేనండీ... మీ శ్రీమతి పుట్టింటికి వెళ్ళిందని నాతో చెప్పారుగా"

"అంటే... నువ్వంటున్నది రశ్మిని గురించా?"

"అవును. ఆమె మీతో అలిగి వెళ్ళిందట కదా?"

"అని నీతో ఎవరు చెప్పారు?"

"ఎవరో ఎందుకు? ఆమే స్వయంగా చెప్పింది"

"ఎప్పుడు? ఆమె నీకు ఎక్కడ చెప్పింది??"

"మీ ఇంట్లోనే! మీరు మీ మొండి పట్టుదల వదలలేదట. అందుకని ఆమే మీ దగ్గరికి వచ్చింది"

"అంటే! ఏమిటి నువ్వు చెప్పేది? నాకేమీ అర్థం కావడంలేదు"

"మీరు నా దగ్గరినుండి రాగానే ఆమె వచ్చింది. వాళ్ళ నాన్నతో దెబ్బలాడి వచ్చేసిందట. తన బావను కూడా ఎదిరించి అతడు చెప్పే మాటలు లెక్క—




చేయకుండా మీతోనే కలిసి వుండాలని నిర్ణయించుకొని వచ్చేసింది"

"ఏమిటీ... నువ్వు చెప్పేదంతా నిజమా?"

"'నా భర్త నన్ను తిరస్కరిస్తే ప్రాణాలయినా వదులుతాను కాని మళ్ళీ పుట్టింటికిమాత్రం పోను' అని నాతో అన్నది"

"మరి నువ్వు నాకు ఈ విషయం ఎందుకు కబురు చేయలేదు" రోహిత్ అయోమయంగా అడిగాడు.

"రశ్మి అక్కయ్యే వద్దన్నది. ఆమె మిమ్మల్ని అమితాశ్చర్యంలో ముంచివేయాలనుకొంది. మీకు తెలియదు కాని నేను కూడా ఆమెకు సహకరించాను"

"ఏం చేశావు?"

"నేనామెను బాగా అలంకరించి నేను పడుకొన్నచోటే పడుకోబెట్టాను. మీరు నన్ను లేపడానికి వచ్చినప్పుడు మీ అనురాగదేవతను చూసి సంతోష, విభ్రమాలతో ఉక్కిరిబిక్కిరి అవుతారని నాకు తెలుసు... త్వరగా వెళ్ళండేం!"

అంతలో ట్రెయిన్ స్టేషన్లో ప్రవేశిస్తున్న గడగడ శబ్దం వినిపించింది. సోనియా మరోసారి తన బ్రీఫ్‌కేసు విషయం గుర్తు చేస్తూ అన్నది – "త్వరగా నా బ్రీఫ్ ఇవ్వండి. రైలు వచ్చేసింది"

రోహిత్ బీరువా తెరచి వణుకుతున్న చేతులతో బ్రీఫ్‌కేసును సోనియాకు అందించాడు. అతడు బిత్తరపోయి చూస్తుంటే సోనియా అన్నది–"రోహిత్ బాబూ...జీవితంలో ఎప్పుడైనా ఈ దారిన వెళ్ళడం జరిగితే ఒక దినం మీ ఇంట్లో మీదంపతులకు అతిథిగా తప్పకవుంటాను. కాని నా సలహా ఒకటి గుర్తుంచుకోండి. జీవితంలో ఎందరో స్నేహితులు లభించవచ్చు. కాని రశ్మిలాంటి స్త్రీ ఎంతో అదృష్టవంతులకుగాని లభించదు. నేను మీకు పూర్తిగా అపరిచితురాలిని.... కేవలం కొన్ని గంటల అతిథిని. అయినా నామీద ఒట్టు–మీరు ఇకపై ఎప్పుడూ నా ప్రియమైన అక్కతో పేచీ పడకండి"

"ఒకమాట... నువ్వు వచ్చేటపుడు రశ్మికి చెప్పిరాలేదా?" రోహిత్ భయం భయంగా అడిగాడు.

"లేదు... ఆమెను నిద్రలేపడం అనవసరం అనుకొన్నాను. ఆమె ఉదయాన్నే లేచి కళ్ళు తెరవగానే తన ఆరాధ్య దైవాన్ని–అంటే మిమ్మల్ని చూడాలని నా కోరిక" అంటూనే ఆమె రైలు దగ్గరికి పరుగు తీసింది.

రోహిత్ కొంచెంసేపటి వరకు మౌనంగా సోనియా వైపే చూస్తూ ఉండిపోయాడు. సోనియా మాటలు వుండి వుండి అతని చెవుల్లో వందలు, వేలు, లక్షల రెట్లు అయి ప్రతిధ్వనిస్తూ, అతన్ని పిచ్చివానిలా చేస్తున్నాయి.

నిలబడే శక్తి లేనివాడిలా కుర్చీలో కూలబడ్డాడు.

రైలు స్టేషనులో ఆగింది. ఎక్కుతూ దిగుతున్న ప్రయాణీకుల గోల పెద్దగా వినిపిస్తోంది. కాని, ఆ శబ్దాలేవీ రోహిత్‌కు వినిపించడం లేదు.

టెలిఫోన్ గణగణ మోగుతోంది. కాని ఆ శబ్దం కూడా రోహిత్‌కు వినిపించడం లేదు.

కుర్చీలో ప్రాణం లేని అతని శరీరం మాత్రం ఉంది. అతని ఆత్మ తనను ప్రాణప్రదంగా ప్రేమించి, ప్రేమకోసం బలియైపోయిన రశ్మి ఆత్మను వెదుక్కొంటూ అనంతాకాశంలో దూరం... చాలా దూరం వెళ్ళిపోయింది. ★





గరల్స్ హైస్కూలు ఆఖరి సంవత్సరం విద్యార్థినులు, టీచరు పద్మజ, గైడెన్సులో విమానాశ్రయం చూడటానికి బయలుదేరారు. ఆడపిల్లలందరూ వరస క్రమంగా బేగంపేట విమానాశ్రయంలోకి వెళ్తున్నారు – పద్మజ టీచరు ముందు నడుస్తూ ఉంటే.

ఆడపిల్లలందరూ వాళ్లు చూడబోయే ఆ విమానాల్ని గురించి, ఏర్‌హోస్టెస్‌ల గురించి వివిధ రకాలుగా చర్చించుకుంటున్నారు.

"ఇక్కడి మేనేజరు మన పద్మజ టీచరు అన్నగారేనట. అందుకే మనకీ ఛాన్సు. లేకుంటే ఎవ్వర్నీ లోనికి రానియ్యరట" అంది అందరిలోనూ సిసింద్రీ ప్రసూన.

"రూపాయి టికెట్ కొంటే ఎవరైనా రానిస్తారు'' అంది మరో సిసింద్రీ ఎగతాళిగా.

దూరంగా వున్న ఒక బోయింగ్ వైపు వెళ్తోంది పద్మజ. ఆ వెనకనే బయల్దేరారు ఆడపిల్లలు.

''విమానాల్ని కనుక్కున్నది రైట్ బ్రదర్స్, 1755వ సంవత్సరంలో. వీటిల్లో ఎన్నో రకాలు. వాటిల్లో ప్రధానంగా మనం చూసేవి డకోటా, బోయింగ్. వాటికన్నా పెద్దవీ ఉన్నాయి. దాదాపు మూడువందల మంది ప్రయాణించడానికి వీలుగా ఉండేది ఎయిర్‌బస్. అదిగో ఇటు పక్కగా ఉంది చూడండి. ఇదే ఎయిర్‌బస్. దానికి...'' అలా మాట్లాడుతూ వెనక్కి చూసిన టీచరు పద్మజ ఆశ్చర్యపోయింది. తన వెనక ఒక్క అమ్మాయి కూడా లేకపోవడంతో. చచ్చేంత కోపం రావటంతో అటూ ఇటూ చూసింది 'వీళ్లంతా ఎక్కడికెళ్లారబ్బా' అనుకుంటూ.

దూరంగా గుంపుగూడి ఎవరితోనో మాట్లాడుతున్నారు ఆ ఆడపిల్లలందరూ. వాళ్లందరిమధ్య ఒక మగమనిషెవ్వరో వున్నాడు. దూరంనుండి పద్మజకతనెవరో ఆనవాలు తెలియడంలేదు.

కోపంతో గబగబా వాళ్లకేసి నడిచింది.

అందరమ్మాయిలు ఏదో మాట్లాడుతున్నారాయనతో. మధ్యవున్న మనిషిని పద్మజ చూసింది కళ్లు పెద్దవి చేసుకొని. ఆయన ఓ ప్రఖ్యాత సినిమా హీరో!

పద్మజకి పిల్లల వాలకం చూస్తే

వళ్లు మండింది. దగ్గరికెళ్లింది వాళ్లని చీవాట్లు పెడదామని. "ఛీఛీ...వీళ్లకసలు చదువుమీద ధ్యాసేలేదు. పిల్లలెలా పాడై పోతున్నారు వెధవ సినిమా మోజులో" అనుకుంటూ.

"మీకేమైనా బుద్ధుందా? ఇక్కడికి మనం వచ్చింది విమానాల గురించి తెలుసుకోవడానికి కానీ, ఇలా సినిమా హీరోలను చూడ్డానికా? అయినా ఆ ముసలాయనలో ఏముంది? మేకప్ లేకపోతే మామూలు మనిషేగా. ఏమిటంత పిచ్చి. ఇంతకీ మిమ్మల్నెవరినైనా పెళ్లి చేసుకుంటానన్నాడా?" అని కోపంతో పద్మజ అరవడంతో, ఆడపిల్లలందరూ గబగబా క్యూలోకి వచ్చేశారు. ఆ మొదటి విమానంవైపు నడిచి వెళ్లిపోయారు భయంగా వెనక్కైనా చూడకుండా.

వాళ్లంతా వెళ్లి, అక్కడ నిలబడ్డారే కానీ టీచరు మాత్రం ఇంకా రాలేదు. కొందరమ్మాయిలు ధైర్యంచేసి తలతిప్పి చూశారు. దూరంగా ఆ హీరోగారితో పద్మజ టీచరు నవ్వుతూ మాట్లాడుతోంది. చూస్తూవుండగానే జేబులోంచి పెన్ను తీసి, పద్మజ టీచరిచ్చిన పుస్తకంలో హీరోగారు ఏదో రాసాడు. కొద్ది నిమిషాల తర్వాత పద్మజ టీచరు వాళ్ల శిష్య బృందాన్ని చేరుకుంది చిరునవ్వుతో.

సిసింద్రీ ప్రసూన పద్మజ టీచర్ని అడిగింది అమాయకంగా "ఏం టీచర్! ఆ హీరోగారు మిమ్మల్ని పెళ్లిచేసుకుంటానన్నాడా?"

"షటప్-అంది పద్మజ" అప్పటిదాకా భుజాలమీంచి జారివున్న పవిటని పైకి లాక్కుంటూ....!

—నూకల సీతారామారావ్



# క్రమశిక్షణ

తమ జనరల్ మేనేజరుగారి గదిలోని గందరగోళం చూసి ఆశ్చర్యపోయాడు మేనేజరు రాజరత్నం. కుర్చీలు అటూ ఇటూ అస్తవ్యస్తంగా పడున్నాయి. బల్ల మీద పేపరు వెయిట్లు ఆ మూలనొకటి ఓరగా వుంటే, ఈ మూలనొకటి తల కిందులుంది. టేబిలు మధ్యగా పెన్‌స్టాండ్ అడ్డంగా పడుంది. కొన్ని ఫైళ్ళు తెరచుకుని రెపరెపలాడుతున్నాయి.

"సర్, ఏమిటిదంతా?" అని రాజరత్న మడిగితే, జనరల్ మేనేజరు—

"అదంతే" అని సున్నితంగా నవ్వి ఊరుకున్నాడు.

తమ ఆఫీసులోని సెక్రెటరీ పోస్టు ఖాళీకి ఈరోజు ఇంటర్వ్యూ ఉందని మాత్రం రాజరత్నంకు తెలుసు.

పొందిక, శుచి, శుభ్రం, క్రమపద్ధతులంటే ఈ జనరల్ మేనేజరుకు ప్రాణం. ఇవి లేనివారంటే ఆయనకు బహుచిరాకు. ఆరోజు తను ఇంటర్వ్యూ చేయబోయే అభ్యర్థుల్లో ఈ సుగుణాలున్నాయోలేవో తెలుసుకుందుకే తన గదిని ఆయనిలా అమర్చిపెట్టాడు.

ఇంటర్వ్యూ సరిగ్గా పదిన్నరకు ప్రారంభమయింది. ఒక్కొక్క అభ్యర్థే ఇంటర్వ్యూ ఇచ్చి వెడుతున్నాడు. కాని ఏ ఒక్క అభ్యర్థీ జనరల్ మేనేజరుగారి గదిలోని వస్తువుల అస్తవ్యస్తతని పట్టించుకోలేదు. ఈ కాలం కుర్రాళ్ళ మనస్తత్వం మీద జనరల్ మేనేజరుగారికి బహు ఆశ్చర్యమేసింది. తమ ఆఫీసు సెక్రెటరీ పోస్టుకు పిళ్ళెవ్వరూ పనికి రారనిపించింది. ఇంతలో ఆఖరి అభ్యర్థి బాలన్ తలుపు తెరుచుకుని లోపలికొచ్చాడు. దారికడ్డంగావున్న బల్ల అతని కాలికి కొట్టుకుని నరాలు జివ్వుమన్నాయి.బాలన్ గదినంతా ఒకసారి కలియజూసి ఆ బల్లను ఎత్తి దాని స్థానంలో ఉంచాడు. జనరల్ మేనేజరుగారు ఇదేమీ పట్టించుకోకుండా—

"జస్ట్ ఎ మినిట్" అని బాత్‌రూం వైపెళ్ళాడు.

ఒంటరిగా కూచునున్న బాలన్‌కు ఆ గదిలోని వాతావరణం ఏమీ నచ్చలేదు. ఉండబట్టలేక అతను లేచి ఎక్కడి వస్తువు అక్కడ సర్దేశాడు.

తిరిగొచ్చిన జనరల్‌మేనేజరుగారు తన స్టెనోని పిలిచి తమ ఆఫీసు సెక్రెటరీగా బాలన్‌ను నియమిస్తూ ఆర్డర్ని డిక్టేట్ చేశాడు. స్టెనో దాన్ని టైపు చెయ్యటానికని వెళ్ళిపోతూనే బాలన్ దిగ్గున లేచి రెండు చేతులూ జోడించి జనరల్ మేనేజరుగారికి నమస్కరిస్తూ "సర్, మీరు నాకి ఉద్యోగమిస్తున్నందుకు చాలా సంతోషంగా వుంది. కాని ఇంత పెద్ద కంపెనీకి జనరల్ మేనేజరయిన మీ గది తీరు చూసి ఈ కంపెనీ అస్తవ్యస్త వ్యవహారాల్ని అర్థం చేసుకోగలిగాను. ఏమాత్రం క్రమశిక్షణలేని కంపెనీలో నేను పనిచెయ్యదలచుకోలేదు"

అని చకచకా బయటికి నడిచిపొయ్యాడు.

—రామ్

---

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications
Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly
Eenadu Compound, Hyderabad - 500 004.

జూన్ 9వ తేదీకి వందరోజులు పూర్తిచేసుకుంటున్న చిత్రం

ఉషాకిరణ్ మూవీస్

# శ్రీవారికి ప్రేమలేఖ

- జంధ్యాల -

రామోజీరావు

రమేష్‌నాయుడు-గోపాలరెడ్డి

నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు



CHATURA Telugu Monthly, Hyderabad-500 004, Regd. No. H/HD/




# "ఉహూ, ఉబుసుపోక కబుర్లకు నాకు తీరిక లేదు. చిట్‌చాట్‌కైతేనా ఎప్పుడూ సిద్ధమే!"



"ఇదిగో, ఇది కాస్త దాచి ఉంచండి. పనికొస్తుంది. ఆఫీసు దినచర్యలో మీ విరామ సమయాలు ఆనందించడానికి చిట్ చాట్‌కు దీటైనది మరొకటి లేదు.

చిట్ చాట్ ఉంటే ఇక కబుర్లతో పనేమిటి? పార్లేవారి ఈ సంచలనాత్మక బిస్కట్ రుచి రుచిగా నోటివిందులు చేయడంలో సాటి లేనిది. దీని జీలకర్ర సువాసనా, వెల్లుల్లి పాయల చిరు చిరు చురుకుదనం అంతా సరైన పాళ్లలో ఉంటుంది. అందుకే దీనిది అలాటిలాటి రుచి కాదు. అదొక గొప్ప అనుభవం!

నిజానికి మా బాస్‌కూ నాకూ ఏకాభిప్రాయం ఉన్నది ఇదొక్కదానిపైనే అంటే నమ్మండి!"







**చిట్‌చాట్** జీలకర్ర బిస్కట్లు

నగరంలో ఎక్కడ చూసినా
కరకరలాడిస్తున్న సంచలనాత్మక చర్చలే.